# అపరాధ పరిశోధన

రూ. 5 సెప్టెంబరు '81

సప్లిమెంట్



అపరాధ పరిశోధన అనుబంధం—93

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## తిప్పిపంపిన వజ్రం

రచన : వాణిశ్రీ

## వింత వృక్షం

రచన : వసుంధర

## నేరాలను కనిపెట్టే యంత్రం

రచన : ఎమ్. వి. వి. సత్యనారాయణ

## బావిలో శవాలు

రచన : సికిందర్

రక్తం త్రాగే పిశాచం - మూడవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్ — 93
సెప్టెంబరు, 1981
వెల: రు. 5-00
ఏడాది చందా 60 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. పీ. మోహన్రావ్
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

Ranga Rao

# త్రిప్పిపంపిన వజ్రం!

**వాణిశ్రీ**

ట్రైన్ కదిలిన తర్వాత దాదాపు పరుగెత్తుతూ వచ్చి ఎక్కింది ఆమె.

ఆమె చేతిలోవున్న పసుపు రంగు సూట్ కేస్ క్రింద పెట్టి 'హమ్మయ్య' అనుకుంటూ అలుపు తీర్చుకుంది.

ఆమె ఎర్రగా, సన్నగా విరజాజి తీగెలా నాజూకుగా వుంది. వంకాయ రంగు బ్లౌజు, అదేరంగు షిఫాన్ చీర కట్టుకుంది. ఆమె చీర కట్టుకున్న తీరు అందర్నీ ఆకర్షించింది. బ్లౌజుకీ చీరకీ మధ్యవున్న జానెడు భాగం మేలిమి బంగారపు చర్మంలా మిలమిల మెరిసిపోతూ వుంటే మగాళ్ళు గుటకలు మింగుతూ గుడ్లప్పగించారు.

నక్షత్రాల్లా మెరిసిపోతున్న కళ్ళు గుండ్రంగా త్రిప్పి ఆమె లావణ్య దగ్గరికి వచ్చి "ప్లీజ్!" అంది.

లావణ్య కొంచెం సర్దుకుని కూర్చుని ఆమెకు చోటు ఇచ్చింది.

ఆమె "థాంక్స్" అంది.

లావణ్య "మెన్షన్ నాట్" అని నవ్వింది.

"మీరు తెలుగువాళ్ళా?" హిందీలో అడిగింది ఆమె.

"అవును" అంది లావణ్య.

"మేమూ తెలుగువాళ్ళమే. నా పేరు గిరిజ."

"ఎక్కడవరకూ వెళ్తున్నారు?"

"హైదరాబాద్" చెప్పింది గిరిజ.

"నేనూ అక్కడికే."

"గుడ్. నాకు మంచి కంపెనీ దొరికింది. లేకపోతే కొంచెం బోర్ ఫీలయ్యేదాన్ని" గలగలా నవ్వింది గిరిజ.

"హైదరాబాద్ మీ నేటివ్వా?" ప్రశ్నించింది లావణ్య.

"కాదు. బిజినెస్ మీద వెళ్తున్నాను."

"మీరు బిజినెస్ చేస్తుంటారా?" కొంచెం ఆశ్చర్యపోతూ అడిగింది లావణ్య.

"నో.... నేనుకాదు బిజినెస్ చేసేది. జెస్ట్ ఐ యామ్ సేల్స్ రిప్రజెంటివ్. రోజా ప్రోడక్ట్స్‌లో నేను పని చేస్తున్నాను."

"ఐ.సీ...."

"ఈమధ్య వాళ్ళు సెంటెడ్ కుంకుమ తయారుచేస్తున్నారు. చాలా బాగుంటుంది. ఎరుపు కాదు, రోజారంగు కాకుండా బచ్చలిపండు రంగులో.... వెరీ నైస్...." అంటూ గిరిజ సూట్‌కేసు తీసి ఒక కుంకుమభరణి లావణ్యా చేతికి అందించింది. సూట్‌కేస్ నిండా అవే వున్నాయి.

లోటస్ ఆకారంలోవున్న ప్లాస్టిక్ పెట్టెలో వుంది కుంకుమ. ప్యాకింగ్ చాలా బాగుంది. కంపార్టుమెంటులో వున్న ఆడవాళ్ళంతా దానిపట్ల ఆకర్షితులయ్యారు. వాటిని అమ్మమని కొందరు అడిగారు. అయితే గిరిజ అమ్మలేదు.

హైదరాబాద్‌లో స్టాకిస్టులకు ఇవ్వడానికి వాటిని శాంపిల్స్‌గా పట్టుకెళ్తున్నాని చెప్పింది.

లావణ్య కుంకుమ భరిణ తిరిగి ఇవ్వబోయింది.

"వుంచండి. మన పరిచయానికి చిహ్నంగా!" నవ్వుతూ అంది గిరిజ.

"మీకు షార్టేజీ ఏమో!"

"ఫరవాలేదు."

బొంబాయినుంచి పూనా వెళ్ళేవరకూ వాళ్ళిద్దరూ ఎన్నో కబుర్లు చెప్పుకుంటూ కాలక్షేపం చేశారు.

లావణ్య తను స్వయంగా చేసి తమ్ముళ్ళకోసం తీసికెళుతున్న కజ్జోరీల ప్యాకెట్ విప్పి గిరిజకు ఇచ్చింది. గిరిజ తను కొన్న బిస్కట్లు లావణ్యకు అందించింది.

పూనాలో ట్రెయిన్ ఆగినప్పుడు ఎవరో ఒక యువకుడు మరాఠిలో మాట్లాడి గిరిజను దిగి రమ్మన్నాడు. గిరిజ వెళ్తూ వెళ్తూ సూట్‌కేస్ చూస్తూవుండమని చెప్పి సీటు క్రిందకు నెట్టింది.

ట్రెయిన్ కదిలిందిగాని గిరిజ ఎక్కడా కనిపించలేదు. లావణ్య ప్లాట్‌ఫారం మీద చూసింది. ఆమె కనిపించలేదు.

'గమ్మత్తుగా వుందే' అనుకుంది.

ఆమె కోసం వచ్చిన అతను ఎవరో? బహుశా బాయ్ ఫ్రెండా? అతను పిలవగానే వెళ్ళిపోయింది. తను ప్రయాణం చేస్తున్న సంగతి మర్చిపోయిందేమో?

దారిపొడుగునా ఇవే ఆలోచనలు లావణ్యకు.

'ప్రేమలో సర్వం మర్చిపోయే మత్తు ఏదో వుందేమో' అనుకుని నవ్వుకుంది లావణ్య.

స్టేషన్‌లో బండి ఆగగానే కిశోర్ కంపార్టుమెంట్లన్నీ

పతకసా గాడు లావణ్యకోసం.

"కిశోర్!" కేకపెట్టింది లావణ్య.

కిశోర్ ముఖం వెలిగిపోయింది చాలా రోజుల తర్వాత అక్కని చూసిన ఆనందంతో.

"రెండు సూట్ కేసులు తెచ్చావేమిటక్కా? మన ఇంట్లో బొంబాయి చీరల ప్రదర్శన ఏర్పాటు చేస్తున్నావా?"

"ఏడిశావ్ లే వెధవ జోక్ లూ నువ్వూనూ! అందులో ఒకటి మనదికాదు" నవ్వుతూ అంది లావణ్య.

"మరి?"

"గిరిజ అనే అమ్మాయిది."

"నీ ఫ్రెండా?"

"వూఁ.... ట్రెయిన్ లో పరిచయమైంది. సేల్స్ రిప్రజెంటివ్ లే."

"ఎక్కడ ఆ అమ్మాయి?"

"పూనాలో దిగింది. సూట్ కేసు చూస్తూవుండమంది. మళ్ళీరాలేదు." జరిగిందంతా వివరంగా చెప్పింది లావణ్య.

"ఎలా మరి?" అన్నాడు కిషోర్.

"ఎలా ఏవుంది? నేను బొంబే వెళ్ళినప్పుడు వాళ్ళ ఆఫీసుకు వెళ్ళి ఇచ్చేస్తాను" అంది లావణ్య.

కిశోర్ నిరుత్సాహపడ్డాడు గిరిజ అనే సేల్స్ రిప్రజెంటివ్ ని తను కలుసుకోలేకపోయినందుకు.

"మన ఇంటి అడ్రస్ ఇస్తే బాగుండేది కదా?" అన్నాడు.

"బాగుందిరా నువ్వు చెప్పేది? ఆమె బండి దిగి మళ్ళీ రాదని నేను కలగన్నానా?" అంది నవ్వుతూ.

ఇద్దరూ ఒక ఆటోలో ఎక్కి మలక్ పేట పోనివ్వమన్నారు.

## 2

గిరిజ హడావిడిగా హేమంత ఇంటర్నేషనల్ హోటల్ రిసెప్షన్ దగ్గరకి వచ్చి "నాకొక సింగిల్ రూమ్ కావాలి" అంది.

రిసెప్షనిస్టు గిరిజవైపు ఆశ్చర్యంగా చూసింది. ఆమె ఎంతో ఆందోళనతో పరిగెత్తుకుని రావడం గమనించింది. ఎందుకలా కంగారుగా వుంది. ఎవరైనా ఆమెను వెంబడిస్తున్నారా?

గాజు కిటికీలోనుంచి చూసింది రిసెప్షనిస్టు. గిరిజ ఎక్కి వచ్చిన ఆటో వెళ్ళిపోతోంది.

"మీ లగేజి ఏది?"

"లగేజి ట్రెయిన్‌లో పోయింది" అంది గిరిజ.

"సారీ మేడమ్! లగేజి లేకుండా వచ్చినవాళ్ళకు మా హోటల్లో రూమ్స్ ఇవ్వకూడదని మాకు స్ట్రిక్ట్ ఇనస్ట్రక్షన్స్ వున్నాయి" అంది ఆమె.

ఆమె అలా అనేసరికి గిరిజ ముఖం కోపంతోను, అవమానంతోను ఎర్రబడింది.

"కస్టమర్స్‌ని అవమానించమని కూడా మీ కంపెనీ ఇనస్ట్రక్షన్స్ ఇవ్వలేదా? నేను వారానికొకసారైనా హైదరాబాద్ వస్తుంటాను. లగేజివున్నా లేకపోయినా రూమ్స్ ఇవ్వకుండా యెవరూ నన్ను అవమానించలేదు" అంది గిరిజ.

రిసెప్షనిస్టు నవ్వింది.

"సారీ మేడమ్! ఐ యామ్ హెల్ప్‌లెస్" అంది.

"నేను మీ ప్రొప్రయిటర్‌తో మాట్లాడాలి. కనెక్షన్

ఇవ్వండి" అని ఆమె ఫోన్ రిసీవర్ యెత్తింది.

"దట్సాల్ రైట్" అని ఆమె ప్రొప్రయిటర్ రెసిడెన్స్ నెంబర్ డైల్ చేసింది.

"మోహన్‌లాల్ స్పీకింగ్ ప్లీజ్" అనే మాటలు వినిపించాయి.

"లాల్ జీ నమస్తే!"

"నమస్తే! నమస్తే! కౌన్?"

గిరిజ హిందీలో మాట్లాడసాగింది.

"లాల్ జీ నేను గిరిజను మాట్లాడుతున్నాను. నేనొక పెద్ద గొడవలో చిక్కుకున్నాను. పూనాలో స్టేషన్ దిగి ఒక ఫ్రెండ్‌తో మాట్లాడుతూ నిల్చుంటే గొడవజరిగింది. నేను ట్రెయిన్ యెక్కలేకపోయాను. ట్రెయిన్ సికింద్రాబాద్ వెళ్ళిపోయింది. నా సూట్ కేస్ అందులో వుండిపోయింది. లాల్ జీ నేనిప్పుడు మీ హేమంత ఇంటర్నేషనల్ హోటల్లోనుంచి మాట్లాడుతున్నాను. మీ రిసెప్షనిస్టు నాకు లగేజీ లేదని రూమ్ ఇవ్వడానికి వీల్లేదని అంటోంది."

"ఫోన్ రిసెప్షనిస్టుకి ఇవ్వు" అన్నాడు మోహన్‌లాల్.

గిరిజ గర్వంగా ఆమెవైపు చూసి "మీ బాస్‌తో మాట్లాడండి" అంది.

రిసెప్షనిస్టు రిసీవర్ అందుకుని "యస్ బాస్" అంది.

"గిరిజ అనే అమ్మాయికి రూమ్ ఇవ్వు. ఇప్పుడేకాదు. యెప్పుడొచ్చినా అభ్యంతర పెట్టకుండా ఇవ్వాలి. మైండిట్."

"యస్. బాస్" అంది ఆమె ముఖం మాడ్చుకుని.

గిరిజ రూమ్‌లోకి వెళ్ళగానే బోల్టువేసేసి టెలిఫోన్ రిసీవర్ యెత్తి బాంబేలో ఒక నెంబర్‌కి అర్జెంట్ కాల్

బుక్ చేసింది.

ఫోను బేసుంచి పలికాడు జిగ్రీ.

"బాస్ నేను గిరిజను."

"వెరీగుడ్. పని పూర్తయిందా?"

"సారీ బాస్ అప్ సెట్టయిపోయింది అంతా!"

"ఏం జరిగింది పోలీసులు పట్టుకున్నారా?" జిగ్రీ గొంతులో ఆందోళన వినిపించింది.

"లేదు బాస్. పూనాలో వినోద్ కన్పించి నన్ను ట్రెయిన్ దిగి రమ్మన్నాడు. నేను సూట్ కేస్ లావణ్య అనే అమ్మాయికి అప్పగించి అతనివెంట వెళ్ళాను. ఇన్సాఫ్ మురావాళ్ళు నన్ను వెంబడిస్తున్నారనీ, సికింద్రాబాద్ చేరేలోపల సరుకు దొంగిలిస్తారని చెప్పాడు. ఇన్సాఫ్ మురావాళ్ళు యెలా కనిపెట్టారో నాకు అర్థంకాలేదు. నాకు అప్పుడు భయంవేసింది. ఏం చేయాలని నేను వినోద్‌ని సలహా అడిగాను. పూనాలో దిగి సరుకు అక్కడే ఒక సేఠ్‌కి అమ్మేస్తే మంచిది అన్నాడు. కాని అక్కడ పెద్దగా రేటు రాదని సంశయిస్తున్నాను. యింతలో ఇన్సాఫ్ మురావాళ్ళు వినోద్ మీద దాడిచేశారు. బాస్ వినోద్‌ని వాళ్ళు చంపేశారు. నేను భయపడి పారిపోయాను. ఈ లోపల ట్రెయిన్ వెళ్ళిపోయింది. నేను బస్సులో హైదరాబాద్ చేరుకున్నాను."

"సూట్ కేస్ దొరికిందా?"

"లేదు బాస్. నేను సికింద్రాబాద్ స్టేషన్‌కి చేరే సరికి ఆ ట్రెయిన్ వచ్చి చాలాసేపయింది. అక్కడ లావణ్యలేదు బాస్."

"పోనీ ఆమె అడ్రస్ తెలుసుకున్నావా?"

"లేదు బాస్!"

జిగ్రీ మండిపడ్డాడు.

"యూ బిచ్! ఐ విల్ కిల్ యూ!"

"సారీ బాస్! నాకు లావణ్య బాగా తెలుసు. నేను ఆమెను యెలాగైనా కలుసుకుంటాను."

"నువ్వు యెక్కడున్నావు?"

"హేమంత ఇంటర్నేషనల్, రూమ్ నెంబర్ వన్ ఫార్టీ త్రీ బాస్."

"సూట్ కేస్ దొరికేవరకు నువ్వు అక్కడే వుండు. కదిలావా జాగ్రత్త. నువ్వు చెప్పేదంతా నిజమా కాదా? నేను తెలుసుకుంటాను" కఠినంగా వినిపించింది జిగ్రీ గొంతు.

"ప్రామిస్ బాస్. నేను నిజమే చెప్తున్నాను. మోసం చేసే అలవాటు నాకు లేదు బాస్" గిరిజ గొంతు భయంతో వణికింది.

"గిరిజా! నీలాంటి వాళ్ళను లెక్కలేనంతమందిని చూశాను. సూట్ కేస్ పోయిందా నీ పని ఖాళీ."

జిగ్రీ రిసీవర్ పెట్టేశాడు.

"బాస్....బాస్!...." అని కేకలు పెట్టింది గిరిజ.

## 3

జిగ్రీ పెగ్గుమీద పెగ్గు లాగిస్తున్నాడు.

ఖాళీ గ్లాసుని విస్కీతోనింపి ఐస్ క్యూబ్స్ వేసి సోడా కలిపి అందిస్తోంది అమీనా.

అమీనా ఎర్రగా టమోటా పండులా నిగనిగలాడుతోంది.

జిగ్రీకంటే పొడుగ్గా వుంది అమీనా. ఆమెకు ఇరవై ఏళ్ళుంటాయి. సౌష్టవమైన శరీరంతో ఆరోగ్యంగా

అందంగా వుంది.

ఆమె నవ్వుతూవుంటే చెక్కిళ్ళు సొట్టలుపడి ఆమె అందం రెట్టింపు అయి జిగ్రీని రెచ్చగొడ్తోంది.

ఆమె పెదవులకు లిప్ స్టిక్ పూసుకుని దొండపండ్లలా కనిపిస్తున్నాయి. నీలంరంగు దుస్తుల్లో ట్రిమ్ముగా మేకప్ చేసుకుంది. జిగ్రీ ఆమె నడుంమీద చెయ్యివేసి దగ్గరికి లాక్కుంటున్నాడు.

టెలిఫోన్ మ్రోగింది.

జిగ్రీ రిసీవర్ ఎత్తి "కౌన్! మై జిగ్రీ...." అన్నాడు.

"అరె యార్ మై ఇన్సాఫ్!"

"క్యా బాత్ హై?"

"నా ఏరియాకు వచ్చి దౌర్జన్యంచేసి దొంగతనం చెయ్యడం ఏమీ బాగోలేదు భాయ్!" ఇన్సాఫ్ గొంతు కఠినంగా పలికింది.

"అది నీ ఏరియాకాదు. ఆ సేట్ నీ ఏరియావాడు కావొచ్చు. కాని దొంగతనం జరిగింది మా ఏరియా లోనే."

"సరే ఏదో జరిగింది పోనీ. సరుకులో సగం నాకు ఇచ్చేయ్ భాయ్. మనలో మనకి గొడవలు వద్దు."

"ఈమాట ముందే అడిగితే కథ వేరేగా వుండేది. నువ్వు అతి తెలివిగా వినోద్ ని వెంబడించావు. అతన్ని ఖూనీచేశావు. సరుకు దొరక్క కాళ్ళ బేరానికి వచ్చావు. ఈ స్థితిలో నేను రాజీకి రావడం అనేది జరగదు" కోపంగా అన్నాడు జిగ్రీ.

"వినోద్ ని ఎవరు ఖూనీచేశారో నాకు తెలీదు భాయ్! నిజంగా చెపుతున్నా!"

"నాకన్నీ తెలుసు. మిష్టర్ ఇన్సాఫ్. నీ మాయా

మాటలు నమ్మే తెలివి తక్కువ వాడిని కాను."

"సరే నీ ఇష్టం. కాని సరుకు ఎక్కడున్నా నేను చిక్కించుకుంటానని గ్రహిస్తే మంచిది" ఇన్నాఫ్ రిసీవర్ పెట్టేసిన శబ్దం వచ్చింది.

"బద్మాష్!...." అంటూ ఇన్నాఫ్‌ని బూతులు తిట్టాడు జిగ్రీ.

"గిరిజ భలే ప్లాన్ వేసింది" అంటూ నవ్వింది అమీనా.

"ఏమిటి నవ్వు నేది?" అన్నాడు జిగ్రీ కోపంగా చూస్తూ.

"బాస్! సరుకు పరాయివాళ్ళ దగ్గర వదిలేసి వెళ్ళిపోయేంత తెలివితక్కువ దద్దమ్మా గిరిజ?"

జిగ్రీ అయోమయంగా చూశాడు ఆమె వైపు.

"ఇందులో గిరిజ నాటకం వుందని నా అనుమానం బాస్. సరుకు ఎక్కడో దాచింది. బహుశా ఇంట్లోనే దాచిందేమో? ఇన్నాఫ్‌కి ఇన్ఫర్మేషన్ యిచ్చి నిన్నీ గొడవలో యిరికించి తను బాగుపడిపోవాలనుకుంటున్నదేమో?"

నిషామీద వున్న జిగ్రీ గిరిజమీద మండిపడ్డాడు.

"నాకు చెయ్యిచ్చినదాన్ని బ్రతకనిస్తానా?" అంటూ అప్పటికప్పుడే గిరిజ వుంటున్న ఫ్లాట్‌కి జీప్‌లో బయల్దేరాడు జిగ్రీ.

అప్పుడు మధ్యాహ్నం రెండు గంటలు దాటింది.

గిరిజ తల్లి తులశమ్మ భోజనంచేసి తలుపులు వారగా వేసి నిద్రపోతోంది.

భళ్ళున తలుపులు తెరుచుకున్న శబ్దానికి తులశమ్మ ఉలిక్కిపడి లేచింది.

ఎదురుగా వున్న మనిషిని చూసి ఆమె ప్రాణాలు పైపైకి ఎగిరిపోయాయి.

పొట్టిగా నల్లగా, పెద్ద పెద్ద మీసాలు, ఎర్రబడిన కళ్ళతో వున్నాడు జిగ్రీ.

కెవ్వున కేక వేయబోయి భయంతో వణుకుతూ వుండి పోయింది తులశమ్మ.

"తుమ్ కౌన్ హై?" గర్జించాడు జిగ్రీ.

తులశమ్మకి నోట మాటరాలేదు.

"కహా హై గిరిజా?"

"హైద్రాబాద్ గయే బేటా!" గొంతు పెగల్చుకుని అంది తులశమ్మ.

"గిరిజ దాచిన సూట్ కేస్ ఎక్కడ?"

"సూట్ కేస్ ఏమిటి బేటా?"

"మర్యాదగా చెప్పవే ముసలీ" అని జిగ్రీ తులశమ్మ కొప్పు పట్టుకుని లాగాడు.

"నాకేమీ తెలియదు బేటా!" అని తులశమ్మ గిజగిజ లాడింది పులి నోట్లోపడ్డ మేకలా.

జిగ్రీ బెల్టువిప్పి నాలుగు బాదాడు. ఇల్లంతా చిందర వందర చేశాడు. అతనికి యెక్కడా సరుకు దొరకలేదు. తులశమ్మని బూతులు తిట్టి, బూటుకాలితో తన్ని వెళ్ళి పోయాడు.

## 4

"ఇన్స్టాఫ్ భయ్యా! జిగ్రీ గిరిజనే అమ్మాయి ఇంటికి వెళ్ళివస్తుంటే చూశాను" ఫోన్‌లో చెప్పాడు జగదీశ్.

"నువ్వు వెంబడించి సంగతి ఏమిటో కనుక్కోలేక పోయావా?" అన్నాడు ఇన్స్టాఫ్.

"చాలా డేంజర్. వాడికి నేను గుర్తే. చూశాడంటే

ముక్కలు విరగతంతాడు. అందుకే చాటుగా వున్నాను."

"గిరిజ ఎవరు?"

"ఏమో! ఫ్లాట్ ముందు నేమ్ వుంది. అంతవరకే చూశాను."

"సరే ఆ గిరిజ ఎవరో ఎలా వుంటుందో కనుక్కో. వీలైతే ఆమె ఫోటో సంపాదించు."

"ఎలా భయ్యా!"

"గిరిజ ఫ్లాట్ లో వుంటే బైటకు వచ్చే వరకూ వెయిట్ చేసి ఫోటో తీసే ఏర్పాటు చెయ్యి. ఇంట్లో లేకపోతే వాళ్ళ వాళ్ళద్వారా ట్రై చెయ్యి."

"ట్రై చేస్తాను భయ్యా!" అన్నాడు జగదీశ్.

ఫోన్ పెట్టేసి పబ్లిక్ టెలిఫోన్ బూత్ నుంచి బైటకు వచ్చాడు జగదీశ్.

దూరంగా గిరిజ వుంటున్న ఫ్లాట్ దగ్గర జనం గుమి గూడి వున్నారు.

జిగ్రీగాడు ఏదో గొడవచేసి వెళ్ళివుంటాడని జగదీశ్ వూహించాడు.

అతనికి మెరుపులా ఒక ఆలోచన వచ్చింది. ఒక పోలీస్ హెడ్ కనిస్టేబుల్ ని పట్టుకుని తనకి ఆ ఫ్లాట్ లో వున్న అమ్మాయి ఫోటో కావాలని చెప్పాడు. జిగ్రీ అక్కడికి వెళ్ళి ఏదో గొడవచేసి వెళ్ళాడని ఇన్ఫర మేషన్ ఇచ్చాడు. ఆ హెడ్ జగదీశ్ కి పాత మిత్రుడే. సరేనని గిరిజ ఫ్లాట్ కి వెళ్ళాడు.

హెడ్ వెళ్ళేసరికి గుంపుగా వున్న జనం అతనికి దారి ఇచ్చారు.

"ఏం జరిగింది?" అన్నాడు హెడ్.

తులశమ్మ ముక్కుతూ మూలుగుతూ జరిగిన కధంతా

చెప్పింది. ఆ జిగ్రీగాడు కొట్టిన దెబ్బలు చూపించి ఏడ్చింది.

"వాడెవడు. నీకు తెలుసా? ఇంతకుముందు ఎప్పుడైనా చూశావా?" అని ప్రశ్నించాడు హెడ్.

"లేదు బాబూ!"

"వాడొచ్చి సూట్‌కేసు అడిగాడంటే ఇందులో ఏదో గొడవ వుంది? మీ అమ్మాయి ఎక్కడ పనిచేస్తుంది?"

"శోభా కంపెనీలో."

"అతను ఆ కంపెనీ తాలూకా మనిషేమో కనుక్కున్నావా?"

"లేదు బాబు. నన్ను ఏమీ మాట్లాడనివ్వలేదు."

"మీ అమ్మాయి ఎక్కడుంది?"

"కంపెనీ పనిమీద హైదరాబాద్ వెళ్ళింది."

"ఆ సంగతి వాడికి చెప్పావా?"

"ఆ...."

"కొంప మునిగింది. వాడు మీ అమ్మాయి కోసం హైదరాబాద్ వెళ్తాడేమో! ఇందులో ఏదో గొడవ వుంది."

"ఇప్పుడేం చెయ్యాలి బాబూ!" అని తులశమ్మ ఏడుపు లంకించుకుంది.

"మీ అమ్మాయి ఫోటో వుంటే ఇవ్వు. దాన్ని హైదరాబాద్‌లో పోలీసులకు పంపించి ఆమెను రక్షిస్తాం."

తులశమ్మ బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి టేబుల్ మీద ఫ్రేమ్‌లో వున్న గిరిజ ఫోటో తెచ్చి ఇచ్చింది.

"హైదరాబాద్‌లో యెక్కడుంటుందో నీకు తెలుసా?"

"నాకేం తెలీదు బాబూ!" అంది తులశమ్మ.

"సరే! అదంతా మేం కనుక్కుంటాం. నువ్వేం భయ పడకు" అని హెడ్ గిరిజ ఫోటో సంపాదించి తెచ్చి జగదీశ్ చేతిలో పెట్టాడు.

జగదీశ్ ఆ ఫోటో తీసుకెళ్ళి ఇన్సాఫ్ చేతిలో పెట్టాడు.

ఇన్సాఫ్ ముఠాలో అశోక్ గిరిజ ఫోటో చూసి ఆమెను గుర్తుపట్టాడు.

"భాయ్! దీన్ని నేను చూశాను" అన్నాడు.

"యెక్కడ?"

"పూనా స్టేషన్‌లో వినోద్ మీద పడ్డప్పుడు. ఇది వాడి దగ్గర వుంది. తర్వాత యెటో మాయమైంది" అన్నాడు అశోక్.

"ఇప్పుడు నాకు అంతా అర్థమైంది. జిగ్రీగాడి మాయ తెలిసింది. వాడు సరుకు సూట్‌కేసులో పెట్టి గిరిజ ద్వారా పంపించాడు. వినోద్ ఆమెకు బాడీగార్డు. సరుకు వాడిదగ్గర లేదు."

"అంతే భాయ్! దాన్ని పట్టుకుంటే దొరికిపోయేది. వినోద్‌ని అనవసరంగా ఖూనీ చేశాం" అన్నాడు అశోక్.

"సరే! అది ఇప్పుడు యెక్కడుందో? వరస చూస్తే అది జిగ్రీగాడికి గూడా ధోకా యిచ్చినట్లే వుంది. లేక పోతే వాడు దాని ఫ్లాట్‌కి వెళ్ళి గొడవ చెయ్యాల్సిన పని ఏముంది?" అన్నాడు ఇన్సాఫ్.

అతని అనుచరులు యెవరూ మాట్లాడలేదు.

"జిగ్రీ మనుషుల్ని ఒక కంట కనిపెట్టి వుండండి. అశోక్ నువ్వు హైద్రాబాద్‌లో మకాం పెట్టు. ఆ గిరిజ అక్కడే వెళ్ళివుంటుందని నా అనుమానం. జిగ్రీ దొంగ

సరుకు అక్కడే అమ్మేస్తాడని నాకు ఇన్ఫర్మేషన్ అందింది" అన్నాడు ఇన్సాఫ్.

## 5

గిరిజ లావణ్య కోసం హైదరాబాద్, సికింద్రాబాద్ అంతా గాలిస్తోంది టాక్సీలో. ఆమె యెక్కడా కని పించడంలేదు.

సాయంకాలాలలో టాంక్ బండ్, ఇందిరా పార్కు, పబ్లిక్ గార్డెన్సు వగైరా విహారసలాలలో తిరుగుతూ అక్కడికి లావణ్య వస్తుందేమోనని ఆశతో యెదురు చూస్తోంది.

పగలంతా తిరిగి తిరిగి గిరిజ అలసిపోయివుంది. కాని యెంతో విలువైన సూట్ కేస్ పోగొట్టి బాస్ దృష్టిలో అపరాధిలా నిలబడిపోవడం ఆమెకు బాధ కలిగిస్తోంది. లోగడ యిటువంటి పనులు సునాయాసంగా చేసి అతనికి యెంతో లాభం సంపాదించి పెట్టింది. కాని తను ఇప్పుడొక పొరపాటు చేసింది. ఆ పొరపాటు తన పాలిట గ్రహపాటైంది. బాస్ కి కోపంవస్తే క్రూరుడు. తనపై అనుమానంతో చంపినా చంపుతాడు. సూట్ కేస్ దొరక్కపోతే తన గతి అంతే.

గిరిజ ముఖం కళావిహీనంగా వుంది.

టాంక్ బండ్ పార్కు అంతా కలియజూసి ఆమె చివరకొక బెంచి దగ్గర ఏకాంతంగా నిలబడి హుస్సేన్ సాగర్ వైపు చూస్తూ వుంది.

'బాస్ చంపేవరకూ యెందుకు తనే అందులోపడి చస్తే పీడా పోతుందిగా?' అనుకుంది ఆమె.

కాని ఆమెలో ఏదో ఒక ఆశ మినుకు మినుకు మం

టోంది. లావణ్య కనిపిస్తుందని, పోయిన సూట్ కేస్ దొరుకుతుందనీ.

క్రమంగా చీకట్లు ముసురుకుంటున్నాయి.

విద్యుద్దీపాలు వెలిగి పట్టపగలుగా చేస్తున్నాయి పరిసరాల్ని.

గిరిజలో అశాంతి పెరిగిపోతోంది. అసహనంగా ఆమె పేవ్ మెంట్ దిగబోయి తలెత్తి చూసింది.

యెత్తుగా, లావుగా యెరుపు నలుపు చారల షర్టు మీద తెల్ల ప్యాంట్ టక్ చేసుకున్న ఒక యువకుడు ఆమెవైపే ఆరాధనగా చూస్తూ కన్పించాడు. కర్లింగ్ హెయిర్ అతనికొక ప్రత్యేకతని సంతరించింది.

"యెక్స్క్యూజ్ మీ!" అంటూ అతను ఆమెను పలకరించాడు.

ఆమె ఆగిపోయింది పేవ్ మెంట్ మీదే.

"మిమ్మల్ని ఎక్కడో చూశాను. ఎక్కడ చూశానా అని చాలా సేపటినుంచి ఆలోచిస్తున్నాను" అన్నాడు అతను మందహాసం చేస్తూ.

ఆమె అతనివైపు పరిశీలనగా చూసింది. ఆమెకు కూడా అతన్ని యెక్కడో చూసినట్లుగానే వుంది.

"నా పేరు అశోక్" అన్నాడు.

ఆమె నవ్వింది.

కొన్ని రోజులుగా ఆమె ఒంటరితనంతో విసిగిపోయివుంది. లావణ్య కోసం తిరిగి తిరిగి నిరాశ నిస్పృహలతో అలసిపోయి వుంది. ఇన్ని రోజుల తర్వాత ఆమెలో చైతన్యం కలిగింది అశోక్ పలకరింపుతో.

"మనిషి అందగాడే" ఆమె మనసు గుసగుసలాడింది.

"వాటీజ్ యువర్ గుడ్ నేమ్ ప్లీజ్?" అన్నాడు

అశోక్.

"గిరిజ."

"వెరీ సింపుల్."

"మూడక్షరాల పేర్లంటే నాకు ముచ్చట. మనిద్దరి పేర్లూ మూడక్షరాలే" నవ్వాడు అతను.

గిరిజ నవ్వింది.

"మిమ్మల్ని చాలా సేపటినుంచి గమనిస్తున్నాను. ఎవరి కోసమో వెయిట్ చేస్తున్నారనుకుంటాను."

"నో.... నా మెటాల్. పూరికే షికారుగా వచ్చాను."

"మీరు ఏం చేస్తున్నారు? ఏదైనా జాబ్?"

"అవును. సేల్స్ రిప్రజెంటెటివ్. రోజా ప్రాడక్ట్స్."

"ఐ.సీ...."

"మీరేం చేస్తున్నారు?"

"బొంబే పోర్టులో ఆఫీసర్."

"మీరు బొంబేలోనా వుండేది?" ఆశ్చర్యంగా ప్రశ్నించింది.

"అవును. ఏం? అలా అడిగారు."

"నేనూ బొంబేలోనే. మా ప్రాడక్ట్స్ డిస్ట్రిబ్యూటర్స్‌ని కలుసుకుని సేల్స్ ఇంప్రూ చెయ్యడం నా డ్యూటీ."

"ఐతే బొంబేలోనే మిమ్మల్ని చూసివుంటాను" అన్నాడు అశోక్.

ఒక ప్రాంతంవాళ్ళు ఇద్దరు అపరిచితులైనా ఎక్కడో దూరంగా కలుసుకున్నప్పుడు దగ్గరివాళ్ళలా ప్రవర్తిస్తారు. అశోక్‌ని చూసినప్పుడు గిరిజకు అటువంటి భావమే కలిగింది.

ఆకాశంలో నల్లటి మబ్బులు క్రమ్ముకుంటున్నాయి.

కాసేపటికి సన్నగా చినుకులు ప్రారంభించాయి.

"ఎక్కడ వుంటున్నారు మీరు?" ప్రశ్నించింది గిరిజ.

"మా సిస్టర్ వాళ్ళు ఇక్కడే వుంటున్నారు. వాళ్ళింట్లో" అన్నాడు అశోక్.

"వాన పెద్దదయ్యేలా వుంది?" అంది గిరిజ ఆకాశం వైపు చూస్తూ.

"అలాగే వుంది వాతావరణం చూస్తే. మరి మీ మకాం ఎక్కడ?"

"హోటల్లో వుంటున్నాను."

"ఒంటరిగానా?" ఆశ్చర్యంగా అడిగాడు.

"ఏం? భయం ఎందుకు?" నవ్వింది గిరిజ.

"ఈ రోజుల్లో మగాడు ప్రక్కనుంటేనే ఆడదానికి సేఫ్టీ లేదు. ఒంటరిగా ఎలా వుంటున్నారో మీరని వండర్ గా వుంది."

"అలవాటైపోయింది. అదీగాక నేను చిల్లర మల్లర హోటల్స్ లో వుండను. స్టార్ హోటల్లో తప్ప."

"ఏ హోటల్లో వుంటున్నారు?"

"హేమంత ఇంటర్నేషనల్."

"అది పెద్ద హోటలే" అన్నాడు అశోక్.

వర్షం పెద్దదైంది.

దారిన పోతున్న టాక్సీ పిలిచాడు అశోక్.

ఇద్దరూ టాక్సీ ఎక్కి కూర్చున్నారు.

"హేమంత హోటల్" అన్నాడు అశోక్.

హేమంత ఇంటర్నేషనల్ హోటల్ పోర్టికోలో టాక్సీ ఆగింది.

గిరిజ డోర్ తీసుకుని దిగింది. పర్సు తియ్యబోయింది.

ఆమె వెనుకే అశోక్ దిగాడు.

"ప్లీజ్. మీటర్ నేను ఇస్తాను" అన్నాడు అశోక్.

గిరిజ నవ్వి "ఫర్వాలేదు" అంది.

"గుడ్ నైట్ మేడమ్! సీ....యూ!" అన్నాడు.

"రూమ్‌కి రండి. టీ తీసుకుని వెళ్దురుగాని" నవ్వుతూ అంది గిరిజ.

ఆమె కళ్ళల్లో కనిపించిన భావాన్ని అర్థంచేసుకున్న అశోక్ హుషారుగా మీటర్ చార్జి ఇచ్చేసి ఆమెవెంట నడిచాడు.

## 6

"బాస్ నువ్వు అనుమానించినట్లే జరిగింది. గిరిజ ఇన్స్పెక్టర్ గాడి ముతా మనిషితో తిరుగుతోంది. నేను కళ్ళారా చూశాను" అన్నాడు హమీద్ ఫోన్‌లో.

జిగ్రీ మండిపడ్డాడు.

"అది మనకి ధోకా ఇచ్చింది. సరుకు సంగతి తెలుసుకో...." అన్నాడు జిగ్రీ.

హమీద్ చాలాసేపు జిగ్రీతో మాట్లాడి ఫోన్ పెట్టేశాడు.

ఆ రాత్రి విస్కీ బాటిల్ ఖాళీచేసి గుర్రుపెట్టి నిద్ర పోయాడు హమీద్.

మర్నాడు ప్రొద్దునే లేచి ట్రిమ్ముగా మేకప్ చేసుకుని బయల్దేరాడు.

హమీద్ వెళ్ళేసరికి గిరిజ ఇంకా నిద్రలేవలేదు.

"మేడమ్ ఇంకా నిద్రలేవలేదు" అని చెప్పాడు బాయ్.

హమీద్ కాలింగ్ బెల్ నొక్కాడు.

గిరిజ విసుక్కుంటూ తలుపు తీసింది.

ఎదురుగా హామీద్ నవ్వుతూ కన్పించాడు.

ఆమె విస్తుపోయి చూసింది అతన్ని.

"నువ్వా!...." అంది.

"నేనే!" అన్నాడు.

ఆమె అడ్డు తొలిగింది.

అతను లోపలకు వచ్చాడు.

సోఫాలో ఈజీగా కూర్చుని సిగిరెట్ ముట్టించి "రూమ్ చాలా బాగుంది" అన్నాడు గదంతా కలయ చూస్తూ.

గిరిజ బాయ్‌ని పిలిచి టీ తెప్పించింది.

"ఏమిటి ఇంకా నిద్రలేవలేదు" అన్నాడు హామీద్ టీ త్రాగుతూ.

"ఏంలేదు. పగలంతా తిరగడం. అలసిపోయి వళ్ళు తెలియకుండా నిద్రపోవడం. నేను లేచేవరకూ లేపవద్దని బాయ్‌కి చెప్పాను" నవ్వింది గిరిజ.

హామీద్ గిరిజవంకే తదేకంగా చూస్తున్నాడు.

మామిడి చిగురు రంగు నైట్ గౌనులో ఆమె యవ్వనపు శోభ గుబాళిస్తోంది. పల్చటి ఆ గౌనులో ఆమె వంపుసొంపులు చూస్తుంటే హామీద్‌కి పిచ్చెక్కుతోంది. ఆమె తొడల నునుపు, జబ్బల మెరుపు అతన్ని మరో లోకంలోకి లాక్కెళ్ళి పరవశింపజేస్తున్నాయి.

"కూర్చో! స్నానంచేసి వస్తాను" ఆమె లేవబోయింది.

"తొందరేం? తర్వాత స్నానం చెయ్యొచ్చు" అంటూ అతను చొరవగా ఆమె చేతిని పట్టుకుని మీదకు లాక్కున్నాడు.

ఆమె ఒక్క వూపులో అతని ఒళ్ళోకి వచ్చిపడింది. అతను ఆమెను రెండు చేతుల్లోను బంధించి ముద్దు పెట్టు

కున్నాడు.

ఆమె విసుక్కుని "ఛీ....ఏమిటా పని?" అంది కోపంగా.

"ఏం....ఆ అశోక్ గాడి కంటే తీసిపోయానా?" అన్నాడు హామీద్.

ఆమె నివ్వెరపోయింది.

"బాస్‌కి నీ సంగతంతా తెలిసిపోయింది" అన్నాడు హామీద్ వికృతంగా నవ్వుతూ.

"ఏ సంగతి?" హడిలిపోతూ అడిగింది గిరిజ.

"అదే నువ్వు ఇన్సాఫ్ ముఠాతో కుమ్మక్కయి సరుకు పోయిందని నాటకం ఆడుతున్న సంగతి" అన్నాడు.

"లేదు హామీద్! ప్రామిస్. నిజంగానే నేను సూట్‌కేస్ పోగొట్టుకున్నాను" అంటూ ఆమె లావణ్య అనే అమ్మాయి కోసం ఎంతగా వెతుకుతున్నదో వివరంగా చెప్పింది.

"అయితే నువ్వు ఇన్సాఫ్ ముఠా మనిషి అశోక్‌తో ఎందుకు తిరుగుతున్నట్టో?" వికటంగా నవ్వాడు.

"అశోక్ ఇన్సాఫ్ ముఠా మనిషా? నాకు తెలీదు" వెలవెలబోతూ అంది గిరిజ.

"నీకు ఏమీ తెలీదు! అన్నీ తెలిసే నాటకం ఆడుతున్నావు. మర్యాదగా సూట్‌కేస్ సంగతి చెప్పు?" కఠినంగా అన్నాడు హామీద్.

గిరిజకు ఏడుపు ముంచుకొచ్చింది.

"నాకేమీ తెలీదు హామీద్. నన్ను నమ్ము. అశోక్ తను పోర్టులో పనిచేస్తున్నానని చెప్పి మోసం చేశాడు. అంతే. అంతకంటే నేను ఏమీ చెయ్యలేదు" ఏడుస్తూ చెప్పింది గిరిజ.

"నువ్వు నా దగ్గర ఎంత ఏడ్చినా లాభంలేదు. ఆ ఏడ్చేది ఏదో బాస్ దగ్గర ఏడువు" అన్నాడు హమీద్.

గిరిజకు తను అధఃపాతాళానికి జారిపోతున్నట్లు అనిపించి వణికిపోతోంది.

ఆమె హమీద్ రెండు భుజాలమీద చేతులువేసి "హమీద్, నువ్వే నన్ను రక్షించాలి. నిజంగా నేను బాస్‌ని మోసంచెయ్యలేదు" అంది.

ఆమె పూర్తిగా బెదిరిపోయిందని అతనికి అర్థమైంది.

"నేను చెప్పే బాస్ వింటాడా? నీకంటే నేను బాస్‌కి నమ్మకస్తుడినా?"

"హమీద్. నాకంతా తెలుసు. బాస్‌కి నువ్వంటే గురి. నన్ను ఎలాగైనా గట్టెక్కించాలి" అంటూ ఆమె కళ్ళు తుడుచుకుంటోంది.

హమీద్ ఆమె నడుంమీద చెయ్యేసి దగ్గరగా లాక్కుని "నా ప్రయత్నం నేను చేస్తాను" అన్నాడు నవ్వుతూ.

ఆమె అసహాయ స్థితిలో, దీనంగా చూస్తూ వుండిపోయింది.

"వదులు హమీద్ నేను స్నానంచేసి వస్తాను" అంది ఆమె పట్టు వదిలించుకుంటూ.

"గుడ్....నువ్వు స్నానం చేస్తూ వుంటే నాకు చూడాలని వుంది...." పకపక నవ్వుతూ ఆమె నైట్ గౌను విప్పదీసి నగ్న శరీరాన్ని కౌగలించుకుని బెడ్ మీదకు లాక్కెళ్ళాడు.

"హమీద్ ప్లీజ్! .... ఇప్పుడు కాదు...." ఆమె ప్రతిమాలింది.

హమీద్ వినిపించుకోలేదు.

తన పశువాంఛ తీర్చుకుని ఆమెను ఎత్తుకెళ్ళి బాత్ రూమ్‌లో వదిలాడు.

తలుపులు తీసేవున్నాయి.

"నువ్విప్పుడు స్నానం చేస్తూ వుంటే నేను చూస్తూ వుంటాను" అన్నాడు.

షవర్ లోనుంచి నీళ్లు చిమ్ముతున్నాయి. ఆమెమీద పడి ముత్యాల్లా జారి నేలపైబడి అదృశ్యమైపోతున్నాయి.

ఆమె నగ్న శరీరం చూస్తూ ఆనందాన్ని అనుభవిస్తూ వున్న హామీద్ వున్నట్లుండి పులిలా మారిపోయాడు.

జేబులోనుంచి సైలెన్సర్ తీసి గురిపెట్టి కాల్చాడు. "మోసానికి శిక్ష చావే!" అన్నాడు కసిగా.

ఆమె విరిగిన బొమ్మలా నేలపై కూలిపోయింది.

బాత్ రూమ్ తలుపులు మూసి అతను పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ హోటల్లోనుంచి బైటపడ్డాడు.

## 7

రూమ్ నెంబర్ నూటనలభై మూడు తలుపు కొద్దిగా తెరచుకుని వుంది.

అప్పుడు ఉదయం దాటింది.

బాయ్ రూమ్ తలుపు నెట్టాడు. లోపల ఎవరూ కన్పించ లేదు. బాత్ రూమ్‌లోనుంచి నీళ్ళుపడుతున్న చప్పుడు వినిపిస్తోంది. ఆమె స్నానం చేస్తున్నదేమో అనుకుని వెళ్ళిపోయాడు.

అరగంట తర్వాత వచ్చాడు.

మళ్ళీ అదే చప్పుడు.

'మేడమ్ అంతసేపు స్నానం చేస్తుందా?' అనే అనుమానం మొలకెత్తింది అతని మనసులో.

మేనేజర్ దగ్గరకెళ్ళి తన అనుమానం వివరించాడు.

కాని అతను అనుమానించలేదు. కొందరు గంటలతరబడి నీళ్ళల్లో నానుతూ వుంటారు. వాళ్ళకి అదొక సరదా. డబ్బున్నవాళ్ళ సరదాలు రకరకాలుగా వుంటాయి. వాళ్ళ గురించి, అలవాట్ల గురించి అతనికి క్షుణ్ణంగా తెలుసు. అందుకే మొదట అనుమానం కలగలేదు.

మరొక గంట తర్వాత గూడా బాత్ రూమ్‌లో చప్పుడు వినిపిస్తూ నేవుంది.

అప్పుడు టైమ్ పదకొండున్నర.

బాయ్ పేరు శంకర్. అతనికి కొంచెం ధైర్యం గూడా హెచ్చుగానే వుంది. తన అనుమాన నివృత్తి కోసం అతను బాత్ రూమ్ తలుపు తట్టాడు. లోపల బోల్టువేసి లేదని గ్రహించాడు. నెమ్మదిగా తెరిచాడు. లోపల ట్యూబ్ లైటు కాంతిలో నగ్నంగా చచ్చి పడివున్న గిరిజను చూడగానే వళ్ళు జలదరించింది. గుండె అదిరింది. ఒక్క పరుగున మేనేజర్ దగ్గరికి వెళ్ళి చెప్పాడు.

మేనేజర్ అదిరిపడి పరుగుతీశాడు.

హోటల్లో కలకలం చెలరేగింది. హోటల్లో బాయ్‌లు, రెస్టారెంట్లో సప్లయిర్స్ నూటనలభై మూడు రూమ్‌లోకి పరుగెత్తారు. హోటల్ రూమ్‌లో వున్న కష్టమర్స్ గదిముందు మూగారు. కొందరు ఆడవాళ్ళు భయంతో హడిలిపోతూ తమ రూమ్ ఖాళీచేసి వెళ్ళి పోదామని భర్తలతో మాట్లాడారు.

ఇంతలో పోలీస్ బలగం వచ్చింది. గదిలో వున్న వాళ్ళందర్నీ పంపించివేసి పరిసితి అదుపులోకి తెచ్చారు. క్రైంబ్రాంచి ఇన్స్‌పెక్టర్ అజీజ్ పరిశోధన మొదలు పెట్టాడు.

విజిటర్స్ రిజిష్టర్లో ఆమె పేరు పి. గిరిజ, సేల్స్

రిప్రజెంటెటివ్, రోజా ప్రొడక్ట్సు, బొంబాయి అడ్రస్ వుంది.

ఆమె రూమ్‌లో చేరి వారం దాటింది. ఆమె కోసం ప్రొద్దున్న ఒక వ్యక్తి వచ్చినట్లుగా టీ తెచ్చి యిచ్చిన బాయ్ శంకర్ చెప్పాడు. రాత్రి ఎనిమిది గంటల ప్రాంతంలో ఆమె ఒక యువకుడితో పాటు టాక్సీలో వచ్చినట్లు అతను రాత్రి ఆమెతో పాటు డిన్నర్ చేసినట్లు రుజువైంది.

ఆ ఇద్దరు మగవాళ్ళని మళ్ళీచూస్తే గుర్తుపట్టగలమని వాళ్ళు చెప్పారు.

రివాల్వార్‌తో కాల్చి చంపినట్లు స్పష్టంగా తెలుస్తూనే వుంది.

ఆమె శవాన్ని పోస్టుమార్టమ్ రిపోర్టుకోసం పంపి రోజా ప్రొడక్ట్సు, బొంబాయివారికి ఆమె హత్యచేయ బడిందని టెలిగ్రాం పంపారు.

మర్నాడు రోజా ప్రొడక్ట్సునుంచి జవాబు వచ్చింది. గిరిజ అనే అమ్మాయి సంవత్సరం క్రితమే తమ కంపెనీ నుంచి మానుకొన్నదనీ, ఆమె ఇంటి అడ్రస్‌లో వున్న గిరిజ తల్లికి ఈ విషయం తెలియజేశామనీ, ఆమె బయల్దేరి వస్తున్నదనీ అందులోవుంది.

తులశమ్మ గోడుగోడున ఏడుస్తూ వచ్చింది.

రోజా ప్రొడక్ట్సులో గిరిజ పని మానేసిందనే సంగతి తల్లికి తెలియదు. ఆ విషయం విని ఆమె ఆశ్చర్య పోయింది. మరి ఏ కంపెనీలో పనిచేస్తున్నాదో, డబ్బు ఎలా సంపాదిస్తున్నదో అర్ధంకాలేదు.

గిరిజ హైదరాబాద్ వెళ్ళిన తర్వాత ఎవడో రౌడీ తమ ఇంటికి వచ్చి దౌర్జన్యం చేశాడనీ సూట్‌కేస్‌గురించి

అడిగాడనీ తులశమ్మ పోలీసులకు చెప్పింది. ఆ రౌడీయే తన కూతుర్ని పోట్టన పెట్టుకుని వుంటాడని ఆమె తన అనుమానం వ్యక్తం చేసింది. అయితే గిరిజ కోసం వచ్చిన యువకులు ఎత్తుగా ట్రిమ్‌గా వుంటారని హోటల్ స్టాఫ్ చెప్తున్నారు. తులశమ్మ చెప్పే రౌడీ పొట్టిగా లావుగా, భూతంలా వుంటాడు. కాబట్టి గిరిజను చంపిన వ్యక్తి తులశమ్మ చెప్పే రౌడీకాదని తేలిపోతోంది.

రోజా ప్రొడక్ట్స్‌లో పనిచేస్తున్న గిరిజ ఆ ఉద్యోగం మానేసి స్మగ్లర్స్ గ్యాంగులో చేరివుంటుందనీ విలువైన వస్తువులుగల సూట్‌కేస్ విషయంలో ఈ హత్య జరిగిందనే నిర్ణయానికి వచ్చారు పోలీసులు.

గిరిజ శవాన్ని ఆమె తల్లికి అప్పగించారు. కూతురు శవాన్ని అక్కడే దహనం చేయించి తను బొంబాయి వెళ్ళిపోయింది తులశమ్మ.

# 8

"ఏరా కిషోర్! ఈ రోజైనా సీటు రిజర్వు చేయిస్తావా లేదా?" అని అడిగింది లావణ్య తమ్ముడ్ని.

"ఊఁ....చూద్దాంలే" అన్నాడు కిశోర్ డ్రెస్ చేసుకుంటూ పరధ్యానంగా.

"ఈ ఒక్కరోజు చూస్తాను. రేపు నేనే స్టేషన్‌కెళ్ళి రిజర్వు చేయించుకుని వస్తాను" అంది లావణ్య.

"అలాగేలే...." నవ్వుతూ అన్నాడు కిశోర్.

"ఎన్నాళ్ళయింది నేను వచ్చి?"

"ఏం నెలలయిందా? సంవత్సరాలయిందా? పట్టుమని పదిరోజులు కాలేదు. అప్పుడే బావమీద గాలి మళ్ళింది కాబోలు" కొంటెగా చూస్తూ అడిగాడు.

"ఏడ్చావ్‌లే! ఆయన భోజనానికి ఇబ్బంది. అక్కడ

హోటళ్ళలో అన్నం దొరకదు. తెలుసా నీకు?"

"ఆఁ.... నాకంతా తెలుసు!" అన్నాడు కిశోర్.

ఇంతలో బాయ్ సైకిల్ మీద వచ్చి పేపరు వాకిట్లోకి విసిరేసిపోయాడు.

లావణ్య పేపరు తిరగేస్తూ కూర్చుంది. అందులో గిరిజ అనే అమ్మాయి హేమంత్ ఇంటర్నేషనల్ హోటల్లో హత్యచేయబడిన సంగతి వివరంగా పడింది. బాత్ రూమ్‌లో చచ్చిపడివున్న స్థితిలో హోటల్ బాయ్ చూసి మేనేజర్‌కి చెప్పగా ఆ సంగతి వెలుగులోకి వచ్చిన సంగతి వుంది.

"కిశోర్!...." గట్టిగా పిలిచింది లావణ్య.

"అక్కా- ఏమిటీ?"

"మొన్న నేను బాంబేనుంచి వస్తుంటే పరిచయం అయిందన్నాను చూడు గిరిజ."

"వూఁ...."

"ఆ అమ్మాయిని ఎవరో మర్డర్ చేశారట."

"ఎక్కడ?"

"హేమంత ఇంటర్నేషనల్ హోటల్లోనట. ఇందులో వేశారు" అంటూ పేపరు కిశోర్‌కి అందించింది.

"పాపం .... ఎవరు చేశారో దుర్మార్గులు. ఎంత అందమైన మనిషి? చూడ్డానికి రెండు కళ్ళూ చాలవు. అంత బాగుంటుంది. చంపడానికి చేతులు ఎలా వచ్చాయో!" లావణ్య గిరిజపై సానుభూతి చూపిస్తూ అంది.

"మిజరబుల్ డెత్" అన్నాడు కిశోర్ అదంతా చదివి.

"కిశోర్ మనం ఒకపని చేస్తే!"

"ఏమిటి?"

"గిరిజ కోసం వాళ్ళ బంధువులు ఎవరో వస్తారుగా!"

"అవును. వస్తే?"

"ఆమె సూట్ కేస్ మన దగ్గర వుంది గదా అది వాళ్ళకి ఇచ్చేద్దాం."

"గుడ్ ఐడియా!"

"ఆమె బంధువులు ఎవరైనా వుంటే యెక్కడున్నారో తెలుసుకుని రా! అంతేగాని ఆమె సూట్ కేస్ మన దగ్గరవుందని చెప్పకు. చెప్తే అది మేం అంద జేస్తామని తీసుకుంటారు. అది వాళ్ళకు చేరుతుందో లేదో మనకు తెలీదు" అంది లావణ్య.

"అలాగేలే. నాకామాత్రం తెలీదా?" అంటూ కిశోర్ బయల్దేరాడు.

క్రైంబ్రాంచి ఇన్స్పెక్టర్ అజీజ్ ని కలుసుకున్నాడు కిశోర్.

"సార్! కొంచెం ఇన్ఫర్మేషన్ కావాలి" రిక్వెస్టు చేశాడు కిశోర్.

"ఏ విషయంలో?"

"సీమంత ఇంటర్నేషనల్ హోటల్లో మర్డర్ చేయ బడిన గిరిజ అనే అమ్మాయి విషయంలో."

ఇన్స్పెక్టర్ ఆ మాట వినగానే "అలాగా....వచ్చి కూర్చో" అని కుర్చీ చూపించాడు.

కిశోర్ కూర్చుని "థాంక్స్" అన్నాడు.

"ఇప్పుడు చెప్పు! ఏం కావాలి? గిరిజ నీకు తెలుసా?"

"గిరిజ నాకు తెలీదు సార్! మా అక్కకు తెలుసట. ఆమెని మర్డర్ చేశారని పేపర్ లో చూచి చాలా బాధ పడింది. ఆమె తాలూకు బంధువులెవరైనా వస్తే తెలుసుకునిరమ్మని నన్ను పంపింది" అన్నాడు కిశోర్.

"మీ అక్క పేరేమిటి?"

"లావణ్య."

"ఏం చేస్తుంటుంది?"

"మా బావ బొంబేలో జాబ్ చేస్తున్నాడు. అక్కడే వుంటుంది."

"ఏమిటీ బొంబేలోనా?"

"యస్సార్."

"ఐతే మీ అక్కకు, గిరిజ బొంబేలో పరిచయం వుండివుంటుంటుంది."

"అవును సార్!"

"సారీ! మిష్టర్. నిన్ననే గిరిజ తల్లి ఆమె శవాన్ని అంత్యక్రియలు జరిపించి తిరిగి బొంబే వెళ్ళిపోయింది."

"అలాగా! ఇక నేను సెలవుతీసుకుంటాను సార్!" అన్నాడు కిశోర్.

"జెస్ట్ మినిట్" అంటూ ఇన్స్పెక్టర్ ఎవరికో ఫోన్ చేశాడు.

పది నముషాలు వెయిట్ చేశాక "నేను వెళ్తాను సార్!" అన్నాడు కిశోర్.

"కూర్చో పనుంది నీతో" అన్నాడు.

"నాతో పనా?" ఆశ్చర్యపోతూ అడిగాడు కిశోర్.

"అవును."

"ఏం పని సార్?"

"గిరిజ మర్డర్ జరిగిన కేసులో ఇద్దరు యువకులు అనుమానితుల జాబితాలో వున్నారు. ఆ ఇద్దర్లో నువ్వొకడివి ఎందుకు కాకూడదు?" సీరియస్‌గా అన్నాడు ఇన్స్పెక్టర్.

ప్రక్కనే బాంబు ప్రేలినట్లు అదిరిపడి కుర్చీలోనుంచి

లేచిపోయి "సార్!....నాకేం తెలియదు" అన్నాడు వణికిపోతూ.

"కూర్చో ముందు" కఠినంగా అన్నాడు ఇన్స్పెక్టర్.

బొమ్మలా కూర్చున్నాడు కిషోర్.

"నీకు ఏం తెలుసో? ఏం తెలియదో కాసేపటికి తెలుస్తుంది."

కిశోర్ కి ముచ్చెమటలు పోశాయి. 'ఇదెక్కడి గొడవరా బాబూ! అనవసరంగా వచ్చి పోలీస్ స్టేషన్ లో ఇరుక్కున్నాను. కొంపతీసి మర్డర్ కేసు పెట్టరు గదా' అనుకున్నాడు హడలిపోతూ.

నేరస్తులు దొరకనప్పుడు ఎవడో ఒకడ్ని అందులో ఇరికించి కేసులు పెడతారని పోలీసుల గురించి స్నేహితులు చెప్పుకునేటప్పుడు విన్నాడు. అలా ఎలా జరుగుతుందో అతనికి అర్థమయ్యేదికాదు. ఇప్పుడు అనుభవంలోకి వచ్చింది. గిరిజ పేరు ఎత్తేసరికి తనను అనుమానితుల జాబితాలో పడేశాడు. ఏం జరుగుతుందో ఏమో వణికి పోసాగాడు కిశోర్.

స్టేషన్ బైట ఆటోరిక్షా ఆగింది.

అందులోనుంచి 'హేమంత ఇంటర్నేషనల్' అని వున్న యూనిఫారమ్ లో వున్న ఇద్దరు బాయ్ లు దిగారు. వచ్చి ఇన్స్పెక్టర్ కి విష్ చేసి నిల్చున్నారు. ఇన్స్పెక్టర్ వాళ్ళకి కిశోర్ ని చూపించాడు. వాళ్ళు కిశోర్ వంక పరీక్షగా చూసి "ఇతను కాదు సార్!" అని చెప్పారు.

కిశోర్ 'హమ్మయ్య' అనుకుని నిట్టూర్చాడు.

"యూ కెన్ గో మిస్టర్" అన్నాడు ఇన్స్పెక్టర్.

కిశోర్ బోనులోనుంచి బైటపడిన పులిపిల్లిలా పరుగు తీశాడు.

# 9

లావణ్య బొంబాయి లోకల్ ట్రెయిన్‌లో ప్రయాణం చేస్తోంది. అంతకుముందు రెండురోజుల క్రితం లోకల్ ట్రెయిన్‌లో ఒక యువతిని మర్డర్ చేసి ఆమె నగలు దొంగిలించారు. కంపార్టుమెంట్‌లో వున్న ఆడవాళ్ళలో మర్డర్ తాలూకు టాకిప్ నలుగుతోంది.

"ఏమిటో అసలు ఆడవాళ్ళకి సేఫ్టీ లేకుండా పోతోంది.

"మళ్ళీ పుణ్యభూమి అనీ, పురాణ భూమి అనీ పెద్ద పేరు. జరిగేవన్నీ చూస్తుంటే రొన్నాళ్ళకి మనం రోడ్డు మీద నడవగలమా? అనిపిస్తోంది" అంది ఒకామె.

"మొన్న గిరిజను చూడండి. రైల్లోనే చంపేసి నగలు దోచుకున్నారు. ఎంత దారుణమో చూడండి. నగలు దోచుకుంది చాలక చంపడం ఎంత అన్యాయమో. మానవత్వం నశించిపోతోంది" అంది ఒకావిడ.

లావణ్య వులిక్కిపడి "గిరిజ ఎవరు?" అంది.

"రైల్లో చంపేసిన అమ్మాయి పేరు గిరిజ."

"అలాగా! నెల క్రితం గిరిజ అనే అమ్మాయిని హైదరాబాద్‌లో ఒక హోటల్ రూమ్‌లో బాత్‌రూమ్‌లో చంపేశారు. అది గుర్తొచ్చింది. ఆమె పేరు కూడా గిరిజే!"

"ఇలాంటివి దేశంలో ఎన్నో జరుగుతున్నాయి. అసలు పేపర్లో 'ఈ రోజు మానభంగాలు, ఈ రోజు దోపిడీలు ఈ రోజు హత్యలు' అని శీర్షికలు పెడితే సరిపోతుంది" అంది మరొకామె.

"అంతే మరి. అవి జరగని రోజు ఎక్కడుంది?"

"అవుననుకోండి. నెలక్రితం గిరిజ మర్డర్ జరిగిందిగదా! ఆమె నాతోపాటు బాంబేనుంచి సికింద్రాబాద్ ట్రెయిన్‌లో పూనావరకూ ప్రయాణం చేసింది. ఆమె పూనాలో ఒక సూట్‌కేసు నా దగ్గర వుంచి ఇప్పుడే వస్తానని ఎవరో కుర్రాడితో మాట్లాడానికి వెళ్ళింది. అంతే తిరిగిరాలేదు. ఆ సూట్‌కేసు నేను దేవుడా అని మోసుకెళ్ళాను. పదిరోజుల తర్వాత చూస్తే ఆమెను హోటల్లో చంపేశారని పేపర్లో పడింది" లావణ్య చెప్పుకొచ్చింది.

"ఆ సూట్‌కేసులో ఏమున్నాయి?"

"ఆవిడ రోజా ప్రొడక్ట్సులో సేల్స్‌రిప్రజెంటెటివ్‌గా పనిచేస్తోందని చెప్పింది. అందులో వున్నాయి కుంకుమ భరిణలు. అవి ఆమెకు చేర్చాలని ట్రై చేశాను. కుదర్లేదు" అంది లావణ్య.

లోకల్ ట్రెయిన్ దిగి లావణ్య షాపింగ్ చేసి ఫ్లాట్‌కి వెళుతూంది.

చీకటిపడింది.

ఫ్లాట్‌కి కొంచెం దూరంలోవున్న స్ట్రీట్ లైట్ వెలగడంలేదు. రోజూ వెలుగుతూనే వుంది. ఈ రోజు ఎందుకు వెలగడంలేదు, అనుకుంటూనే లావణ్య పర ధ్యానంగా అడుగులు వేస్తున్నది.

ఆ చీకట్లో నల్లటి అంబాసిడర్ రోడ్డు ప్రక్కన ఆగి వున్నది. దూరంనుంచి అది ఆమెకు కన్పించలేదు.

"లావణ్యా!" ఎవరో పిల్చిన కేక విని ఆమె ఆగి పోయింది.

ఎవరూ కన్పించలేదు.

ఇద్దరు మనుష్యులు లావణ్యను పట్టుకున్నారు. ఒకడు

ఆమె నోరు నొక్కిపెట్టాడు. రెండోవాడు ఆమెను అమాంతం పైకెత్తి కారులో పడేశాడు. కారు కదిలింది. లావణ్య భయంతో వణికిపోతూ గింజుకుంది. కాని లాభం లేకపోయింది. వాళ్ళ వుక్కు హస్తాలనుంచి తప్పించుకో లేకపోయింది.

## 10

గదంతా చీకటిగా వుంది.

లావణ్యాను నిలబెట్టి స్తంభానికి కట్టేశారు.

ఆమెకు టైమ్ ఎంతయిందో తెలియడంలేదు. దాహంతో గొంతు ఎండుకుపోతోంది. నిల్చుని నిల్చుని కాళ్ళు పీక్కుపోతున్నాయి. కూర్చోవడానికి వీల్లేదు. త్రాళ్ళకు శరీరం ఒత్తుకుపోయి మంటలు పుడుతున్నాయి.

ఏడ్చి ఏడ్చి ఆమెలో ఓపిక నశించిపోయింది. వాళ్ళెవరో? తనను ఎందుకు బంధించారో ఆమెకు అర్థం కావడంలేదు. ఆ మధ్య పేపర్లో ఆడవాళ్ళను ఎత్తుకుపోయి బలవంతంగా వ్యభిచారం చేయించే ముఠా గురించి ఆమె చదివింది. ఒకవేళ వీళ్ళు ఆ ముఠావాళ్ళా? తనను బలవంతంగా వ్యభిచార వృత్తిలోకి దించుతారా?

అది తల్చుకుంటేనే ఆమెకు కంపరంగా వుంది.

గదిలో లైటు వెలిగింది.

తలుపులు తెరుచుకున్నాయి.

నలుగురు మగాళ్ళు గదిలోకి వచ్చారు.

లావణ్య భయంభయంగా చూసింది. ఆమె భయం చూసి "భయపడకు. నీకు ఏమీ ప్రమాదంలేదు. మేము చెప్పినట్లు చెయ్యి. నిజం చెప్తే చాలు. మోసం చెయ్యడానికి ప్రయత్నిస్తే నీ ప్రాణానికే ముప్పు" అన్నాడు ఇస్హాక్.

"నన్ను ఏమీ చెయ్యకండి. మీకు నమస్కారం చేస్తాను" ఏడ్చింది లావణ్య!

"నోర్ముయ్! అనవసరంగా ఏడవకు" దబాయించాడు ఇన్సాఫ్.

లావణ్య కట్లు విప్పారు. ఒకడు కుర్చీ తెచ్చి వేశాడు. ఆమె మంచినీళ్ళు అడిగింది. మరొకడు నీళ్ళు ఇచ్చాడు.

"నీ పేరు లావణ్య కదూ?"

తల వూపింది.

"గిరిజ నీతోబాటు బొంబేనుంచి పూనా వరకూ ప్రయాణం చేసింది. పూనాలో దిగిపోయింది. దిగిపోతూ నీకొక సూట్ కేస్ ఇచ్చింది. అవునా!"

"అవును."

"అచ్ఛా! జరిగిందంతా చెప్పు."

లావణ్య జరిగిందంతా చెప్పింది.

"ఆ సూట్ కేస్ ఇప్పుడు ఎక్కడుంది?"

"మా అమ్మగారింట్లో."

"హైదరాబాదేగా!"

"అవును."

"వెరీగుడ్. ఆ సూట్ కేస్ మాకు తెచ్చి అప్పగించాలి. అలా జరక్కపోతే నీ ప్రాణాలు నీకు దక్కవు."

"లేదు.... లేదు.... అది తెచ్చి మీకు ఇచ్చేస్తాను. నన్ను వదలండి" అంది లావణ్య.

"నిన్ను వదిలే ప్రసక్తే లేదు. ఇప్పుడు మనం హైదరాబాద్ ప్రయాణం చేస్తాం. మీ ఇంట్లోకెళ్ళి సూట్ కేస్ తెచ్చి ఇవ్వాలి. మా గురించి ఎవరికీ ఏమీ చెప్పగూడదు. మీ ఇంట్లో తల్లిదండ్రులకు మీవారి స్నేహితులమని నచ్చజెప్పాలి. ఇందులో ఏ మాత్రం

పొరపాటు జరిగినా దాని ఫలితం తీవ్రంగా వుంటుంది"
ఇన్స్పెక్టర్ హెచ్చరిక చేశాడు.

వెంటనే కారు సిద్ధం చేశారు.

## 11

కారులో లావణ్య పుట్టింటికి వెళ్లారు ఇన్స్పెక్టర్ ముఠా.

లావణ్య ఒంటరిగా వచ్చినందుకు అంతా ఆశ్చర్య పోయారు. ఆమె వెంట నలుగురు మగాళ్ళు వుండడం చూసి వాళ్ళకి మతిపోయింది.

"ఒరేయ్ కిశోర్, ఆ సూట్ కేస్ తెచ్చి ఇవ్వు" అంది లావణ్య కంగారుగా.

"ఎవరు వీళ్ళు?" ఆశ్చర్యంగా అడిగాడు కిశోర్.'

"ఏమిటమ్మా ఇంత అర్జెంటుగా వచ్చావ్?" అని తండ్రి ప్రశ్నించాడు.

"అదే నాన్నా! నా ఫ్రెండ్ గిరిజవాళ్ళ బంధువులు వీళ్ళు. మీ అల్లుడికి కూడా స్నేహితులే. వాళ్ళ సూట్ కేస్ ఇచ్చేద్దామని పిల్చుకొచ్చాను" అంది లావణ్య.

ఆమె తండ్రి వాళ్ళని కూర్చోమని మర్యాద చేశాడు. తల్లి టీ తయారుచేయడానికి కిచెన్ లోకి వెళ్ళింది.

కిశోర్ సూట్ కేస్ తెచ్చి ఇచ్చాడు.

లావణ్య అందుకుని అది ఖాళీగా వుండడం గమనించి "ఇందులో కుంకుమ భరిణలు ఏమైనాయి?" అంది కంగారుగా.

"అమ్మేశానక్కా! ఏం చేసుకుంటాం అవన్నీ?" అన్నాడు కిశోర్.

"ఎవరికి అమ్మేశావు?"

"జయా ఫ్యాన్సీ స్టోర్స్ వాళ్ళకి."

"ఎందుకు అమ్మావు?" కోపంగా అడిగాడు ఇన్సాఫ్.

"అందులో సరుకుపాడై పోతుందని అమ్మేశాను. వందరూపాయలు వచ్చాయి. కావాలంటే ఇచ్చేస్తాను" అన్నాడు కిశోర్.

"ఆ కొట్టు ఎక్కడుందో చూపించు!" అన్నాడు ఇన్సాఫ్.

"పదండి చూపిస్తాను" అన్నాడు కిశోర్.

వాళ్లు కిశోర్‌ని కారులో యెక్కించుకుని జయా ఫ్యాన్సీ స్టోర్‌కి వెళ్లారు.

అప్పుడే కొట్టు తీశారు. ఒక కుర్రాడు కొట్టు ఊడుస్తున్నాడు. మరొక కుర్రాడు షో కేసు అద్దాలను తుడుస్తున్నాడు.

తన కొట్టుముందు కారు ఆగడం చూసి ప్రొప్రయిటర్ ముఖం వికసించింది. ప్రొద్దున్నే బోణి బేరం మంచిదే తగిలిందని మురిసిపోయాడు.

"ఆయియే సాబ్!" అంటూ ఆహ్వానించాడు కారు దిగిన గూండా మూఠాని.

"రత్నంగారూ మీకు నాలుగు రోజుల క్రితం రోజా ప్రొడక్ట్సు కుంకుమ భరిణాలు అమ్మాను గుర్తుందా?" అన్నాడు కిశోర్.

"గుర్తుంది. డబ్బు ఇచ్చేశానుగా."

"ఇచ్చారు. ఆ భరిణలు మాకే కావాలి ఇప్పుడు" అన్నాడు కిశోర్.

"సారీ! నిన్న సాయంకాలమే వాటిని మొత్తం కొనుక్కుపోయారు. వాళ్ళింట్లో ఏదో పేరంటంలో పంచడానికని. అవేకాక వేరే కంపెనీవి గూడా తీసుకు పోయారు" అన్నాడు ఫ్యాన్సీస్టోర్ అతను.

ఇన్స్పెక్టర్ ముఖం నల్లబడిపోయింది. వాళ్ళంతా ముఖాలు చూసుకున్నారు నీరసంగా.

"నువ్వు చెప్పేది నిజమేనా?" అన్నాడు ఇన్స్పెక్టర్ కోపంగా.

"భలేవారే! చేరంవస్తే అమ్మకోక దాచుకుంటానా! కావాలంటే చూసుకోండి" అంటూ కుంకుమ భరిణలు వున్న అర చూపించాడు. అది ఖాళీగా వుంది.

"ఎవరు కొన్నారు వాటిని?"

"యెవరో సార్! రోజూ కొన్ని వందలమంది వచ్చి వెళ్తూవుంటారు. యెందరని గుర్తుంటారు?" నవ్వాడు యజమాని.

అతను నిజాయితీగానే చెప్తున్నాడనిపించింది. అతని మాటలు నమ్మకుండా వుండడానికి ఆస్కారం కనిపించ లేదు.

"వీడి సంగతి తర్వాత చూద్దాం. ఒకవేళ వాటిలో వున్న సరుకు కనిపెట్టి వీడే దాచాడేమో?"

ఒకడు ఇన్స్పెక్టర్ చెవిలో గుసగుసలాడాడు.

ఇన్స్పెక్టర్ కసిగా తల వూపి "బాద్ మేదేఖింగే...." అంటూ కోపంగా వెళ్ళిపోయి కారెక్కాడు.

కారు కదిలింది.

తనని తీసుకొచ్చి అక్కడే వదిలేసిపోతున్న వాళ్ళని చూసి కిశోర్ విస్తుపోయాడు. ఆ కుంకుమ భరిణలగురించి యెందుకలా కంగారుపడుతున్నారో అతనికి అర్థంకాలేదు. కొంపతీసి వాటిలో విలువైనవి ఏవైనా దాచారా?

కిశోర్ బుర్ర తిరిగిపోయింది.

## 12

సేట్ మోహన్‌లాల్ ఆ వీధిలో ఐశ్వర్యవంతుడని ఎవరికైనా తెలుస్తుంది మూడంతస్తుల అతని ఆధునిక భవనం చూస్తే!

తన సంపద ప్రదర్శించడానికి అతను ఎక్కువ కుతూహలం చూపిస్తూ వుంటాడు. దీపావళి, దసరా పండుగల భారీ ఎత్తున చేస్తూ పెళ్ళి జరిపినట్లు హైరానపడు తుంటాడు. ఇంట్లో ఏ చిన్న ఫంక్షనయినా గొప్పగా జరిపించి తృప్తిపడతాడు.

మోహన్‌లాల్ పెద్దకొడుకు కూతురు పెద్దమనిషి అయ్యింది. ఆ వీధిలో ఆడవాళ్ళందర్ని పేరంటానికి పిలిచారు. వచ్చిన వాళ్ళకి స్వీట్స్, పండు తాంబూలం కాకుండా కుంకుమ భరిణలు గూడా పంచిపెట్టారు.

పేరంటానికి వచ్చినవాళ్ళంతా సిరిపరులే. మధ్య తరగతి మహిళలు తక్కువ. ఎక్కువ అధికారుల భార్యలు, లక్షాధికారుల అర్ధాంగులు.

ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్ భార్య సుమిత్ర గూడా పేరంటానికి వెళ్ళి వచ్చింది. కుంకుమ భరిణ డ్రాయరు మీద పెట్టి బెడ్‌రూమ్‌లో చీర మార్చుకుంటోంది. ఆ సమయంలో ఆమె కూతురు కొడుకు రెండేళ్ళవాడు బాబీ హాల్లోకి వచ్చాడు. డ్రాయరుమీద కనిపిస్తున్న భరిణ వాడిని ఆకర్షించింది. దాన్ని అందుకోవాలని వాడు ప్రయత్నించాడు. ఆ ప్రయత్నంలో ఆ భరిణ క్రిందపడి కుంకుమ అంతా నేలపాలైంది. చప్పుడు విని సుమిత్ర హాల్లోకి వచ్చింది.

బాబీ బిక్క ముఖం వేసుకుని క్రింద ఎర్రగా పరుచుకున్న కుంకుమ వైపు చూస్తూ నిల్చున్నాడు.

అమ్మమ్మని చూసి తప్పుచేసినందుకు కొడుతుందేమోనని భయపడ్డాడు.

ఆ ఎర్రటి కుంకుమ మధ్యలో కాంతులీనుతున్న రాయి చూసి ఆమె ఆశ్చర్యపోయింది. తీసి పరిక్షగా చూసింది. అది విలువైన వజ్రం.

ఇంతలో ఇన్స్పెక్టర్ శ్రీనివాస్ వచ్చాడు.

"ఏమిటిది?" అన్నాడు.

"మోహన్‌లాల్ గారింటికి పేరంటానికి వెళ్ళాను. చూశారా వాళ్ళ గొప్పతనం. కుంకుమ భరిణలో పెట్టి వజ్రాలు పంచిపెట్టారు" అంది సుమిత్ర.

శ్రీనివాస్ ఆ మాట విని ఆశ్చర్యచకితుడయ్యాడు.

"యేమిటీ?" అంటూ వచ్చి వజ్రం పట్టుకుని చూశాడు.

నిజమే. అది విలువైన వజ్రం.

అతని ఆలోచనలు పలువిధాలుగా పోతున్నాయి. యెంత డబ్బున్నవాడైతే మటుకూ పేరంటానికి పిలిచిన వాళ్ళకి వజ్రాలు పంచుతాడా?

అందరికీ పంచాడా? లేక తన భార్యకి మాత్రమేనా?

"కుంకుమ భరిణలు అందరికీ పంచారా లేక నీకు మాత్రమేనా?" ప్రశ్నించాడు శ్రీనివాస్ భార్యని.

"భలేవారే! వచ్చిన వాళ్ళందరికీ ఇలాంటివే ఇచ్చారు. నాకు మాత్రమే యెందుకు ఇస్తారు? నా గొప్పతన మేమిటి?" అంది సుమిత్ర నవ్వుతూ.

ఇన్స్పెక్టర్ శ్రీనివాస్ టెలిఫోన్ రిసీవరె యెత్తి మోహన్‌లాల్‌కు డైల్ చేశాడు.

"హల్లో! మోహన్‌లాల్ స్పీకింగ్ ప్లీజ్!"

"ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్ స్పీకింగ్!"

"నమస్తే ఇన్‌స్పెక్టర్ సాబ్!"

"నమస్తే! శేట్ జీ!"

"బోలో సాబ్!"

"శేఠ్‌జీ మీరు ఈ విధంగా చెయ్యడం ఏమీ బాగాలేదు" కఠినంగా వుంది ఇన్‌స్పెక్టర్ గొంతు.

"ఏమిటి సాబ్?"

"మీరు చెప్పిన కేసు వదిలేదిలేదు. ఆ సంగతి మీకు చెప్పాను. మీ ఆఫర్ తిరస్కరించాను. కాని ఇప్పుడు పేరంటం పేరుతో పిలిచి నా భార్య ద్వారా లంచం ఇవ్వడాన్ని చూస్తే మీకింకా ఆశవున్నట్లు వుంది."

"ఏమిటి సాబ్ మీరనేది?"

"అవును శేట్. మీరు కుంకుమ భరిణలో పెట్టిపంపిన వజ్రం గుర్తులేదా?"

"ఏమిటీ నేను మీకు వజ్రం పంపానా?"

"యస్! బుకాయించకండి. ఇటువంటి పనులు ముందెప్పుడూ చెయ్యకండి ప్లీజ్! ఆ వజ్రం తిరిగి పంపిస్తున్నాను. ఆ కేసు గురించి ఇక మర్చిపోండి. అది కోర్టులో పరిష్కారం అవుతుంది." అని ఇన్‌స్పెక్టర్ రిసీవర్ పెట్టేశాడు.

మోహన్‌లాల్‌కి మతిపోతోంది. అతనికి జరిగిన కథ కొంచెం కొంచెంగా మబ్బు విడినట్లు అర్థమౌతున్నది.

జిగ్రీ వజ్రాలు దొంగిలించి, గిరిజ ద్వారా మోహన్‌లాల్‌కి పంపాడు. మోహన్‌లాల్ ఆ దొంగసరుకు కొని జిగ్రీకి డబ్బు పంపేవాడు. అది చిరకాలంగా జరుగుతున్నదే.

## 43

కాని ఈసారి కథ అడ్డంతిరిగింది. కుంకుమ భరిణలున్న సూట్ కేస్ గిరిజ పొరపాటువల్ల స్థానభ్రంశమై ఆమె ప్రాణాలు తీశాయి. వాటికోసం ప్రయత్నించిన ఇన్సాఫ్ మూతాకు ఆశాభంగం జరిగింది. వాటిలో దాచిన వజ్రాలు మోహన్ లాల్ ఇంటికిచేరి కూడా దక్కలేదు. ప్రాప్తం వున్న వాళ్ళకి దక్కాయి. మోహన్ లాల్ కి దక్కింది ఇన్స్పెక్టర్ త్రిప్పిపంపిన ఒక్క వజ్రం మాత్రమే.

—: ఐ పో యిం ది: —

# వింత వృక్షం

## వసుంధర

"ఏమండీ!" అంది శారద.

"ఊఁ" అన్నాడు రఘు.

"నేను మిమ్మల్ని మనసారా ప్రేమించాను. మీకోసం కన్న తండ్రిని ఎదిరించాను. లక్షల ఆస్తిని తృణప్రాయంగా చూశాను. ఆఖరికి మన ప్రేమ గెలిచి మన వివాహం జరిగింది. కానీ...." అని ఆగింది శారద.

"చెప్పు...." అన్నాడు రఘు.

"మీరు కూడా నన్నలాగే ప్రేమించాలని కోరుకుంటున్నాను—" అంది శారద.

రఘు నవ్వి—"అది నువ్వు నన్ను వేరే అడగాలా—జామచెట్టు జామకాయ కాయడం ఎంత సహజమో—నేను నిన్ను ప్రేమించడమూ అంత సహజం—" అన్నాడు.

"కానీ చెట్టు కాసిన కాయలు ఒక్కనికే దక్కవు. ఎందరో వాటిని పంచుకుంటారు—" అంది శారద.

"అంటే?"

"మీ ప్రేమ నాకు మాత్రమే పరిమితం కావాలి. కలలో కూడా మీరు మరో స్త్రీ గురించి తలవకూడదు. అది నేను సహించలేను. భరించలేను—" అంది శారద.

"మై గాడ్—నీ కసలు అలాంటి అనుమానం ఎందు కొచ్చింది?" అన్నాడు రఘు.

"మన సెప్పుడూ ప్రేమించిన వారినే అంటిపెట్టుకుని ఉంటుందని మీకు తెలుసుగదా!"

"ఊఁ"

"అలా అంటిపెట్టుకున్న మనసు నాకేమని చెప్పిందో తెలుసా?"

"చెప్పు!"

"నిన్న మీరు ఒక స్త్రీని దగ్గరగా లాక్కుని ముద్దు పెట్టుకున్నారని!"

"వాట్!" ఉలిక్కిపడ్డాడు రఘు.

"ఇది మీరు కాదనలేని నిజం!" అంది శారద.

రఘు ముఖం గంభీరంగా అయిపోయింది—"నేను నిన్ను ప్రేమిస్తున్నానని నీకు నమ్మకమేనా?"

"ఊఁ"

"అయితే నా మనసు కూడా నిన్నంటిపెట్టుకునే ఉంటుంది కదా!" అన్నాడు రఘు.

"ఉండాలన్నది నా కోరిక!" అంది శారద.

"అలా అంటిపెట్టుకున్న నా మనసేం చెప్పిందో తెలుసా?" అన్నాడు రఘు.

"చెప్పండి!" అంది శారద.

"నువ్వొక పరాయి పురుషుడిని బలంగా కౌగ లించుకుని ముద్దు పెట్టుకున్నావని—" అన్నాడు రఘు.

"ఏమండీ—మీ రేమంటున్నారో తెలుసా?" అంది శారద కంగారుగా.

"ఏం—బాధగా వుందా?"

"ఇలాంటి మాటలు భర్త నోటివెంట వినడం ఏ భార్యకు బాధకలిగించదు?"

"నీ నోట అలాంటి మాటలు వింటే నాకు సంతోషంగా ఉంటుందా?"

"ఏమండీ—మీరు నా మనసును మభ్యపెట్టలేరు. మీరు ఇల్లుదాటిన క్షణంనుంచీ ఏం చేస్తున్నారో నాకు పూర్తిగా తెలుస్తూంటుంది. కావాలంటే మీకు టైము కూడా చెప్పగలను. నిన్న మీరు చేసిన ఆ దౌర్భాగ్యపు పని—సాయంత్రం మూడుగంటల ఇరవై నిముషాలకు!" అంది శారద.

రఘు ఉలిక్కిపడి—"నామీద చారులను నియమిస్తున్నావా?" అన్నాడు.

"చారులెందుకు నాకు? నా మనసుండగా—" అంది శారద.

రఘు ఆమెవంక చిత్రంగా చూసి—"డిటెక్టివ్ నవలలు తేల్చే పుస్తకాలు చదవకు—" అన్నాడు.

"ఈ సలహా కోసం నేనిది చెప్పలేదు. ఈ రోజైనా మీ నడవడిక సరిగ్గా వుంటుందని హెచ్చరికగా చెప్పాను—"

"ప్లీజ్ శారదా! అలా అనొద్దు. నేను నీ వాణ్ణి. నువ్వు నన్ననుమానిస్తున్నావన్న ఆలోచనే నాకు నిమిషం ఉండనివ్వదు. ఒక్కసారి ఎప్పటికిలా నవ్వి నన్ను ఆఫీసుకు సాగనంపు—" అన్నాడు రఘు.

"నేను ఎప్పటికిలా నవ్వాలంటే — అందుకు మీ

కృషి కూడా ఉండాలి. నటించి లాభంలేదు—" అంది శారద.

"ఎవరో నీకు చెప్పుడుమాటలు...."

"నేను చెప్పుడు మాటలు వినే రకంకాదు. అదే నిజమైతే మన వివాహం జరిగివుండేది కాదు. మా నాన్న స్నేహితులందరిచేతా మీ గురించి చెడుగా చెప్పించాడు" అంది శారద.

"అప్పుడు నీకు రవంతైనా అనుమానం కలగలేదా?"

"లేదు. మీ విగ్రహం నాకు నచ్చింది. మీ మాటలు నాకు నచ్చాయి. మీ ముఖంలో మోసం కనబడలేదు నాకు. మిమ్మల్ని వదులుకోలేననిపించింది. మీలో ఏ లోపమున్నా నేను సరిదిద్దుకోగలనన్న నమ్మకముండేది. అందుకే ఎవరెన్ని చెప్పినా వినలేదు. ఏడుస్తూ ఈ పెళ్ళికి ఒప్పుకున్నాడు నాన్న—" అంది శారద.

ఈ కథంతా రఘుకి తెలిసినదే. అతను వాచీ చూసుకుని—"టైమయింది. కాఫీ తీసుకురా!" అన్నాడు.

"కాఫీ ఇవ్వకుండా మిమ్మల్ని ఆఫీసుకు పంపుతానా?" అంది శారద. ఆమె లోపలకు వెళ్ళి కాఫీ తీసుకువచ్చింది.

రఘు కాఫీ తాగి స్కూటరెక్కాడు.

## 2

సీట్లో కూర్చున్నాడు రఘు.

అది చల్లని ఎయిర్‌కండిషన్ గది. తనకొచ్చే రెండు వేల అయిదొందల రూపాయల జీతంకంటె—ఈ చల్లదనమే ఎక్కువ హాయినిస్తుంది రఘుకి. ఆ గదిలో అతనొక్కడే! పిలిస్తే తప్ప ఎవ్వరూ లోపలకు రారు. పిలవకుండా రాదల్చినవారు ముందుగా ఇంటర్ కామ్‌లో అనుమతి తీసుకుని మరీ వస్తారు.

ఆ గదిలో మరో చిన్న అపార్టుమెంట్ ఉంది. అందులో అతడి పర్సనల్ సెక్రటరీ పరిమళ ఉన్నది.

ఆమెను అతడు పిలిస్తే ఎవ్వరికీ తెలియదు. ఆమెనతడు ఏం చేసినా ఎవ్వరికీ తెలియదు—తనో, ఆమే చెబితే తప్ప!

పరిమళకు రఘు తన నేంచేసినా అభ్యంతరం లేదు. అసలామెను చూడగానే యేదో చేయాలనిపించేలాగునే ఉంటుంది. అందుకే కంపెనీ ఆమెను ఎన్నికచేసింది. సమర్ధుడైన ఆఫీసరుకు ఆకర్షణగా ఉండడం కోసమే కంపెనీ అతడికి సెక్రటరీనిచ్చింది.

రఘుకు ఉద్యోగం పెద్ద ఆకర్షణ. డ్యూటీ అంతకంటే ఆకర్షణ.

పరిమళ నవ్వితే నవ్వినట్లుండదు. ముద్దుకు ఆహ్వానిస్తున్నట్లుంటుంది.

నిన్న రఘు ఆమెను ముద్దుపెట్టుకున్నాడు. అయితే ఆ విషయం తనకూ, ఆమెకూ తప్ప తెలియదనుకున్నాడు. కానీ శారదకు తెలిసిపోయింది. అదీకాక ఆమె కచ్చితంగా టైము కూడా చెప్పింది.

ఆ టైము సరైనదే!

యెందుకంటే ఆమెను దగ్గరగా లాక్కోవడంలో ఒకరి వాచీ ఒకరికి తగిలింది.

"అద్దం బద్దలయిందేమో—" అంది పరిమళ. అప్రయత్నంగా తను వాచీ చూశాడు. టైము మూడూఇరవై అయింది.

ఈ విషయం బైటకు యెలా వెళ్ళింది.

తనకూ, పరిమళకూ ఉన్న సంబంధం మరెవరైనా కనిపెడుతున్నారా?

అయినా—అంత కచ్చితంగా పైము యెలా చెప్ప గలిగింది శారద?

కొంపతీసి ఆమె మనసు నిజంగా తనను అంటిపెట్టుకుని ఉన్నదా?

రఘు భయం భయంగా తన శరీరం వంక చూసు కున్నాడు.

శారద నిజంగానే తనను మనసారా ప్రేమించింది. తనూ ఆమెను ప్రేమించాడు. శారద తండ్రికీ వివాహం ఇష్టంలేదు. యెందుకంటే ఆయనకు తన గురించి తెలుసు. తనకు స్త్రీలోలత్వం ఉంది. తన మోజులోపడ్డ శారద యెవరేం చెప్పినా నమ్మలేదు. తనామెను భార్యగా ప్రేమించి ఆదరించినా స్త్రీలోలత్వాన్ని వదల్లేకపోతు న్నాడు. ఆ దుర్గుణాన్నామె సహించలేదు.

యేమిటి చేయడం?

ఒకవేళ పరిమళే శారదకు ఈ విషయం చెప్పిందేమో? అవును—లేకపోతే ఇంకెవరు చెబుతారు?

కానీ పరిమళకు విషయం చెప్పడంవల్ల లాభమేమిటి?

రఘుకు కారణం తోచలేదు. అతడు పరిమళనే అడిగి తెలుసుకోవాలనుకున్నాడు.

బల్లమీద మీట నొక్కాడు అతను. మరుక్షణంలో పరిమళ అతడిముందు ఉంది.

తొడలవరకూ మాత్రమే ఉన్న స్కర్టు—ఆమె విశాల హృదయాలను బహిర్గతపరచే డిజైన్‌లో వుంది. తీర్చి దిద్దినట్లున్న ఆమె శరీరపు వంపులు స్పష్టంగా తెలియడం కోసం—ఇంచుమించు చర్మాన్నంటి పోయేటంత బిగుతైన డ్రస్సు ధరించిందామె.

రఘు పరిమళ నేదో అడగాలనుకున్నాడు. ఆమె నవ్వింది.

నవ్వుతున్న పరిమళ అతడికి పక్కనే వుంది.

ఆమె నిలబడివుంది.

రఘు ఆమె నేదో అడగాలనుకున్నాడు. కానీ తనూ లేచినిలబడ్డాడు.

ఇద్దరి పెదవులూ కలిశాయి. రఘు చేతులు ఆమె వెనుక బిగుసుకుంటున్నాయి.

సరిగ్గా అప్పుడే టెలిఫోన్ మ్రోగింది.

రఘు తీయలేదు. పరిష్వంగ సుఖంలో మరేపనీ చేయలేకున్నాడతను.

ఫోన్ అలా ఆగకుండా మ్రోగుతూనే వుంది.

ఆఖరికి అతను ఫోన్ యెత్తి—"హలో!" అన్నాడు.

"నేను—శారదను!" అంది అవతలి కంఠం.

రఘు తడబడ్డాడు—"శారదా, నువ్వా—యెందుకు... యేమిటయింది?"

"యేమీ కాలేదు. ముద్దు...." అంది శారద.

"అంటే?"

"నిన్న మూడూఇరవైకి చేసిన పని ఈ రోజు పదీ యాభైకి చేశారు—" అంది శారద.

అతని చేతిలోని ఫోన్ జారిపోయింది.

"మై గాడ్—ఇదెలా సాధ్యం—" అనుకున్నాడతను.

పరిమళ జారిపడిన ఫోన్ అందుకుని జాగ్రత్తగా క్రెడిల్ చేసి అక్కడే నిలబడింది!

"పరిమళా—నువ్వు వెళ్ళొచ్చు—" అన్నాడు రఘు. అతడి మనసు ఏదోలాగై పోయింది.

నిజంగానే శారద మనసు తనను వెన్నంటి ఉందా?

పరిమళ వెళ్ళిపోయింది. సరిగ్గా పదియాభైకి తను పరిమళను ముద్దు పెట్టుకుంటానని తనకే తెలియదు. అలాంటప్పుడీ విషయం మరొకరిద్వారా శారదకు చేరు తుందనుకోవడం అసంభవం.

మరి శారదకు ఎలా తెలిసింది?

ఆఫీసులో ఎవరైనా తనను రహస్యంగా కనిపెడు తున్నారా? ఏది యేమైనా—క్షణాలమీద ఆమెకెలా తెలిసిపోతోంది?

తనిలా పరిమళను ముద్దు పెట్టుకోవటమేమిటి?—ఫోన్ మ్రోగింది!

తనింక శారదను దబాయించి ప్రయోజనంలేదు. ప్రవర్తన మార్చుకోవాలి.

# 3

ఒక వారంరోజులు రఘు బాగానే వున్నాడు. అతడు పరిమళవైపు చూడనుకూడా చూడలేదు. పరిమళ అతడిలోని మార్పు కనిపెడుతోంది.

"బాస్—మీరేదోలాగున్నారు—" అందామె.

"నేను బాగానే ఉన్నాను—" అన్నాడు రఘు.

"లేదు—మీ ఆరోగ్యంలో ఏదో లోపం కనపడు తోంది—" అంది పరిమళ.

రఘు ఆమెవైపు చూడకుండా—"పరిమళా—మన న్నెవరో రహస్యంగా గమనిస్తున్నారు. నువ్వెళ్ళి నీ పని చూసుకో—" అన్నాడు.

"మననెవరో గమనించడమా? అసాధ్యం...." అంది పరిమళ.

"అలా అనుకోవడానికి వీల్లేదు" అన్నాడు రఘు.

"మీరు నీడను చూసి బెదురుతున్నారేమో" అంది

పరిమళ.

అది నిజమే. భర్తకు భార్యనీడ! తను భార్య అనే నీడను చూసి బెదురుతున్నాడు. కానీ అందుక్కారణం లేదా? తను తన నీడను మోసగించడంలేదా?

"నువ్వు వెళ్ళు—" అన్నాడు రఘు.

పరిమళ కదల్లేదు-"మీరు నన్ను అనుమానిస్తున్నారు" అంది.

అతను ఆమెవంక అదోలా చూసి—"అవును. నీడను కూడా అనుమానించాల్సిన పరిస్థితి యేర్పడింది నాకు" అన్నాడు.

"మీ రేం చేయమంటే అది చేస్తాను. నన్ననుమానించవద్దు ప్లీజ్!" అంది పరిమళ.

"ఆల్ రైట్—అయితే పద—బైటకు వెళదాం—" అన్నాడు రఘు.

రఘు, పరిమళ బైటకు బయల్దేదారు.

ఆ కంపెనీలో ఉద్యోగులందరికీ రఘును చూస్తే అసూయ. అతడిది యెంతో సుఖ జీవితం. అతడు తమందరికీ అధికారి!

స్కూటర్ మీద రఘు, పరిమళ ఒక హోటల్‌కు వెళ్ళారు. రఘు అందులో ఒక గది కంపెనీ పేరున బుక్ చేశాడు. ఇద్దరూ గదిలోకి వెళ్ళారు.

"రూమ్ చాలా బాగుంది. రోజంతా ఇక్కడే గడుపుదామా!" అంది పరిమళ.

"రూమ్ నాకు నచ్చలేదు. నీకు నచ్చింది కాబట్టి రోజంతా నువ్వు ఇక్కడే గడుపు. మళ్ళీ నేను వచ్చి తాళం తీసేవరకూ ఏ అల్లరీ చేయకు—" అంటూ అతను గదితలుపు తాళంవేసుకుని వెళ్ళిపోయాడు.

తర్వాత అతను మహావిష్ణు హోటల్‌కి వెళ్ళాడు. అక్కడ అండర్ గ్రౌండ్ బ్రోతల్ హౌస్ రాత్రి పగలు పని చేస్తూంటుంది. రఘు ఓ అమ్మాయిని కుదుర్చుకుని ఓ గంటసేపు గడిపి తిన్నగా ఇంటికి వెళ్లాడు. శారద ఏ జెంట్లెవరో తెలుసుకోవాలని అతడికి చాలా కుతూహలంగా వున్నది.

తలుపు తీస్తూనే శారద వెక్కి వెక్కి ఏడ్చింది. అంత క్రితం కూడా ఆమె ఏడ్చిందనడానికి సూచనగా ఆమె కళ్ళు ఎర్రగా ఉబ్బి వున్నాయి.

"యేమయింది శారదా!" అన్నాడతను.

"కట్టుకున్న భర్త నాకు పూర్తిగా అన్యాయం చేశాడు...." అంది శారద.

"యేం జరిగిందిప్పుడు?"

"పెళ్ళాముండగా మీరు పరాయి ఆడదాన్ని మరిగారు. ఇప్పుడు...." అంటూ ఆమె టైముతో సహా వివరించి అతనేం చేశాడో చెప్పింది.

రఘు తెల్లబోయి — "ఇలా నీకెవరు చెప్పారు?" అన్నాడు.

"నా మనసు...."

"నేను నమ్మను. యెవరో నీకు నామీద విషం నూరి పోస్తున్నారు. వాళ్ళెవరో తెలిస్తే పీకపిసికి చంపేస్తాను" అన్నాడు రఘు.

"అయితే నన్ను చంపేయండి—" అంది శారద.

"శారదా!" అన్నాడు రఘు.

"భార్య వుండగా భర్త పరాయి స్త్రీల వెంట తిరుగుతున్నాడంటే అది ఆడదానికి ఎన్నివిధాల అవమానమో ఆలోచించారా?" అంది శారద.

"ప్లీజ్ శారదా—అలా అనకు...." అన్నాడు రఘు.

"మీరు నన్ను చంపేయండి. లేకపోతే నేనే చచ్చిపోతాను...." అంది శారద.

రఘు చటుక్కున ఆమె నోరు మూసి—"ఇంకెప్పుడూ అలా అనొద్దు శారదా—" అన్నాడు.

## 4

రఘులో చాలా మార్పు వచ్చింది. అతను బుద్ధిగా ఉండడం ప్రారంభించాడు. పరిమళ అతడి దగ్గరకు రావడానికిప్పుడు భయపడుతోంది.

ఒక నెలరోజులు గడిచాయి.

ఒకరోజున బిజినెస్ పనిమీద ఒకాయన రఘుని చూడ్డానికి వచ్చాడు. ఆయనతోపాటు ఆయన కూతురు హేమ కూడా వచ్చింది. హేమకు ఇరవై ఏళ్ళు. పేరుకు తగ్గట్టుగా పుత్తడి బొమ్మలా వుంది.

ఇద్దరూ బైటకు వెళ్ళాక ఒక నిముషంలో హేమ మళ్ళీ వెనక్కి వచ్చింది. "మీతో ఒక్క నిముషం పర్సనల్‌గా మాట్లాడాలి. గదిలో ఇంకెవరైనా ఉన్నారా?"

"లేరు. నేను పిలిస్తే తప్ప ఇంకెవ్వరూ ఈ గదిలోకి రారు—"

"మీరు నాకు నచ్చారు. ఐ లవ్ యూ—" అంది హేమ.

"థాంక్స్—" అన్నాడు రఘు.

"నాకు పెళ్ళికాకపోతే మిమ్మల్నే పెళ్ళిచేసుకుని ఉండేదాన్ని—" అంది హేమ.

"ఇట్స్ ప్లెజర్. కానీ నాక్కూడా వివాహమైపోయింది—" అన్నాడు రఘు.

"ఐ ఎన్వీ యువర్ వైఫ్—" అంది హేమ.

"ఐ ఎన్వీ యువర్ హజ్బెండ్—" అన్నాడు రఘు. అతనికీ వ్యవహారం అనుమానంగా నేవుంది. తమ కంపెనీలో పనివున్న చాలామంది కూతుళ్ళనీ, కోడళ్ళనీ వంక పెట్టి ఇలా ఆడవాళ్ళను తీసుకొచ్చి ఎరవేసి పనులు సాధించుకు పోతుంటారు. అందులోనూ తను ఈ విషయంలో కాస్త పేరు ప్రఖ్యాతులు సంపాదించాడు.

హేమ మనిషి చాలా చాలా బాగుంది.

"హీ ఈజ్ యూస్‌లెస్ పెర్సన్—" అంది హేమ. అతడు నపుంసకుడట.

హేమ రఘుపట్ల యెంతో ఆసక్తి చూపించినా అతను అవును, కాదని అనలేదు. వింటూ ఊరుకున్నాడు.

"మీరేమీ మాట్లాడ్డంలేదు....మీరూ నా భర్తకు లాగే...." అంది హేమ వాక్యం పూర్తి చేయకుండా.

రఘు ముఖం ఎర్రబడింది—"ఆడదంటే యెవరికైనా ఆశే—కానీ నా ఇబ్బందులు నాకున్నాయి—"

"ఏమిటి మీ యిబ్బందులు...." వెటకారంగా అంది హేమ.

"పరాయి ఆడదాని చేయి ముట్టుకోగానే నా భార్యకు తెలిసిపోతుంది—" అన్నాడు అతను.

"ఇట్స్ ఇన్క్రెడిబుల్—ఐ డోంట్ బిలీవిట్" అంది హేమ.

"నేనే నమ్మలేకపోతున్నాను—" అన్నాడు రఘు- "కానీ ఇది నిజం—" అంటూ రఘు తన అనుభవాలు చెప్పాడు.

"మీకు నేను నచ్చలేదు. అందుకే కోస్తున్నారు—" అంది హేమ.

"అందమైన ఆడపిల్ల కోరి ఆహ్వానిస్తూంటే ఇలాంటి అబద్ధాలు చెప్పేటంత మూర్ఖుణ్ని కాను నేను...."

"మై గాడ్—జస్ట్—ఎ లిటిల్ బెస్ట్...." అంటూ ఆమె చటుక్కున అతణ్ని కౌగలించుకుని ముద్దు పెట్టుకుంది.

చాలా కాలం తర్వాత—పరాయి ఆడదాని స్పర్శ... రఘు వెంటనే ఆమెను వదలలేకపోయాడు. అతడామెను వదిలేలోగానే బల్లమీద ఫోన్ మ్రోగింది.

రఘు శరీరం ఆపాదమస్తకం వణికిపోయింది. చటుక్కున అతడామెను వదిలి ఫోన్ తీశాడు.

"మళ్ళీ మీ బుద్ధి పెడదారితొక్కి వుంది—" అంది శారద.

ఆ మాటలు హేమ కూడా వింది. ఆశ్చర్యంతో ఆమె కళ్ళు పెద్దవయ్యాయి.

"చాలా విచిత్రంగా ఉంది—" అందామె.

"శారదా—నేను కావాలని ఈ పని చేయలేదు. ఒక అమ్మాయి నన్ను బలవంతంగా ముద్దు పెట్టుకుంది—" అంటూ జరిగింది వివరించాడతను.

"ఎవరైనా బలవంతంగా మిమ్మల్ని కత్తితో పొడవబోతూంటే చూస్తూ ఊరుకుంటారా? కాయశక్తులా ప్రతిఘటిస్తారు కదా — అలా ప్రతిఘటించడానికి ప్రయత్నం చేయలేదేం?" అంది శారద.

"బ్రావ్ రే!" అంది హేమ—"ప్రతిఘటించలేదని కూడా ఆమెకు తెలిసిపోయింది—"

రఘు ఫోన్ పెట్టేసి—"ఇదీ నా పరిస్థితి!" అన్నాడు.

"వేర్ దేరీజ్ విల్—దేరీజ్ వే—" అంది హేమ.

"అంటే?"

"శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాలు—" అంది హేమ.

"ఒక్కటి చెప్పు— ...."

"మీ భార్యకు మానవాతీత శక్తులున్నాయని నేను భావించడంలేదు. ఎవరో నమ్మకస్థుల్ని ఆమె తెలివిగా ఉపయోగించుకుంటోంది. అయితే నాకు మీ మీద మోజయింది కాబట్టి మంచి ఉపాయం ఆలోచించాను. ఆవిడ ఏజంట్లు ఎవరైనా మీరూ ఆమే కలిసివున్నప్పుడు నిఘా వేయరుకదా! ఏదో వంకన నేను మీ యింటికి వస్తాను. ఒక రాత్రికి ఆశ్రయం సంపాదిస్తాను. మీ భార్యకు నిద్రమాత్రలు తినిపించండి. ఆమె సమక్షంలో నే సరదా తీర్చుకుందాం. ఏ చిక్కూ ఉండదు. ఈ ట్రిక్కు పలికితే మీకే లోటూ ఉండదు. అప్పుడప్పుడా మెను ఇతర ప్రాంతాలక్కూడా తీసుకువెళ్ళి — మీ క్కావలసిన అమ్మాయిని నీ పక్కరూంలో వుంచుకుని కథ నడిపించ వచ్చు. దీన్నే కోటలో పాగా వేయడం అంటారు—" అంది హేమ.

"వండర్ ఫుల్ —" అన్నాడు రఘు. ఇలాంటి అయిడియా తనకు తట్టనందుకు అతను ఎంతగానో బాధ పడ్డాడు కూడా!

## 5

"ఈ ఒక్కరోజు మీ యింట్లో ఉంటాను. మా మామగారు మీవారికి తెలుసు. మాది సంప్రదాయమైన కుటుంబం. ఒక్కరైనా హోటల్లో ఉంచడానికి మామ గారి కిష్టముండదు. మీవారి నడిగితే ఇంటికివెళ్ళి మిమ్మల్ని అడగమన్నారు. మీ రంగీకరించకపోతే ఉన్నపళంగా తిరుగుప్రయాణం చేయాల్సొస్తుంది. అందువల్ల మామగారికి

అయిదు లక్షలు నష్టం...." అంటూ ఏవేవో చెప్పుకు పోయింది హేమ.

"అయ్యో—దానికేముంది? మాది పెద్ద యిల్లు. మీరుండడానికేమీ అభ్యంతరంలేదు. మావారూరికే అలా అంటారు కానీ ఇందులో నా పెత్తనమేముంది?" అని నవ్వింది శారద. ఆమె హేమను బాగా ఆదరించింది.

హేమ ఆలోచిస్తోంది. తను ముద్దుపెట్టుకోగానే భర్తకు ఫోన్ చేసి చెప్పగలిగిందామె. కానీ తనను ఆమె గుర్తించలేదు. అంటే తనెవరో ఆమెకు తెలియదు. తనకూ, ఆమె భర్తకూ జరిగిన సంభాషణ ఆమెకు తెలియదు. ఎటొచ్చీ అదొక్కటే ఆమెకు తెలుసు.

ఎలా తేలుస్తోంది?

ఆమె మనసు నిజంగా భర్త దగ్గరుంటే అది జరిగిందేమిటో చూడడమేకాక—తనను కూడా చూడగలిగి ఉండాలి. అంటే—ఎవరో ఏజంట్లు ఆమెకు నిముషాల మీద వార్త నందిస్తున్నారు. అంత నిముషాలమీద వార్తలెలా చేరుతున్నాయి? ఏదైనా వైర్ లెస్ ఏర్పాటు ఉందా? భర్త ప్రవర్తన గురించి తెలుసుకోవడానికి భార్య అంత కష్టపడుతుందా?

రఘుని ఎవరు కనిపెడుతున్నారు? ఆ కనిపెట్టినవారు దృశ్యాలనే చూస్తారా? మాటలు కూడా వింటారా? మాటలు కూడా వినే పక్షంలో తమ పథకం కూడా వారికి తెలిసిపోవాలి. అప్పుడీమె తగు జాగ్రత్తలో ఉండాలి—

అయితే శారద, హేమను మనస్ఫూర్తిగా ఆహ్వానించింది. ఆమెతో సరదాగా గడిపింది. సాయంత్రం భర్త యింటికి రాగానే—"ఏమిటి — అందరిదగ్గరా

మీరు భార్యా విధేయుడన్న సర్టిఫికెట్ సంపాదించ టానికి ప్రయత్నిస్తున్నారు?" అంటూ హేమను చూపిం చింది.

"మరి కాదా?" అన్నాడు రఘు.

"అవునో కాదో మీకే తెలును—" అంది శారద.

రఘు హేమకు వీలైనంత దూరంగా ఉండటానికి ప్రయత్నించాడు. హేమ కూడా శారదతోనే ఎక్కువగా తిరగటానికి ప్రయత్నించింది. రఘుపట్ల వీలైనంత తక్కువ ఆసక్తిని ప్రకటించింది. భోజనాలవద్ద ఆమె శారద వంటకాల్ని ప్రశంసించింది. శారద ఇల్లు సద్దుకున్న విధానాన్ని కూడా ఆమె మెచ్చుకుంది. తిరిగివెళ్ళాక తన ఇంట్లో అలాంటి మార్పులు చేయాలన్నదామె. ఒకటి రెండు వంటకాలు కూడా యెలా తయారుచేయాలో శారదను అడిగి తెలుసుకుందామె.

శారదకు హేమ బాగా నచ్చింది.

రాత్రి తొమ్మిదిన్నరకు తనకు నిద్రవస్తోందని పడు కుంది హేమ.

భార్యాభర్తలు తమ పడకగదికి వెళ్లారు. ఇంట్లో ఇంకెవ్వరూలేరు. ముగ్గురే మనుషులు.

శారదకు రోజూ రాత్రి పడుకోబోయేముందు మంచి నీళ్ళు త్రాగడం అలవాటు. ఆమె బాత్రూంకు వెళ్ళిన సమయంలో నీళ్ళలో మత్తుమందు కలిపాడు రఘు.

శారద వచ్చి నీళ్ళుత్రాగకుండానే పడుకుంది.

రఘు ఆమెకు నీళ్ళ గురించి గుర్తు చేయాలనుకున్నాడు. కానీ గుర్తుచేస్తే ఆమె అనుమానిస్తుందేమో!

మంచినీళ్ళ గురించి పట్టించుకోకుండా ఆమె అతడితో కబుర్లు మొదలెట్టింది. హేమ యెంత మంచిదో, ఆమె

తనను ఎన్నివిధాలుగా మెచ్చుకుందో, తనలోని ఏయే గుణాలామెను ఆశ్చర్యపరచాయో చెప్పుకుపోతోంది రఘుకు. ఆమె హేమ గురించి మాట్లాడుతూంటే రఘు శరీరం వశం తప్పుతోంది. కొద్దిసేపట్లో తామిద్దరం అమర సుఖాలనుభవించబోతున్నారు. కానీ ఆ కొద్ది సేపటికోసం తనిప్పుడు ఎంతసేపు ఎదురుచూడాలో?

"ఆ స్వమానూ ఆ హేమ గురించికాక—మరింకేమైనా మాట్లాడరాదూ?" అన్నాడు రఘు.

"పరాయి ఆడదాని తలపువస్తే శ్రీవారి మనసు వశం తప్పుతుందని నాకు తెలుసు. కానీ అది మంచి బుద్ధి కాదు—...." అంది శారద అతణ్ని కవ్విస్తున్నట్లు.

రఘు తడబడ్డాడు. శారదకు తమ పథకం తెలుసా, తెలియదా? అయినా దూరంగా జరిగినవన్నీ తెలుసుకో గల్గుతున్న ఆమె తమ పథకాన్ని ఊహించలేదా? ఊహిస్తే పరిస్థితి నింతవరకూ ఎందుకు రానిచ్చింది? తన్ను రెడ్‌హాండెడ్‌గా పట్టుకుందామనా?

"నీ యిష్టం. పోనీ ఆ హేమ కబుర్లే చెప్పు—నీతో యేమన్నా తగువే—" అన్నాడు రఘు విసుగ్గా.

హేమ కబుర్లు కాకపోయినా శారద యేదో ఒకటి వాగుతూనేవుంది తప్ప మంచినీళ్ళు తాగడంలేదు.

"అబ్బ—దాహం వేస్తోంది—" అంటూ లేచాడు రఘు. అప్పుడే శారదకు తన దాహం సంగతి గుర్తువచ్చి నట్లుంది—"అవునండీ—నాకూ దాహం వేస్తోందండీ" అంది.

"నీకూ తెస్తానుండు—"అంటూ మంచం దిగాడతను. పక్కనే ఉన్న నీళ్ళ సంగతి అతడికి గుర్తుంది. అయితే వాటి సంగతిచెబితే భార్య యేమనుకుంటుంది? అవి తన్నే

తాగమని తను వెళ్ళి నీళ్ళు తెస్తానంటుంది.

"ఈ రోజేమిటి—మీరింత బుద్ధిమంతులై పోయారు?" అంది శారద.

"నీ అనుమానమే గానీ నేనెలాగూ బుద్ధిమంతుణ్నే!" అన్నాడు రఘు—"అయినా ఇందులో బుద్ధి దేముంది? ఎలాగూ నేను మంచినీళ్ళు తాగటానికి వెళ్ళాలి...." అని ఉలిక్కిపడ్డట్లు—"పోనీ మళ్ళీ నీకే అనుమానాలొస్తాయో యేమో—కూడా నువ్వూ రాకూడదూ...." అన్నాడు.

"అక్కర్లేదు వెళ్ళండి. ఈ రోజు నాకేమిటో బద్ధకంగా ఉంది. అయినా నా మనసు మిమ్మల్ని వెన్నంటి ఉండగా కూడా రావలసిన అవసరం నాకు లేదు—" అంది శారద. అది హెచ్చరికో, మరేమిటో రఘుకి అర్థం కాలేదు.

ఇప్పుడతనికి ఒక్కటే బాధ. శారద చేత ఆ నీళ్ళెలా తాగించాలీ అని. అంతరాంతరాల్లో శారదకు తమ పథకం తెలిసిపోయిందని అనుమానంగా కూడా ఉంది. అనుకున్నది జరగదనే బెంగ కూడా ఉంది.

అతను ఓ గ్లాసుడు నీళ్ళుతాగి మరో గ్లాసుడు నీళ్ళతో గదిలోకి వచ్చాడు. అప్పుడే శారద గదిలోని నీళ్ళుతాగి ఖాళీ గ్లాసును పక్కన పెడుతోంది. అతన్ని చూడగానే "మరిచిపోయాను. నే నెప్పుడూ నీళ్ళిక్కడే పెట్టుకుంటానుగా—" అంది శారద.

"నాకు గుర్తుంది. కానీ అవి తాగేశాక ఇంకా నీళ్ళు కావాలేమో అనుకున్నాను. అవున్నాయని తెలిస్తే నేనే అవి తాగేవాణ్ని—" అన్నాడు రఘు. అతడికి మనసులో సగం సంతోషంగానూ, సగం అనుమానంగానూ ఉంది.

శారద నిజంగా ఆ నీళ్ళు తాగిందా లేక తాగినట్లు నటిస్తోందా?

ఏది ఏమైనా తను వేచి చూడాల్సిందే.... అతను మంచమెక్కాడు. ఆమె ఆవులించింది.

"అదేం చిత్రమో.... ఉన్నట్టుండి నిద్ర ముంచుకు వస్తోంది...." అంది శారద.

రఘు కూడా ఆవులించి—"నాకూ అలాగే వుంది. అయితే ఇందులో చిత్రమేముంది? టైము పదిన్నర దాటింది—" అన్నాడు.

"అవుననుకోండి. కానీ ఈ రోజు నాకు కబుర్లు చెప్పాలనివుంది. మీతో చాలా మాట్లాడాలనివుంది—" అని మళ్ళీ ఆవులించి — "అబ్బా — లాభంలేదు...." అంది. ఆమె కళ్ళు మూతలు పడిపోతున్నాయి.

మందు పనిచేస్తూ ఉండైనా ఉండాలి. ఆమె నటిస్తూనైనా వుండాలి. అదే నటనైతే ఆమె అద్భుతమైన నటి అనుకోవచ్చు. అంత సహజంగా నటిస్తోందామె.

కొద్ది క్షణాల్లో నిద్రకు పడింది శారద. రఘు ఆమెను కదిపాడు. కుదిపాడు. ఆమె చలించలేదు. కొన్ని పరీక్షలైన తరువాత ఆమె నిజంగా నిద్రపోయిందని నిర్ణయించుకున్నాడు.

తను కలిపిన మందు చాలా బలమైనది. మరో ఆరు గంటలవరకూ ఆమెకు వళ్ళు తెలియదు. కానీ ఆమె నిజంగా మందు తాగిందా?

రఘు ఓ అరగంటసేపు ఎదురు చూశాడు. అతడిలో కోర్కెలు బుసలుకొడుతున్నాయి. నెమ్మదిగా మంచం దిగి హేమ ఉన్న గదిలోకి వెళ్ళి—"హేమా!" అని

పిలిచాడు.

హేమ సిద్ధంగానే వుంది. వెంటనే పలికింది.

ఇద్దరూ తిరిగి పడక గదిలోకి వచ్చారు. రఘు గది తలుపులు వేశాడు. శారదను జాగ్రత్తగా ఎత్తి నేల మీద పడుకోబెట్టాడు. తర్వాత హేమతో శృంగారం ప్రారంభించాడు.

ఈ అనుభవం అతడికి గొప్పగా ఉంది.

ఒకవేళ శారద నిద్ర నటిస్తూంటే అంతకంటె తెలివి తక్కువ మనిషి వుండదనుకోవాలి. తన ఎదురుగా భర్త పరాయి స్త్రీని అనుభవిస్తూంటే అంతా చూసి—తప్పు జరిగిపోయాక—నాకంతా తెలుసు—మీరు తప్పుచేశారు అనడంవల్ల ప్రయోజనమేమిటి?

అదీకాక ఆడది అలా సహించలేదు!

ఇంట్లో యింకెవ్వరూ లేరు. గదిలో తాము ముగ్గురమే ఉన్నారు. శారద నిద్రమత్తులో ఉంది. గది తలుపులు వేసివున్నాయి. జరిగింది శారద తెలుసుకునే అవకాశం లేదు.

తర్వాత రఘు, శారద గురించి ఆలోచించలేదు.

## 6

శారదకు తెల్లవారుజామున అయిదింటికి మెలకువ వచ్చింది. లేచి పక్కనే ఉన్న భర్తవంక చూసి అదోలా నిట్టూర్చింది. నిద్రపోతున్న అతడి ముఖంవంక తదేకంగా చూస్తూ—"ఎంత అందగాడు?" అనుకొంది.

ఈ అందమే తనను భ్రమలో పడేస్తుంది. ఈ అందమే తనను అతడికి దాసోహం కమ్మంటుంది. ఈ అందమే తనకు ఆకర్షణయింది. ఈ అందమే తనకు శాపమూ అయింది.

అతడిలో వున్న అవగుణాలన్నీ తెలిసి కూడా కేవలం అందానికి భ్రమపడి అతన్ని పెళ్ళాడింది. అతన్ని తన అదుపులోకి తెచ్చుకోవాలని ఆమె సంకల్పం. తెచ్చుకో గలనన్నది ఆమె నమ్మకం.

ఎన్ని అవగుణాలున్నా అతను మంచివాడు. అది ఆమె అదృష్టం!

శారద ప్రేమగా అతడి చెంపలు నిమిరింది. జుత్తులోకి వేళ్ళు పోనిచ్చింది. అతను వళ్ళెరక్కుండా నిద్రపో తున్నాడు. ఆమె యేంచేసినా అతడికి తెలియడంలేదు.

శారద మంచం దిగి పూజగదిలోకి వెళ్ళి కళ్ళు మూసుకుని దేవుడికి దణ్ణంపెట్టుకుంది. అది లేవగానే రోజూ ఆమె విధిగా చేసేపని. దణ్ణం అయేక ఆమె మందిరంలోకి చూసి ఉలిక్కిపడింది. మరుక్షణం ఆమె కళ్ళు యెర్రగా అయ్యాయి. కోపంగా పడక గదిలోకి పరుగెత్తి ఒక్క కుదుపు కుదిపి భర్తను లేపింది.

రఘుకు మత్తు కళ్ళు విడడంలేదు-"యేమిటి శారదా!" అంటున్నాడు ముద్దగా.

"రాత్రి....రాత్రి....మీరు పరాయి స్త్రీని అనుభ వించారు...." అంది శారద.

రఘు మత్తు విడిపోయింది...."యేమిటన్నావ్?"

"రాత్రి....మీరు...." అని ముఖం కప్పుకుని యేడవ సాగింది. శారద.

రఘు కలవరపడ్డాడు—"నువ్వేమంటున్నావో అర్థం కావడంలేదు నాకు...."

"అర్థమయ్యేలా చెప్పాలా?—....మీ వ్యవహారం సరిగ్గా రాత్రి పదకొండు గంటలకు ప్రారంభమైంది...." అంటూ మొదలుపెట్టి అతనే ఆశ్చర్యపోయేలా వివరించి

చెప్పింది శారద.

"ఎందుకలా అనుకుంటున్నావ్?" అన్నాడు రఘు అనునయంగా.

"ఇంక మీ రేం మాట్లాడొద్దు. జరిగింది ఒప్పేసుకోండి. ఆఖరికి ఇంతకు తెగించారన్నమాట. మీ కాకావలసిన దాన్ని ఇంటికే తీసుకొచ్చి...." అంటూ మళ్ళీ యేడ్వసాగింది శారద.

రఘుకి ఏమనాలో తెలియలేదు.

"శారదా—నీకు ఈ తప్పుడు సమాచారం ఎవరు చెప్పారో తెలి స్తే—నేను నీకు కలిగిన అపోహను తొలగించి ఉండేవాణ్ని. ఇప్పుడు నీకు ఎలా చెప్పాలో తెలియడంలేదు" అన్నాడు రఘు.

"అనవసరంగా దబాయించకండి. నా సమాచారం మనుషులమీద ఆధారపడ్డదికాదు. నా మనసు....అది అబద్ధం చెప్పదు...." అంది శారద.

"అయితే నీ మనసు నన్ను తప్పుచేయకుండా ఎందుకు ఆపదు? అంతా చూస్తూ ఊరుకుని అప్పుడు ఈ రంగంలోకి దిగుతుందేం? నువ్వనేది యెంత హాస్యాస్పదంగా వుందో నువ్వే అర్థం చేసుకో—" అన్నాడు రఘు,

"మనసు అనుభూతి పొందగలదు తప్పితే మాట్లాడలేదు. మాట్లాడే తనువు అప్పుడే అపస్మారక స్థితిలో ఉందో. రాత్రి మంచినీళ్ళు తాగేవరకూ బాగానే వున్నాను. తాగగానే నిద్రముంచుకొచ్చేసింది. ఇప్పుడు నాకు అనుమానం కలుగుతోంది. ఇది మీరు కావాలని ఆడిన నాటకమేనని. ఆ గ్లాసులో మిగిలిన నీళ్లు పరీక్ష చేయిస్తే అందులో నిద్రమందు కలిసిందీ లేనిదీ తెలుస్తుంది—"

అంది శారద.

రఘు ఆమెవంక భయంగా చూస్తూ—"అందులో నిద్రమందు కలిసిందని తెలిస్తే ఏంచేస్తావ్?" అన్నాడు.

"ఇంత విషంతాగి చచ్చిపోతాను!" అంది శారద.

"ప్లీజ్—అంతమాటనకు శారదా!" అన్నాడు రఘు. అతను చటుక్కున చేతుల్లో ముఖం కప్పుకుని—"నేను పాపిని, నీచుణ్ని, నీకు తగనివాణ్ని. నన్నెందుకు పెళ్ళి చేసుకున్నావు నువ్వు?" అంటూ ఏడ్వసాగాడు.

"ఛీ — అసహ్యంగా ఏడుస్తారెందుకు?—" అంది శారద—"తప్పుచేసింది నేను. మిమ్మల్ని పెళ్ళిచేసుకోవడం తప్పు అని అంతా అన్నారు. కానీ కాదని వాదించాను నేను. ఈ రోజు మీరు కూడా అంతా అన్నమాటే అంటున్నారు. ఇంక నేను బ్రతికి లాభం లేదు. మరొక్కసారి మీరిలా ప్రవర్తించారో నేను మిమ్మల్ని హెచ్చరించను. నా ప్రాణం తీసుకుంటాను-"

అతను కళ్ళు మెరిశాయి—"అంటే నువ్వు నాకు మరొక్క అవకాశం ఇస్తున్నావా?" అన్నాడు.

"ఏం—ఇవ్వననుకున్నారా-ఇవ్వకూడదనుకున్నారా?" అంది శారద తీవ్రంగా.

రఘు చటుక్కున శారద చేతులు పట్టుకుని—"అలా మాట్లాడకు శారదా! నాకు నువ్వు కావాలి—నువ్వు నా దేవతవు. నువ్వు లేనిదే నేను బ్రతకలేను. నన్ను నేను సంస్కరించుకుంటాను. ఒక్క అవకాశం ఇవ్వు—" అన్నాడు.

"ఒక్క అవకాశం మాత్రమే ఇస్తున్నాను—" అంది శారద.

"ఏమండీ ఎలాగుంది?" అనడిగింది శారద.

"నే నిక్కడున్నానని ఎలా తెలుసు?" అనడిగాడు రఘు నీరసంగా నవ్వుతూ.

"అందులో ఆశ్చర్యమేముంది?"

"నాకు ఆక్సిడెంటయినట్లు సాయంత్రందాకా నీకు చెప్పొద్దని చెప్పాను—" అన్నాడు రఘు—"అయినా ఇది పెద్ద యాక్సిడెంటేంకాదు. ఓ గంట రెస్టు తీసుకుని ఇంటికెళ్ళిపోవచ్చు నన్నాడు డాక్టర్—"

"మీరు చెప్పకపోతే నాకు తెలియదనుకున్నారా. మిమ్మల్ని వెన్నంటి ఉండే నా మనసు ఎప్పటికప్పుడు మీ గురించి నాకు సమాచారం అందజేస్తూనే ఉంటుంది. మీకలా ఆక్సిడెంటు కాగానే— నేను మీ ఆఫీసుకు ఫోన్ చేశాను. వాళ్ళు తమకేమీ తెలియదన్నారు. నేను ఆఫీసుకు బయల్దేరి వెళ్ళాను. అప్పుడే వార్త అక్కడికి చేరింది. నేను హాస్పిటల్ కి పరుగున వచ్చాను—"

రఘుకు పెద్దగా దెబ్బలేం తగల్లేదు. అతడు ఆశ్చర్యంగా భార్యవంక చూస్తూ—"నీకేమైనా మానవాతీత శక్తులున్నాయేమో అని అనుమానంగా ఉంది-" అన్నాడు.

"మంచి మనసు ఉంటే శక్తులు మనిషిని వెతుక్కుంటూ వస్తాయి—" అంది శారద.

రఘు రెండు రోజులు ఇంటిపట్టునే ఉండి విశ్రాంతి తీసుకున్నాడు. గత కొద్దిరోజులుగా అతడి ప్రవర్తనలో మార్పు కనబడుతోంది. అతడు అమ్మాయిలకు బాగా దూరంగా ఉంటున్నాడు. తనకో మగ పర్సనల్ సెక్రటరీని నియమించుకున్నాడు. ఆఫీసులో ఏకాంతం కూడా తగ్గించాడు.

ఇంట్లో భార్యతో అతను అనేకమార్లు ఇలా చెప్పాడు.

"శారదా, నాలో స్త్రీలోలత్వం ఉంది. అది నా బలహీనత. ఒప్పుకుంటాను. కానీ నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నీ కోసం ప్రాణాలిమ్మన్నా ఇస్తాను. నువ్వు కష్టపడితే సహించలేను. నువ్వు లేకపోతే బ్రతకలేను. నువ్వు నా జీవితంలో ప్రవేశించడం నా అదృష్టం. నా బలహీనతను జయించడానికి నా శాయాశక్తులా ప్రయత్నిస్తాను. ప్రయత్న లోపమేమీ ఉండదు. కానీ నా ఉద్యోగం పరిస్థితి నీకు తెలుసు. యెందరో నామీద వలలు పన్నుతుంటారు. ఋష్యశృంగుణ్ని కూడా పడగొట్టగల లలనామణులు రంగంలో దిగుతారు. అలాంటప్పుడు నేను తప్పు చెయ్యొచ్చు. చెయ్యకూడదన్నదే నా ఆశ. కానీ తప్పు చేస్తే నన్ను క్షమించు. నీ ప్రాణాలు తీసుకోకు. ఒకవేళ నీకు ప్రాణాలు తీసుకోవాలనిపిస్తే— ముందు నా ప్రాణాలు తీసి తర్వాత యేమైపోయినా ఫర్వాలేదు. నీ గురించి ఎటువంటి దుర్వార్తా విని భరించలేను నేను—"

ఈ మాటలు చెప్పినపుడు అతడి కళ్ళలో నిజాయితీ ప్రతిఫలించేది. ముఖంలో అమాయకత కనబడేది. అప్రయత్నంగా శారద అతడి కనులలో కరిగిపోయేది.

భర్త ఆఫీసులో చేసిన మార్పుల గురించి శారద విన్నది. ఆమె సంతోషించింది.

ఒక రోజున శారద భర్తతో కలిసి బజారుకి వెళ్ళినపుడు మెరుపుతీగలాంటి అమ్మాయి కనబడితే—క్షణంపాటు రఘు ఆమెను రెప్పవాల్చక చూశాడు.

శారద అతడిచేయి గిల్లి—"కావాలనిపిస్తోందికదూ—పాడు బుద్ధి!" అంది.

రఘు శారదవంక అదోలా చూసి—"అందాన్ని నే నొక్కణ్నే కాదు. చాలామంది చూస్తారు ..." అన్నాడు.

"చాలామంది చూసి ఊరుకుంటారు. మీకూ చాలా మందికీ అదే తేడా!"

రఘు అక్కణ్నించి కదుల్తూ—"చిన్న పనివుంది—ఇక్కణ్నించి పోదాం—" అన్నాడు. శారద మాట్లాడకుండా అతణ్ని అనుసరించింది. కాసేపలా బజార్లో తిరిగి ఇద్దరూ ఓ దుకాణంలోకి వెళ్ళారు. రఘు అక్కడ ఆరంగుళాల పొడవున్న స్టెయిన్ లెస్ స్టీల్ బాకు ఒకటి ఖరీదు చేశాడు.

బైటకు వచ్చేక—"ఇదెందుకు?" అంది శారద.

"ఇంటికెళ్ళాక చెబుతాను—" అన్నాడు రఘు మౌనంగా.

ఇద్దరూ ఇల్లుచేరాక శారద వెంటనే బాకు గురించి అడిగింది. ఆమెకు చాలా కుతూహలంగా ఉంది.

"చంపడానికి!" అన్నాడు రఘు.

"యెవర్ని?" అంది శారద అనుమానంగా.

"ఆ పిల్లను...."

"యే పిల్లను?" ఆశ్చర్యంగా అడిగింది శారద.

"ఇందాకా షాపులో నేను చూడగా నువ్వు అనుమానపడ్డావే—ఆ పిల్లను!"

"ఆ పిల్లను చంపడమెందుకు?" అంది శారద మరింత ఆశ్చర్యపోతూ.

"యెందుకేమిటి? ఆమెను వాంఛిస్తున్నాననిగదా నీ అనుమానం. ఆమె నెంతగా ద్వేషిస్తున్నానో నీ కర్థం కావడంకోసం ఆ మెను చంపేస్తాను...." అన్నాడు రఘు.

శారద రఘు ముఖంలోకి చూసింది. అతడి కళ్ళల్లో

దృఢ నిశ్చయం కనబడింది.

"కాంపతీసి అంతపనీ చేశారు గనుక...." అంది అదో జోక్ కింద తీసిపారేస్తూ.

"చేస్తాను...." అన్నాడు అతను.

"మీకేం పిచ్చిపట్టడం లేదుకదా!" అంది శారద.

"నీ అనుమానం నాకు పిచ్చిపట్టిస్తోంది. ఈ రోజునుంచీ కంటికి కనిపించిన అందమైన ఆడపిల్లనల్లా చంపేయడమే నా వృత్తిగా పెట్టుకుంటాను—" అన్నాడు రఘు కసిగా.

శారద అతడి గుండెలమీద చేయివేసి—"పరాయి స్త్రీలకు మిమ్మల్ని దూరంగా ఉండమన్నదెందుకు? మీరు నాకు మరింత దగ్గరవుతారని.... మీరో హంతకుడుగా మారితే నాకేం ప్రయోజనమండీ — మీరెప్పుడూ నాతోనే వుంటూ నన్నే తలవాలి. మనం ఒకరికోసం ఒకరం బ్రతకాలి. అదీ నా కోరిక...." అంది.

రఘు ఆమెను దగ్గరగా తీసుకుంటూ—"ఇరవై నాలు గంటలూ నువ్వు నన్ను అనుమానిస్తూ ఉంటే అదెలా సాధ్యపడుతుంది? నేను మారానని నమ్మకం నీక్కలక్క పోతే నేను హంతకుణ్ణికాక తప్పదు...." అన్నాడు.

"మీరు మారారని నేను నమ్ముతున్నాను. ఇందాకా ఏదో జోక్ చేస్తే మీరు సీరియస్సై పోయారు. యెప్పుడూ మీరు హత్యల గురించి మాట్లాడకండి. నాకు భయం వేస్తుంది—" అంది శారద.

"ఒక్కసారి మాట్లాడనీ—" అంటూ బాకు తీశాడు రఘు. శారదకు దాన్నందించి — "ఇది నీ దగ్గరుంచు. యెప్పుడైనా నీ మనసు నా గురించి తప్పుచేసిన సమాచారం అందించిందా—అప్పుడీ బాకుతో నన్ను చంపేసేయ్. ఈ విషయంలో ఇహ నీవేం చెప్పినా విన

దల్చుకోలేదు. నువ్వు నన్ను చంపని పక్షంలో—నీ నుంచి అభియోగం విన్న తక్షణం ఇంక నేనే ఈ బాకుతో నన్ను నేను చంపుకుంటాను. అందుకే ఈ బాకు కొన్నది—"

శారద భయంగా ఆ బాకువంక చూసింది. అది తళతళా మెరుస్తోంది.

## 8

అతను తలుపు తట్టాడు.

ఆమె తలుపు తీసి—"వచ్చావా?" అంది.

"నీ పిలుపు నెప్పుడు కాదన్నాను?" అన్నాడతను.

"అలా మాట్లాడకు స్వరూప్—" అంది ఆమె.

"మరెలా మాట్లాడను శారదా!" అన్నాడతను.

"నేను వివాహితను. మనసా, వాచా రఘుకు అంకితమై పోయినదాన్ని. నన్ను వేరే ఒకరు ప్రేమించడం, ఆరాధించడని నేను సహించలేను. ఒక అన్నలా నిన్ను అభిమానించాలని ఆశిస్తున్నాను .. " అంది శారద.

"నా శరీరాన్ని శాసించగలవు కానీ నా మనసును నువ్వు శాసించలేవు శారదా! యెటొచ్చీ నీకు కష్టం కలిగించే పని యేదీ చేయలేను నేను. ఇకముందు కూడా చేయబోను...." అన్నాడు స్వరూప్.

స్వరూప్ శారదను ప్రేమించాడు. శారద తండ్రి కూడా అతణ్ని ఆమెకు తగిన భర్తగా భావించాడు. కానీ శారద రఘుని ప్రేమించింది. వివాహం చేసుకుంది.

"నువ్విచ్చిన ఎలక్ట్రానిక్ స్త్రీ అమోఘంగా పని చేస్తోంది—" అంది శారద.

"అది నీ కోసం నా మేధనంతా వినియోగించి తయారు చేశాను. పని చేసి తీరాలి—"

"పద—చూద్దువుగాని...." అంది శారద.

ఇద్దరూ లోపలకు పూజగదిలోకి వెళ్ళారు. అక్కడ దేవుడి మందిరంలో ఓ చిన్న ప్లాస్టిక్ చెట్టు ఉన్నది. అది తమాషాగా కదుల్తోంది.

"చూశావా—యిప్పుడే ఆయన యెవరికో షేక్ హాండిచ్చారు. యేమయిందో యేమో విరగబడి నవ్వుతున్నారు...." చెట్టు కదలికనుబట్టి శారద చెప్పుకు పోతోంది.

"రికార్డు కూడా ఆన్ చేశావా?"

"ఆహా—అది చక్కగా యే టైముకు ఏయే ముఖ్య కార్యాలు జరిగాయో టైపుచేస్తోంది. శరీరంలో కలిగే ముఖ్యమైన మార్పులన్నీ నాకు తెలిసిపోతున్నాయి. నేను చెబితే ఆయన ఆశ్చర్యపోతున్నారు. నువ్వు నిజంగా మేధావివి—" అంది శారద.

స్వరూప్ నిట్టూర్చి—"యెందరో మేధావులకువలె నేనూ భగ్న ప్రేమికుణ్ని—" అన్నాడు.

స్వరూప్ వంక శారద అదోలా చూసి—"నన్ను, ప్రేమను కలిపి మాట్లాడ్డం నాకింకా నచ్చలేదు—"అంది.

"అలా కలిపి ఆలోచించడంవల్లనే నేను నీ కోసం ఈ యెలక్ట్రానిక్ వృక్షాన్ని చేయగలిగాను—" అన్నాడు.

ఎలక్ట్రానిక్ వృక్షం నిజంగానే గొప్ప మేధాశక్తితో చేయబడింది. మనిషి నరాల సంచలనాన్ని కదలికతో ప్రతిఘటించగలదా వృక్షం. అది శారద కోసం అహో రాత్రాలు పరిశ్రమించి తయారుచేశాడు స్వరూప్. అందుకు శారద కూడా అవసరమైన సమాచారన్నిచ్చింది. ఏ రకం కదలికకు రఘులో నరాల సంచలనం ఏ విధంగా కలుగుతుందో—స్వరూప్ ఇచ్చిన పరికరాల ద్వారా రికార్డు చేసింది. ఎలక్ట్రానిక్ వృక్షాన్ని స్వరూప్—రఘుకి అను

గుణంగా తయారుచేశాడు.

"X—Y—3 ఫ్లూరైడ్ అయిపోయింది—అందుకే నీ కోసం కబురుపెట్టాను—" అంది శారద.

"బహుశా అందుకే అయింటుందని నేను ఊహించాను—" అంటూ జేబులోంచి ఓ సీసా తీశాడు స్వరూప్.

ఎలక్ట్రానిక్ వృక్షంలో సంచలనం కలగాలంటే రఘు ఆ ద్రవం రోజుకు ఒక చుక్క చొప్పున తాగాలి. ఆ ద్రవం రక్తంలో సులభంగా కలిసిపోతుంది. రోజుకు ఒక చుక్క నరాల సంచలనాన్ని — ఎలక్ట్రానిక్ వృక్షానికి పంపడానికి ఖర్చవుతుంది. ఎన్ని చుక్కలు వేస్తే అన్ని రోజులు పనిచేస్తుంది ఎలక్ట్రానిక్ వృక్షం.

"చాలా థాంక్స్—" అంది శారద ఆ సీసా అందుకుంటూ. నాలుగైదు రోజుల్లో భర్త ఆఫీసు పనిమీద నెలరోజులు టూర్ వెళ్ళబోతున్నాడు. అప్పుడాయన ఎలా ప్రవర్తిస్తాడో ఏమిటో—ఈ మందు ఎంతైనా అవసరమే!

స్వరూప్ శారదవంక అదోలా చూసి—"ప్రవర్తన సరిగాలేని అతడిపై నీకంత మోజు ఎందుకు?" అన్నాడు.

"మరీ ఇలా ఉంటాడని పెళ్ళికి ముందు అనుకోలేదు" అంది శారద.

ఆ మాటలకు స్వరూప్ కళ్ళు మెరిశాయి—"శారదా! తెలివైనవాళ్లు చేసిన తప్పును సరిదిద్దుకుంటారు—" అన్నాడతను.

"అందుకేగదా నీ సాయం కోరాను—"

"మరోవిధంగా నీకు సాయపడడానికి కూడా నేను సిద్ధంగా వున్నాను" అన్నాడు స్వరూప్.

"అంటే?"

"శారదా! నన్నర్థం చేసుకో. నేను నిన్ను మనసారా ప్రేమిస్తున్నాను. పరాయి ఆడదాని గాలి సోకినా నాకు నచ్చదు. నువ్వు తప్ప నాకు వేరెవ్వరూ వద్దు. ఇలా భావించే నన్ను వదిలి—ఎలక్ట్రానిక్ వృక్షంతో అను క్షణం హద్దులో ఉంచవలసిన మగాడి చుట్టూ నీ మనసు యెందుకు తిరుగుతోందో—ఈ వివాహంలో నువ్వుపొందే సుఖమేమిటో నాకు అర్థం కావడంలేదు. రఘును అదుపులో ఉంచడంకోసం ఎలక్ట్రానిక్ వృక్షం తయారు చేశాను. అతన్ని వదిలిపెడతానంటే నిన్ను నాదాన్ని చేసుకుందుకు నే నెన్నడూ సిద్ధంగా నే ఉంటాను—"

శారద ఆ మాటలకు కోపగించుకోలేదు. జాలిగా అతడివంక చూసి—"నిన్నో, నన్నో దురదృష్టం వరించింది. అష్టకష్టాలూపడి అతణ్ని అదుపుచేయడానికి ప్రయత్నిస్తాను తప్పితే మరో మగాణ్ని నా జీవితంలోకి ఆహ్వానించలేను. ఆ సంగతి నీకు తెలుసు—" అంది.

"సరే—మరి నేనుంటాను. మీ ఆయనకు X—Y—3 ఫ్లూరైడ్‌ని దేంట్లో కలిపిస్తున్నావు. కాఫీలో నే కదా?—అందులో తప్ప మరెందులో వేసినా అది ఇమడదు. వాసన తెలిసిపోతుంది—" అన్నాడు స్వరూప్.

"రోజూ ఆఫీసుకు వెళ్ళేముందు ఆయనకు కాఫీ ఇస్తాను. అందులో ఈ ద్రవం కలుస్తుంది...." అని—"ఆయన ఆఫీసు పనిమీద పెద్ద టూర్ వేస్తున్నారు. ఇది అర్జంటయింది—" అంది శారద.

"అర్జంటంటే ఎన్నాళ్ళేమిటి?"

"నెలరోజులనుకోవచ్చు—" అంది శారద. స్వరూప్ వెళ్ళిపోయాడు.

"నెలరోజులు నిన్ను విడిచి వుండాలి. ఎలాగో!" అన్నాడు రఘు.

"నాకూ అలాగేవుంది. కానీ నా మనసెప్పుడూ మిమ్మల్ని వెన్నంటే వుంటుంది—" అంది శారద.

"ఇది హెచ్చరికా?"

"కాదు—ప్రేమ!" అని నవ్వింది శారద.

"అవును శారదా—మనది విచిత్రమైన ప్రేమ! కండ పట్టివున్న ఆడదాన్ని చూస్తే నాలో కండకావరం చెల రేగుతుంది. కానీ నా మనసులోని ప్రేమ నీకుమాత్రమే పరిమితం. క్షణక్షణమూ నాపైన అనుమానం నీకు. కానీ నేనే కావాలి నీకు. నేను లేనిదే నువ్వు బ్రతకలేవు. నువ్వు లేనిదే నేను బ్రతకలేను. అయితే మన జీవితాల్లో కొత్త మార్పులొస్తున్నాయి. నీలోని అనుమాన భూతం క్రమంగా చచ్చిపోతోంది. నాలోనూ మార్పు వస్తోంది. నీ మనసు నన్ను వెన్నంటి ఉండడం కాదుగానీ నాకు పరాయి స్త్రీలపట్ల విముఖత పెరిగింది. మొన్న క్లబ్బులో ఓ స్త్రీ నన్ను కొంటెగా తాకితే నేను గుడ్లెర్రజేసి చూశాను. నేను మారిపోతున్నాను శారదా—మారి పోతున్నానేమిటి — మారిపోయానేమో కూడా—" అన్నాడు రఘు.

శారద అతడి ముఖంవంక చూసి—"యెంత అమాయ కంగా ఉంది?" అనుకుంది. అప్రయత్నంగా ఆమె అతడి బుగ్గలమీద ముద్దుపెట్టుకుని—"మన ప్రేమ విచిత్రమైనదే కావచ్చు. కానీ అది అమరం కూడా—" అంది.

"ఐ లవ్ యూ శారదా!" అంటూ అతడామెను బలవంతంగా ముద్దుపెట్టుకున్నాడు. శారద చేతులు

అతణ్ని బలంగా పెనవేసుకున్నాయి.

"మరి వచ్చేదా?" అన్నాడు రఘు.

"ఉండండి—కాఫీ తాగి వెడుదురుగాని...." అంది శారద.

"నేను మరిచిపోయినా కాఫీ సంగతి నువ్వు మరువవుగదా—" అన్నాడతను నవ్వుతూ.

## 10

రఘు ఒక్కడూ లాన్లో కూర్చునివుండగా—"హాయ్" అంటూ పలకరించిందో యువతి.

"మీ రెవరో నాకు తెలియదు—" అన్నాడు రఘు ముఖం చిట్లించి.

"కావాలనుకుంటే స్త్రీ పురుషులకు పరిచయం ఎంత సేపు?" అందామె.

"నేను కావాలనుకోవడంలేదు—" అన్నాడు రఘు చిరాగ్గా.

ఆమె చనువుగా అతడి ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చుని — "నేను కావాలనుకుంటున్నాను—" అని "యూ ఆర్ రియల్లీ బ్యూటిఫుల్—" అందామె.

"థాంక్స్!"

"ఉత్త థాంక్సేనా?" అందామె.

"నిజం చెప్పినవాళ్ళకు థాంక్సుకు మించి ఏమీ ఇవ్వను నేను—" అన్నాడు రఘు.

"కానీ నేను తీసుకోగలను—" అందామె.

"ఎవరు మీరు?" అన్నాడు.

"ఎవరైనా కాల్ గర్ల్ని మాత్రం గాదు. మిమ్మల్ని చూడగానే థ్రిల్లయిపోయాను. మీతో మాట్లాడాలని పించింది. యెంత మాట్లాడినా తనివితీరలేదు. ఆఖరికి

మీరు నావైపు నిర్లక్ష్యంగా చూస్తున్నప్పటికీ కూడా!"

రఘు ఆమెవంక అదోలా చూసి—"ఎందుకు మీరు మీ సమయం వృధాచేసుకుని నా సమయం వృధా చేస్తారు? నన్ను పొగడడం ద్వారా మిమ్మల్ని మీరు చిన్నబుచ్చుకుంటున్నారు. మీ అందం ముందు నేనెంత? మీరు తల్చుకుంటే వేలకువేలు బాయ్ ఫ్రెండ్సు దొరుకుతారు మీకు—" అన్నాడు.

"నేను తల్చుకున్నాను. మొదటి బాయ్ ఫ్రెండే అవతలకి పొమ్మంటున్నాడు—" అందామె.

"అవును మరి—అతను వివాహితుడు"—అన్నాడు రఘు.

"మీరు వివాహితులా? నమ్మడం కష్టం. బహుశా నన్ను వదుల్చుకుందుకు అబద్ధం చెబుతున్నారనుకుంటాను" అందామె.

"నిజం—కావాలంటే ఋజువులు చూపిస్తాను. నేను నా భార్య వివాహంనాడు తీయించుకున్న ఫోటో ఒకటి ఎప్పుడూ నా పర్సులో ఉంటుంది—" అన్నాడు రఘు.

"వివాహమైందన్నాసరే-నా మనసు మిమ్మల్నే కోరుతోంది—" అందామె.

"అది చాలా తప్పు. మీ భర్త తప్పుదారిన పడితే మీకు నచ్చుతుందా?—" అన్నాడు రఘు.

"మీవంటి భర్త దొరికితేనా—మీరెలా మసలినా నేను పట్టించుకోను. తొలి రాత్రే మీరు మరో ఆడది కావాలన్నా నేను విచారించను. మీవంటివాణ్ని భర్తగా పొందడమే నా అదృష్టం—" అందామె!

రఘు ఆలోచనలోపడ్డాడు. తను నిజంగానే అందగాడు. యెందరో ఆడవాళ్ళు కోరి తన కౌగిట్లో నలిగి

పోయారు. తన గుణం తెలిసి కూడా శారద వివాహం చేసుకుంది తనను. తనవంటివాడు భర్తగా లభించడమే అదృష్టమా? అందుకే శారద తన తప్పులన్నీ క్షమించగల్గుతోందా? తను ఇంకా తప్పులు చేసినా ఆమె తన్ను క్షమిస్తుందా?

"ఏమండీ—ప్లీజ్—ఒక్క అయిదు నిముషాలు. నేను మీ పక్కరూంలోనే ఉంటున్నాను...."

ఆ యువతి అరిస్తోంది.

రఘు మనసు ఊగిసలాడుతోంది. తనను ప్రేమించడంలో శారద గొప్పతనం ఏమీ లేదా? అంతా తన గొప్పతనమేనా?

రఘులో అహం పెరుగుతోంది. ఆమె అతడి అహాన్ని పెంచుతోంది.

అతను లేచాడు. ఆమెను అనుసరించాడు.

అప్పటికి రఘు ఇల్లు వదిలిపెట్టి రెండు వారాలయింది. ఈ రెండు వారాలు కూడా అతనెంతో బుద్ధిగా ఉన్నాడు. తీరుబడి సమయంలో ఫిలాసఫీ పుస్తకాలు చదువుకుంటున్నాడు. మనసు కొద్దిగా ఆరాటపడుతోంది. అయినా నిగ్రహించుకుంటున్నాడు. చూస్తూండగా ఇప్పుడీ ఆహ్వానం వచ్చింది. ఏం చేయాలి?

అతడామె గదిలో ప్రవేశించాడు. అతని వెనకనే ఆమె తలుపులు మూసింది.

ఆమె అతణ్ని తాకలేదు. అతడి అందాన్ని పొగడుతోంది. అతణ్ణి భార్యగా పొందిన ఆడది—పాదదాసిగా ఊడిగమైనా చేయవచ్చునంటోంది. అలాంటి భర్తవుంటే పురాణంలోని పతివ్రతలకంటె పెద్ద త్యాగాలు చేయవచ్చునంది.

రఘులోని పురుషుడు నెమ్మదిగా అతడి మెదడును స్వాధీనం చేసుకుంటున్నాడు. అపురూప లావణ్యరాశి ఎదురుగా ఉంది. కోరి పిలుస్తోందామె. తను దైవస్వరూపుడు. ఆడవాళ్ళంతా తన బానిసలు. అలాంటి బానిసల్లో శారద ఒకతె! తనామెను గదమాయించడానికి బదులు ఆమె అదుపులోకి వెడుతున్నాడు.

కానీ.... శారద మనసు ఎప్పుడూ తనను వెన్నంటే ఉంటుంది.

అప్పుడా యువతి పైట జారింది. అతడి చూపులు నిరంగా ఆమె గుండెలపై నిలిచాయి. క్రమంగా ఆ చూపుల్ని ఆమె చూపులతో కలిపాడు. అప్పుడామె నవ్వింది.

ఆ నవ్వు పరిమళ నవ్వుకిలాగుంది. దానికి తట్టుకోవటం కష్టం. రఘు ఒక్కడుగు ముందుకువేశాడు. ఆమె వెను కడుగువేసింది. తర్వాత వెనక్కి తిరిగింది. కంగారులో చీర అక్కడి సోఫాకు తగులుకుంది. ఆమె అలాగే ముందుకు వెళ్ళిపోయింది.

చక్కటి అంగసౌష్టవమామెది. పల్చటి లంగా.... ఎత్తయిన గుండెలు.

రఘు ఆమెకోసం పరుగెత్తాడు.

ఆమె అతడికి అందకుండా పక్కకు నెడుతూ— "ఒక్క క్షణం అలా కూర్చోండి—నైట్ డ్రస్సులో వస్తాను. ఆపిల్ పళ్ళు తిందాం—" అంది.

ఒకప్పుడైతే అతడామెను వదిలి ఉండేవాడు కాదు. క్షణంసేపు ఆతను నిగ్రహించుకుని సోఫాలో కూర్చున్నాడు. సోఫాముందున్న టీపాయ్‌మీద ఆపిల్ పళ్ళు ఉన్నాయి.

అతను ఆపిల్ పళ్ళవంకే చూస్తున్నాడు. అతడి బుర్ర గజిబిజిగావుంది.

"ఏ పనైనా ఫ్రూట్స్‌తో ప్రారంభించాలంటారు మా డాడీ—" అందామె.

రఘు తలెత్తి చూశాడు. ఆమె నైట్ డ్రెస్సులో వచ్చింది. ఒకనాటి భారతీయుల ప్రతిభావ్యుత్తులను మించిన పనితనం నేటి యంత్రాలకున్నది. ఆమె వంటిమీద ఇప్పుడు నైట్ గౌన్ వున్నది, ఇందాకటిలంగా, జాకెట్లు లేవు. అద్దాల షో కేసులో నిలబడ్డ నగ్న సుందరిలా ఉన్నదామె నైట్ గౌన్‌లో. ఆమె శరీరంలో ఇప్పుడు కనపడని భాగంలేదు.

కళ్ళప్పగించి ఆమెను చూస్తున్నాడు రఘు. అజంతా శిల్పం తనముందు నిలబడిందా అన్న అనుభూతి కలిగిందతడికి. ఎంత అదృష్టవంతుడు తను? ఆ సుందరి తనను కోరుతోంది?

అప్పుడు ఆమె చేయి ముందుకు పెట్టింది. ఆమెచేతిలో కత్తి ఉంది—"పళ్ళు కోయడానికి!" అంది.

స్టెయిన్‌లెస్ స్టీలు కత్తి తళతళ మెరిసింది.

అప్పుడే రఘు బుర్రలో ఏదో తళుక్కుమంది.

ఆ కత్తి పట్టుకుని తన ఎదురుగా నిలబడిన వ్యక్తి శారదలా కనబడిందతనికి. అప్రయత్నంగా అతడికి శారదకు తను కొని ఇచ్చిన బాకు గుర్తొచ్చింది. తను తప్పుచేస్తే ఆ బాకుతో శారద తనను పొడవాలని శాసించాడు. లేని పక్షంలో తనే పొడుచుకు చచ్చిపోతానన్నాడు.

కానీ—తనిప్పుడేం చేస్తున్నాడు?

అందుకే శారద—తన పని చేయడానికి వచ్చిందా?

రఘు చటుక్కున లేచి నిలబడి వెనక్కు తిరిగాడు. ఆమె పిలుస్తున్నా వినిపించుకోకుండా గదిలోంచి బైట పడ్డాడు.

## 11

"ఇటీజ్ ఫంటాస్టిక్ స్వరూప్!" అందామె.

"ఏమయింది వాణీ—" అనడిగాడు స్వరూప్.

"జీవితంలో ఇలాంటి పురుషుణ్ని ఎక్కడా చూడ లేదు. ఇట్స్ ఇన్‌క్రెడిబుల్—అతడు ఆ రఘు మనిషి కాదు. దేవుడు. లేకపోతే నేను చేసిన చేష్టలకు నిగ్రహించుకోవడం అసాధ్యం!" అంది వాణి.

"ఏమయింది?" అన్నాడు స్వరూప్.

"నిజానికి నేను సిగ్గుపడుతున్నాను. అతడికి మళ్ళీ ముఖం చూపించలేను. భార్యను తప్ప పరాయి ఆడదాన్ని తను కన్నెత్తి చూడడు—" అంటూ వాణి జరిగింది చెప్పింది.

స్వరూప్ నిరుత్సాహంగా—"శారద ప్రేమ చాలా గొప్పది—ఆమె ప్రేమ కాముకుణ్ని ఏకపత్నీవ్రతుడిగా మార్చింది. నా ప్రేమ సారహీనం. శారదవంటి అపురూప వ్యక్తికి కూడా నాపై కరుణ కలగలేదు. ఆమె ప్రేమ బలం కారణంగానే నేనామె విషయంలో చేసిన ప్రయత్నాలన్నీ వమ్మయిపోయాయి—" అన్నాడు.

స్వరూప్ నిరుత్సాహానికి అర్థముంది. రఘు స్త్రీలోలత నాధారంగా చేసుకుని అతను యెందరో స్త్రీలను అతడిమీద కుసిగొల్పాడు. ఆ విషయం శారదకు తెలిసే విధంగా ఎలక్ట్రానిక్ వ్యూహాన్ని రూపొందించాడు. దాని ఫలితంగా శారదకు రఘుపైన విరక్తి కలుగుతుందనే

ఆశించాడు కానీ—రఘులో క్రమంగా మార్పువస్తుందని యెన్నడూ ఊహించ లేదు.

ఇప్పుడు ఆఖరిసారిగా వాణిని ప్రయోగించాడు.

భార్యకు దూరంగా టూర్లో ఉంటూ కూడా, పరాయి స్త్రీ అర్ధనగ్నంగా సమీపించి చనువిచ్చినా కూడా నిరాకరించే స్థాయికి రఘు ఎదిగిపోయాడు.

ఈ విజయం తన ఎలక్ట్రానిక్ వృక్షానిదా? శారద ప్రేమ బలానిదా?

శారద ఇంక తనకు శాశ్వతంగా దక్కదు. తన ప్రేమ ఉదాత్తమైనదే అయితే ఈ విషయం శారదకు చెప్పాలి. ఆమెకు సంతోషం కలిగించాలి. తక్షణం తను శారదను కలుసుకోవాలి .... స్వరూప్ వాణికి ధన్య వాదాలు చెప్పుకుని అప్పటికప్పుడు శారద యింటికి వెళ్ళాడు.

## 12

"నీకో గొప్ప శుభవార్త!" అన్నాడు స్వరూప్, శారదను చూస్తూనే.

"ఏమిటది?"

"నీ భర్తను నేను పరీక్షించాను. అతను పూర్తిగా మారిపోయాడు—" అంటూ స్వరూప్ ఆమెకు జరిగిన దంతా చెప్పాడు.

శారద ఆశ్చర్యంగా—"నిజమని నమ్మమంటావా?" అంది.

"నీమీద ఒట్టు—" అన్నాడు స్వరూప్.

"ఓహ్ స్వరూప్—యిప్పుడు నాకెంత సంతోషంగా వుందో ఎలా చెప్పేది?" అంది శారద ఉత్సాహంగా.

ఆమె ఉత్సాహాన్ని గమనిస్తూ—"రఘు యెంత

అదృష్టవంతుడు?" అనుకుని నిట్టూర్చాడు స్వరూప్.

"రఘు ఇప్పుడేం చేస్తున్నాడో?" అంటూ పూజ గదిలోకి పరుగెత్తింది శారద. ఆమె వెనకనే స్వరూప్ కూడా వెళ్ళాడు.

ఇద్దరూ ఎలక్ట్రానిక్ వింత వృక్షంముందు నిలబడ్డారు. శారద దానివంకే చూస్తూ—"స్వరూప్! ఇది కదలడం లేదేమిటి? పాడయిందా?" అంటూ వెనక్కు వంగి రికార్డరులోని కాగితం తీసింది.

DEAD 3.30 P.M.అని ఉందా కాగితంమీద.

కెవ్వుమని అరిచింది శారద. స్వరూప్ కూడా ఆ చీటీ చదివి ప్రాణపడిపోయాడు.

"ఇది నిజమా, నమ్మనుంటావా?" అంది శారద అతి కష్టంమీద గొంతు పెగిల్చి.

"నమ్మాలని లేదు నాకు. కానీ యంత్రం అబద్ధమాడదు—" అన్నాడు స్వరూప్. అతడి ఆలోచనల స్వరూపం మళ్ళీ మారుతోంది.

శారదను తను ప్రేమించాడు. కానీ రఘు ఆ ప్రేమకు అడ్డం వచ్చాడు. యిప్పుడా అడ్డు తొలగిపోయింది. శారద ప్రేమకంటె తన ప్రేమ బలమైనది. అందుకే రఘు మరణించి కథను కొత్తమలుపు తిప్పింది.

"అసలేం జరిగి ఉంటుందంటావ్?"

"అతనిలోని మార్పు ఇష్టంలేక ఎవరైనా హత్యచేసి ఉండొచ్చు...." అన్నాడు స్వరూప్.

"లేదు—స్వరూప్! గబ్బిలం వెలుతురు భరించలేదు. దోమలు పరిశుభ్రమైన వాతావరణంలో మనలేవు. రఘు అలాంటివాడే! అతడికి కొన్ని చెడుబుద్ధులున్నాయి. అవే అతడికి ఊపిరిపోసి బ్రతికిస్తున్నాయి. నేనతణ్ని

సంస్కరించాలనుకున్నాను. అతడిలో మానసిక సంఘర్షణ లేపాను. ఫలితంగా అతడు మారాడు. అయితే తనువు, మనసు కూడా ఆ మార్పును తట్టుకోలేక పోయాయి. అదే చావుకు దారితీసింది. నిజంగా నేనాయన్ను ప్రేమించివుంటే ఆయన్ను మార్చాలని అనుకోకుండా ఉండవలసింది. నా స్వార్థమే ఆయన ప్రాణాలుతీసింది-" అంటూ కూలబడి ఏడ్వసాగిందామె.

ఉన్నట్టుండి స్వరూప్ కు ఏదో గుర్తొచ్చింది — "అవును ఆయన ముప్పైరోజులు టూర్ గదా—నువ్వు ఆయనకు ఒక్కసారిగా ముప్పై చుక్కలు X—Y 8 ఫ్లూరైడ్ ఇచ్చావా?" అన్నాడు.

ఊఁ అన్నట్లు తలూపిందామె.

"నీకు చెప్పడం మర్చిపోయాను. ఒకే ఒక్కసారి ఇంపై చుక్కలకు మించి X—Y 3 ఫ్లూరైడ్ యివ్వకూడదు. ఇస్తే ప్రమాదం వుంది. రియాక్షన్ వచ్చి ఒకోసారి ప్రాణాలు తీయొచ్చు. రియాక్షన్ ఇరవై చుక్కలూ అయిపోయిన మూడోరోజున ప్రారంభం కావచ్చు...." అన్నాడు స్వరూప్.

"మరి ఈ సంగతి నాకు ముందే ఎందుకు చెప్పలేదు?" అంది శారద.

"మరిచిపోయాను...." అన్నాడు స్వరూప్.

"మరిచిపోవడంకాదు. కావాలనే చేశావు. ఇప్పుడు నీ దుష్టబుద్ధి అర్థమవుతోంది నాకు...." అంది శారద. "అయినా నిన్నని ఏం లాభం—భర్తను అదుపులో పెట్టాలనుకుని—ఆయన్ను పూర్తిగా నావాణ్ని చేసుకోవాలని ఇప్పుడు ఎవరికీకాకుండా చేసేశాను. నాకు బాగా బుద్ధి చెప్పావు—...."

స్వరూప్ వంచిన తల ఎత్తలేదు. కానీ—"అతను చావాలని అనుకున్నాను కానీ, అతన్ని చంపాలని అనుకోలేదు. X—Y 3 ఫ్లూరైడ్ ద్రవం ఆరోగ్యవంతులపై రియాక్షన్ చూపడానికి అవకాశాలు చాలా స్వల్పం. అయితే క్లిష్టమైన మానసిక సంఘర్షణ అనుభవించేవారికి ఎక్కువ డోసు యిచ్చినపుడు రియాక్షన్ ఉండవచ్చు. నేను నీకోసం వాణిని అతడిపై ఉసిగొల్పితే—అది అతడిలో కలిగించిన మానసిక సంఘర్షణ ఇంతా అంతా కాదనుకుంటాను. అదే అతడి ప్రాణాలు తీసింది. ఇది పూర్తిగా నా తప్పు—" అని నెమ్మదిగా అన్నాడు.

స్వరూప్ కి నిజంగా చాలా బాధగావుంది. తనకు తెలియకుండా తను రఘుని హత్యచేశాడు. ఈ హత్య తనను జీవితాంతమూ వెంటాడుతుంది.

తను ఇంక శారద ముఖం ఎలా చూస్తాడు?

స్వరూప్ సమస్య చాలా సులభంగా తేలిపోయింది. రఘు తనకిచ్చిన బాకుతో ఆమె ఆత్మహత్య చేసుకుని మరో లోకంలోని రఘుని వెతుక్కుంటూ వెళ్ళిపోయిన వార్త మర్నాడే చేరింది.

—:ఐపోయింది:—

# నేరాలను కనిపెట్టే యంత్రం!

## ఎమ్.వి.వి. సత్యనారాయణ

ఆలోచనలతో నా మెదడు వేడెక్కిపోతోంది.

డబ్బు సంపాదన నా తలలో తిష్ట వేసు కూర్చుంది. ఏ వ్యాపారమూ నాకు అచ్చిరాలేదు. ఉద్యోగ ప్రయత్నం చేద్దామంటే నాకు చదువు అబ్బలేదు. మాస్తూ చూస్తూ నౌఖరు వుద్యోగానికి వెళ్ళలేను. మా నాన్న నాకు ఇచ్చిపోయిన నాలుగు వేల రూపాయలతో ఏంచేయాలన్నా కుదిరి చావడంలేదు.

అందుకే ఒక పెద్దమనిషి సహకారంతో పిస్తోలు కొనుక్కొగలిగాను. పేపర్లో ప్రకటనవేశాను. స్థానిక పోస్టాఫీసులో బాక్స్ నెంబర్ అద్దెకు తీసుకున్నాను.

"హత్యలు జరగాలా? సంప్రదించండి!

పోస్టు బాక్సు నెంబర్ 316,

తిమ్మాపురం."

నా ప్రకటన దినపత్రికలలో స్పష్టంగానే వచ్చింది. అయితే తెలుగు పాఠకులమీద నా ప్రయోగం సరి

కొత్తది. వాళ్ళకు ఒకపట్టాన కొరుకుడు పడివుండదు.

ఉదయాన్నే లేవడం ఎంత సహజమో, రోజూ నేను పోస్టాఫీసుకు వెళ్ళి నా బాక్స్ తెరచి చూసుకోవడం కూడా అంత సహజమైపోయింది.

పదిహేను రోజులు కనుకుంటాను. నా బాక్స్ పలికింది. నా బాక్స్‌లో తెల్లటి కవర్ ఒకటి ముప్పయిఅయిదు పైసల స్టాంపు అతికించి పడవేసివుంది. ఆ కవరే నా ప్రయత్నాలకు ఊపిరిపోసింది. ఆత్రుతగా కవర్ తెరచి చూశాను. కవరులో తెల్లకాగితం వుంది. ఆ కాగితం మీద మూడేమూడు వాక్యాలు!

"ఎవరిని హత్య చేస్తారు? ఎలా చేస్తారు? కేవలం హాబీగానా? పారితోషికం కావాలా? మీ ఉద్దేశ్యం ఒక కవర్‌లోరాసి రైల్వేస్టేషన్ ముందున్న పోస్టుబాక్సు స్టాండ్ కింద పెట్టండి. రేపు ఉదయం 11 గంటలకు!

—ఆకాశరామన్న."

నవ్వుకున్నాను. నేనే పిరికి సన్నాసి ననుకున్నాను. నాకంటె పిరికివాళ్ళు ఈ ప్రపంచంలో వున్నారన్న మాట!

అంతలోనే నాకు మరో విషయం గుర్తు వచ్చింది. హత్యల సందర్భం వచ్చినప్పుడు ఎంతటి ధైర్యశాలి అయినా గప్‌చిప్‌గా వుండిపోతాడు. హిచ్‌కాక్ చిత్రాలలో భయంకర హంతకులనూ శవాలనూ చూడగలడు కాని నిజ జీవితంలో ఒక్క శవాన్ని కూడా చూడలేడు.

ఆలోచనలు కట్టిపెట్టి జవాబు రాయసాగాను.

"ఆకాశరామన్నగారూ!

హాబీకోసం హత్యలుచేయను. పారితోషికం కావాలి.

ఒక్కొక్క హత్యకూ పదివేలు కావాలి. హత్యకాబోయే వాళ్ళ అడ్రసు, హత్యలు జరగవలసిన స్థలం, చెక్కుతో సంప్రదించండి. హత్యజరిగాకనే చెక్కును కాష్ చేస్తాను. చెక్కు కాంష్ కాకపోతే మీ ఉత్తరం, చెక్కు పోలీసులకు అందుతాయి.

—పోస్టుబాక్ 316."

ఉత్తరం మడిచి కవరులోపెట్టి అతికించాను. టాక్సీని పిలిచాను. యెక్కి కూర్చున్నాను. వాచీ చూసుకున్నాను. పదకొండు కావటానికి యింకా పావుగంట సమయం వుంది.

టాక్సీ స్టేషన్ముందు ఆగింది. రైళ్ళు వచ్చేపోయే సమయంకాదు. నిర్జనంగా వుంది. ఒక బిచ్చగాడు కాబోలు స్పృహలేకుండా నిద్రపోతున్నాడు.

టాక్సీని పంపేశాను. ఉత్తరాన్ని పోస్టుబాక్స్క్రింద పెట్టాను. ఆకాశరామన్న చాటునుండి నన్ను గమనిస్తూనే ఉండివుంటాడు. నేను వెలుగులోకి రావడంవలన నష్టం లేదు. నేరం జరిగినట్టు ఆకాశరామన్న నన్ను పట్టించబోతే మొదట నష్టపోయేది ఎక్కువగా అతడే!

నాకేం? నేను తెగించు కూర్చున్నాను.

చకచకా నడిచివెళ్ళి న్యూకోలనీకి మలుపు తిరిగాను.

ఆ సాయంకాలమే నా బాక్స్లో మరో ఉత్తరం వుంది. ఉత్తరంతోబాటు పదివేలకు చెక్కుంది. చెక్కును చూడగానే నాకు కళ్ళు తిరిగాయి. అవి అన్నీ రూపాయలా? పైసలా? రూ 10,000/—అనేవుంది. పేరు రాయవలసినచోట ఖాళీగా వుంది.

ఉత్తరం చదవసాగాను.

"మీరు హత్యచేయవలసింది లక్ష్మీపతిని. రైల్వే

స్టేషన్ ప్రాంతాల్లోనే. రేపు గోదావరి ఎక్స్‌ప్రెస్సులో దిగుతాడు. ఎ.పి.ఎస్ 9505 అంబాసిడర్‌లో స్టేషన్ ఆవరణలోంచి బయటికి వస్తాడు.

—శ్రీపతి (ఆకాశరామన్న.)"

నా మనసు ఆనందంతో వురకలు వేస్తోంది. నా ఆలోచనలు ఆచరణలోకి వస్తున్నాయి. పని జరగకుండానే పదివేలు నా పరమాయాయి. నా చేతిలో మొదటి హత్య జరగవలసిన సమయం రేపు వుదయం 5-30 కీ 5-40 కీ మధ్య. గోదావరి ఈ మధ్య ఖచ్చితంగానే వస్తోంది.

లక్ష్మీపతి!

మనిషి యెవరో తెలియదు—అతడి చావు తన చేతిలో వుంది. చిత్రం! లక్ష్మీపతి ఎక్కడ వుంటాడో, ఎక్కడ పెరుగుతున్నాడో కాని అతడి చావు తనకు పదివేలు ముట్టచెబుతోంది. లక్ష్మీపతి ఎవరైతే నాకేం? శ్రీపతికి అతడి చావు వలన పదిలక్షలు కలిసిరావచ్చును. కలవనియ్యి. తనకేం?

ఆలోచనలు కట్టిపెట్టి యింటికి వెళ్ళాను. తాళం తెరచి నా గదిలోకి ప్రవేశించాను. నా యిల్లు ఒంటరిగా బోసిపోతోంది. నాకో తోడు కావాలి. నా ఆలోచనలూ ప్రవృత్తులూ ఆమెకు నచ్చాలి. ఆమెది నాకు లాగా నేర ప్రవృత్తి కారాదు. నేర, ప్రవృత్తితో అలసిపోయిన నన్ను సేదదీర్చాలి! నా పాపిష్టి సొమ్మును ఆమె సార్ధకంగా కాక నా కోసం సమర్ధవంతంగా ఖర్చుపెట్టాలి.

## 2

రైల్వేస్టేషన్ పెళ్ళివారి యిల్లులాగా వుంది. భారతదేశ జనాభాకి ప్రతీకలుగా అనేక భాషలవాళ్ళు కలకల

లాడుతూ తిరుగుతున్నారు. వాచీలో సమయం ఉదయం అయిదూ ముప్ఫయి చూపుతోంది.

గోదావరి ఎక్స్‌ప్రెస్ అయిదు నిమిషాల్లో వస్తోందిట.

జేబులోని పిస్తోలును తడుముకున్నాడు. ఆరు బుల్లెట్లు లోడ్ చేసి వుండటంతో పిస్తోలు బరువుగా వుంది. దూరంగా ఎక్స్‌ప్రెస్ వస్తోన్న శబ్దమయింది. నేను చకచక బయటకు నడిచాను.

నా కారు స్టేషన్ వెలుపల చెట్టు క్రింద ఆపి వుంచాను. అద్దెకు తెచ్చినకారు అది! కారు యెక్కి కూర్చున్నాను.

పార్కింగ్ ప్లేస్‌లో నాకు కావలసిన అంబాసిడర్ కారు వుంది. ఆ కారును చూస్తోంటే జాలివేస్తోంది. కొన్ని నిముషాలలో ఆ కారు ఒక శవాన్ని భరించవలసి వస్తుంది.

అన్నట్టు కారు తెచ్చి అక్కడ పెట్టిన డ్రయివర్ యెవరో....యెవరయితే తనకేం? తాను లక్ష్మీపతిని చంపకుండా డ్రయివర్ ఆపలేడు. ఆ కారు తెచ్చి పెట్టింది శ్రీపతి మాత్రం కాదు. లక్ష్మీపతి చావువలన శ్రీపతికి లాభం వుంది. అందువలన లక్ష్మీపతి హత్యజరిగితే చేయవలసిన మోటివ్ శ్రీపతికే వుంది. శ్రీపతి ప్రస్తుతం బలిష్ఠమైన ఎలిబీలో వుంటాడు.

హంతకుడు యెవరయిందీ రుజువుకాదు.

నేను తెరవెనకే వుంటాను. శ్రీపతీ అంతే! తేలు కుట్టిన దొంగ!

ప్లాట్‌ఫాంమీదకు గోదావరి వచ్చి ఆగినట్టుంది.

ఎ.పి.యస్ 9605 అంబాసిడర్ మీదనే దృష్టి నిలిపాను. ప్రయాణికులు వస్తున్నారు. అటూయిటూ

పరుగులు తీస్తున్నారు.

లావుపాటి వ్యక్తి అంబాసిడర్ కారును సమీపించాడు. అతడి వెనుక అందమైన యువతి వస్తోంది. ఆమె చేతిలో వి.ఐ.పి. సూట్ కేసు వుంది. లావుపాటి వ్యక్తి కారును సమీపించాడు. ఆమె అటునుండి సూట్ కేస్‌ను వెనుక డోర్‌లోంచి కారులోవుంచి ముందు డోర్‌లోంచి కారు ఎక్కి కూర్చుంది.

అతడి వీపు నాకు తిన్నగావుంది.

నేను చటుక్కున పిస్తోలుతీశాను. రెండో జేబులోంచి సైలెన్సర్ తీసి పిస్తోలుకు అమర్చాను. నన్ను యెవరూ గమనించడంలేదు. అంబాసిడర్ కారు నాకు ముప్ఫయి అడుగుల దూరంలో వుంది.

అతడు ముందుకు వంగి డోర్ తెరవబోతున్నాడు.

క్లచ్ తొక్కి కారును స్టార్టుచేశాను. ఇంజన్ రొద పెడుతోంది. సైలెన్సర్‌లోంచి వచ్చే కొద్దిపాటి శబ్దమూ ఇంజన్ శబ్దం మింగుతోంది. చుట్టూచూచి పిస్తోలును గురిపెట్టాను. అతడు డోర్ తెరచి లోపలకు అడుగుపెట్ట బోతున్నాడు.

'లక్ష్మీపతీ!' గొణిగాను. సేఫ్టీకాచ్ తప్పించాను.

కన్నుమూసి రేంజ్ చూసుకున్నాను. ట్రిగ్గర్ నొక్కాను. 'సర్'మని చిన్న శబ్దం!

లక్ష్మీపతి దెబ్బతిన్న కుందేలుపిల్లలాగా కారులోకి దబ్బున పడ్డాడు. వీపుమీద రక్తం చిమ్ముతోండగా నా కారు వేగంగా కదిలింది. కారులోని అందమైన యువతి కళ్ళు తెరచుకుని ఆశ్చర్యంగా చూస్తోన్నాయి.

నా కారు న్యూకోలనికి మరలింది.

# 3

శాంత కెవ్వున అరుస్తోంది. ఆమెకు మొహమంతా చెమటలుపట్టి ధారలుగా కారుతోన్నాయి. తండ్రికి ఏం జరిగిందో, ఆయన కారులోకి యెలా తుళ్ళిపడ్డాడో ఆమెకు తెలియడంలేదు. తండ్రి వీపులోంచి రక్తం కారుతోంది. రెండు కొళాయి గొట్టాలు తెగినట్లు రక్తం రెండు ధారలుగా కారుతోంది.

"నాన్నా!" ఏడుస్తోంది శాంత.

లక్ష్మీపతిలో కదలిక లేదు.

అంబాసిడర్ కారుచుట్టూ జనం మూగుతున్నారు. వాళ్ళలో హాహాకారాలు చెలరేగుతున్నాయి.

"ఏమయింది?"

"అరరె! రక్తం, దారి యివ్వండి!"

"ఇంక దారి ఏమిటి?"

"ఏం?"

"పిస్తోలుతో కాల్చినట్టున్నారు."

"ప్రాణాలు పోయినట్టేనా?"

"సందేహంలేదు."

"అయితే పోలీసులకు చెప్పండి....ఆడకూతురు...."

ఎవరో ఫోన్ చేసినట్టున్నారు.

పోలీసులు వచ్చేసరికి శాంత స్పృహలేకుండా సీటు మీద పడిపోయివుంది. లక్ష్మీపతి శవం సీటుకీ డాష్‌బోర్డుకీ మధ్యలో పడివుంది.

పోలీసులు శవాన్ని అంబులెన్స్‌లోకి ఎక్కించారు.

ఆసుపత్రిలో శాంత స్పృహలోకి వచ్చింది.

పోలీసులు శవాన్ని మార్చురీలో ఒప్పగించారు. క్రైంబ్రాంచికి తరలింది కేసు. క్రైంబ్రాంచ్ ఇన్స

పెక్టర్ శాంతను వెంటపెట్టుకుని ఆమె యింటికి వెళ్ళాడు.

శ్రీపతి అప్పటికి ఇంకా నిద్రమంచంమీదే వున్నాడు.

ఇన్స్పెక్టర్ అతడిని నిద్రలేపాడు. శాంత అర చేతులలో మొహం కప్పుకుని కూర్చుంది.

"శాంత తండ్రి లక్ష్మీపతి మీకు ఏమవుతారు?" అడిగాడు ఇన్స్పెక్టర్.

"ఎందుకు సార్? నాకు అన్నయ్య అయినా తండ్రి అయినా ఆయన వొక్కడే!" అన్నాడు శ్రీపతి.

"మీ అన్నయ్యగారికి శాంత వొక్కతే కూతురు. అవునా?"

"అవును సార్! ఈ ప్రశ్నలన్నీ యెందుకు అడుగుతున్నారు?"

"మీ అన్నయ్యను యెవరో తుపాకీతో కాల్చి చంపారు?"

శ్రీపతి దిగ్గున లేచాడు.

"మీరనేది నిజమా?"

"అవును."

"శాంతా!" శ్రీపతి చటుక్కున శాంతవైపు కదిలాడు. ఆమెను పొదివి పట్టుకున్నాడు.

శాంత బోరున ఏడుస్తోంది.

"మీ అన్నగారిని చంపవలసిన అవసరం ఎవరికి వుంది?"

"ఆయన మంచివాడు! యెవరికీ అపకారం చేసే వ్యక్తి కాదు."

"ఆయన చనిపోతే ఆయన ఆస్తి కూడా మీకే వొస్తుందా?"

"ప్లీజ్!....ఇప్పుడు ఆస్తుల ప్రసక్తి...."

"ఆస్తికోసమే ఆయన హత్యచేయబడ్డారు?"

"అంటే... మీ వుద్దేశ్యంలో...."

"అవును. మొదటి అనుమానితులు మీరే!"

"ఇన్స్పెక్టర్ గారూ! ప్లీజ్. ఆయన చనిపోతే నాకు సగం శాంతకి సగం ఆస్తి వొస్తుంది."

"అలా యెందుకు రాశారు?"

"నాకు తెలియదు సార్!"

"సగం ఆస్తి అంటే ఏ మాత్రం వొస్తుంది?"

"ఐదు లక్షలు!"

"ప్రాణాలు తీయడానికి పది పైసలు చాలు!"

"ఇన్స్పెక్టర్ గారూ! మీరు హద్దుమీరి మాట్లాడుతున్నారు."

"ఎలాగో చెబుతారా?"

"మా అన్నయ్యను ముష్టి ఐదులక్షలకోసం చంపుతానంటారా? మా ఆవిడ తరఫున నాకు బాగానే ఆస్తి కలసివచ్చింది."

"కావచ్చు. ఐదులక్షలు చేదుకాదు."

"ఇన్స్పెక్టర్ గారూ! నేను లీగల్ గా ప్రొసీడ్ కావలసి వుంటుంది!"

"ఉదయంనుండీ మీరు బెడ్ మీదే వున్నారా?"

• "అవును!"

"మీ అన్నయ్యను రిసీవ్ చేసుకోవడానికి మీరు ఎందుకు వెళ్ళలేదు?"

"ఆ విషయం శాంత నే అడగండి!"

ఇన్స్పెక్టర్ శాంతవైపు తిరిగాడు.

"రాత్రి చిన్నాన్న ఆలస్యంగా వచ్చారు. నేనే ఆయన అలసట చూచి నాన్నగారిని రిసీవ్ చేసుకోవడానికి నేను వెళ్తానన్నాను."

ఇన్స్పెక్టర్ లేచాడు.

"శ్రీపతిగారూ! మాకు తెలియకుండా మీరు తిమ్మాపురం విడిచిపెట్టడానికిలేదు. ఈ కేసులో మొదటి అనుమానితులు మీరే!"

శ్రీపతి వెటకారంగా చూశాడు.

"నాకు ఎంతబలమైన మోటివ్ వుందో శాంతకీ అంత బలమైన మోటివ్ వుంది!"

శాంత చిన్నాన్నను విడ్డూరంగా చూచింది.

"ఎలా?" అడిగాడు ఇన్స్పెక్టర్.

"ఆమెకీ ఐదు లక్షలు చేరుతాదు!"

"చిన్నాన్నా!" శాంత గొంతు జీరబోయింది.

"శాంతా!" శ్రీపతి ఆమె తల నిమిరాడు. అతడి గొంతు వణుకుతోంది. కళ్ళలో నీళ్ళు కమ్మాయి.

"మీ శ్రీమతిగారు లేరా?"

"పురిటికి పుట్టింటికి వెళ్ళింది."

"లేట్ ప్రెగ్నెన్సీ...."

"ఎస్...."

ఇన్స్పెక్టర్ వద్ద సెలవు పుచ్చుకున్నాడు.

"చిన్నాన్నా! నాన్నను నేను చంపుతానా?" శాంత గొల్లుమంది.

శ్రీపతి ఆమె తల నిమిరాడు.

"వొట్టిదే తల్లీ! మాటమీద మాటవచ్చి అన్నాను! అన్నయ్య దేవుడు. అటువంటివాడిని ఎవడు పొట్టన పెట్టుకున్నాడో...."

"మార్చురీలో వుంది నాన్న శవం!"

"అవును మర్చిపోయాను. పద!" శ్రీపతి హడావుడిగా లేచాడు.

# 4

సిటీ బస్సు దిగాను. రోడ్డు దాటాను. సూపర్ బజార్‌లో ప్రవేశించాను. భవనం రద్దీగా వుంది.

శ్రీపతి పంపించిన చెక్కు నా అక్కౌంటులో పడింది. పదివేల రొక్కం నాకు అంతులేని శక్తి నిస్తోంది.

మరో ఆఫర్ వస్తుంది. నాకు నమ్మికవుంది. లక్ష్మీపతి హత్య కేసు ఫైలు మూతపడిపోయింది. శ్రీపతిని పోలీసులు వెంటాడి క్లీన్ సర్టిఫికేటు యిచ్చుకున్నారు. లక్ష్మీపతిని .38 కాలిబర్ పిస్తోలుతో కాల్చి చంపినట్టు పోస్టుమార్టంలో తెలిసింది. 38 కాలిబర్ పిస్తోళ్ళు వున్నవారిని వెంటాడారు పోలీసులు.

ప్రయోజనం శూన్యం!

ఉలిక్కిపడ్డాను. నన్ను యెవరో ఢీకొట్టారు. మెత్తటి శరీరం. ఆలోచనలకు ఫుల్‌స్టాప్ పెట్టి తలెత్తి చూశాను.

అందమైన కళ్ళు నన్ను పలకరించాయి. ఆమె ఎర్రటి పెదిమలు తడిగా మెరుస్తున్నాయి. కత్తిరించిన జుత్తు ఆమె భుజాలమీద పడుతోంది. అందమైన చీరకట్టూ మాచింగ్ బ్లవుజూ ఎత్తు మడమల జోడూ, మెడలో వొంటిపేట ముత్యాల హారమూ.... నా యెదుట అపరంజి బొమ్మ నిలబడింది.

"సారీ...." అందామె కోకిల కంఠం.

"మీరు తప్పుచేసినా నేను తప్పుచేసినా నేనే అంటే మగవాడిని క్షమాపణ కోరడం లోక ధర్మం!" నాకు నాలుక తడబడుతోంది. లేకపోతే చాంతాడు సంభాషణ ఎందుకు?

ఆమె నవ్వింది. పండు వెన్నెల విరిసినట్టయింది.

"ఒక్కరే వచ్చారా?" అడిగాను.

"ఈ ప్రపంచంమీద నేనూ ఒకత్తినే!"

"అదేం....మీ వాళ్ళు...."

"ఎవరూ లేరు. కొద్దిపాటి డబ్బు బాంకులో వుంది."

"నివాసం?"

"వర్కింగ్ వుమన్స్ హాస్టల్‌లో మా ఫ్రెండ్‌తో బాటు వున్నాను."

"............"

"మీరు?"

"ఒంటరిగాడినే. కొద్దిపాటి తెలివి తేటలతో నడుపుకో గలిగే బిజినెస్సు వుంది!"

"ఏం బిజినెస్?"

"మీ వయసు అడిగానా?"

"లేదు, అయినా చెప్పమంటే చెబుతాను!"

"వద్దు, మీ వయసూ, నా బిజినెస్సూ రహస్యంగా వుంచుకుందాం!"

"మనం కలసి వుండేటట్టు మాట్లాడుతున్నారే?"

"మీకు అంగీకారమయితే కలిసి వుండవచ్చును."

ఆమె మొహంలో గులాబీపూలు పూశాయి.

ఇద్దరమూ బయటికి నడిచాం.

నాకు తలలో ఆలోచనలు రేకెత్తాయి.

ఈమెకు నిజంగానే వెనక ముందూ ఎవరూ లేరా! లేకపోతే నా గుర్తులు తెలిసి శ్రీపతి పంపించాడా? పంపివుంటే వాడిని మట్టుపెట్టడం ఎంత సేపు?

చిత్రం! జీవితంలో ఆడది యింత త్వరగా పరిచయం కావడం సహజమా? ప్రశాంతి తన జీవితంలో సులువుగా

ఇమడగలుగుతుందా?

ప్రశాంతివైపు చూశాను.

ఆ కళ్ళను ఎక్కడో ఎప్పుడో చూశాను.

ఎక్కడో ఎప్పుడో ఏముంది?

ఈ విశాల నగర జీవితంలో సాధ్యపడటం సహజం-ఆమెను ఎక్కడయినా నేను చూచివుండవచ్చును.

ఇద్దరమూ మా యింటికి వెళ్ళాం.

నా యింటిని చూచి ప్రశాంతి మురిసిపోయింది.

"అచ్చం ఇలాంటి యింట్లోనే నేనూ—నాకో తోడూ వుంటే బాగుండును అని కలలు కనేదాన్ని!" అంది ప్రశాంతి.

నేను ఆమెను అంటిపెట్టుకుని నిలబడ్డాను.

ఆమెవద్ద సువాసన వస్తోంది.

వణుకుతో ఆమె చేతిని పట్టుకున్నాను.

ఆమె నా గుండెలమీద తలవాల్చింది.

"మనకి రిజిష్టరు పెళ్ళయ్యేవరకూ నేను మైలపడను!" అంది ప్రశాంతి.

"ఈ రోజే అప్లికేషన్ పడేస్తాను! ఒక నెలలో మనం భార్యాభర్తలవుతాం!"

ఆమె తృప్తిగా చూసింది.

నేను వంటింట్లోకి నడిచాను.

"ప్రశాంతీ! ఇంతకాలంగా నా జీవితం తాడూ బొంగరమూ లేకుండా గడిచింది. మన సంసారానికి ఏం కావాలో చెప్పు!"

ప్రశాంతి వంటింటిని పరిశీలిస్తోంది.

"నేను ఆమెను వంటింట్లో విడిచిపెట్టి నా గదిలోకి

వచ్చాను. నెంబర్ డయల్ చేశాను. టెలిఫోన్‌లో అవతలకు రింగ్ వెళ్తోంది. ఒక అర నిముషం తర్వాత అవతల రిసీవర్ ఎత్తారు.

"మాధవ్! నువ్వేనా?" అడిగాను రిసీవర్‌లో.

"అవును."

"నేను రమాకాంత్‌ని మాట్లాడుతున్నాను."

"నువ్వా? ఏమిటి విశేషాలు?"

నేను కిటికీలోంచి బయటికి చూశాను. ప్రశాంతి వంటింట్లో బూజులు దులుపుతోంది.

"నీతో పనిపడింది!"

"చెప్పు!"

"నాకు ప్రశాంతి అనే అమ్మాయి పరిచయమయింది. ఆమెను నువ్వు ఒకవారం రోజులపాటు వెంటాడాలి. వీలుంటే ఆమె గతాన్ని కలకాలి!"

"ఆమె అడ్రసు చెప్పు!"

"మా యింట్లోనే వుంటోంది."

"ఎప్పటినుండీ!"

"ఈ గంటనుండి."

"రోజుకి ఎంత యిస్తావ్?"

"ఎంత కావాలి?"

"యాభై రూపాయలు! ఖర్చులుగాక!"

"అలాగే. నువ్విచ్చే సమాచారం నాకు సంతోషం కలిగిస్తే మూడువందల రూపాయలు టిప్ యిస్తాను!"

"థాంక్స్! ఒక గంట తర్వాత డ్యూటీలో వుంటాను."

"జాగ్రత్త!" రిసీవర్ పెట్టేశాను.

# 5

టిప్ టాప్ గా తయారయింది ప్రశాంతి. ఇంటికి తాళం పెట్టింది. రోడ్డుమీదకు అడుగు పెట్టింది., చకచక నడక సాగింది. ఆసీలు మెట్లు డౌన్ దిగింది. సిటీ బస్సు స్టాపులో నిలబడింది. చూచీచూడనట్టుగా అప్ మీదకు చూసింది.

పెల్టుహాట్ పెట్టుకున్న యువకుడొకడు అప్ దిగుతున్నాడు.

ప్రశాంతికి ఆశ్చర్యంగా వుంది.

అదే పెల్టుహాట్ ను తాను ఉదయమే లేచి మూడు సార్లు చూసింది. తాను బయట వరండా వూడ్చుతుంటే అతడు ఎలక్ట్రిక్ స్తంభం క్రింద తలవొంచుకు నిలబడ్డాడు. అదే మొదటిసారి తాను ఆ ఫెల్టుహాట్ ను చూడటం! ఆ తర్వాత తాను వంట చేస్తూంటే వంటింటి కిటికీలోంచి కనిపించాడు. రోడ్డుమీద నిలబడి అటు తిరిగివున్నాడు. మూడోసారి న్యూస్ పేపర్ చదువుతూ రోడ్డుమీద కూర్చుండి కనిపించాడు.

మూడుసార్లూ అతడి ముఖం ఫెల్టుహాట్ చాటున కనిపించలేదు. ఇప్పుడూ అంతే!

తెల్ల పాంటులో నీలం స్లాక్ టక్ చేశాడు. కాళ్ళకు ఒకమాదిరి విలువైన షూ. ఫెల్టుహాట్ మాటున అతడి. కనుముక్కు తీరు మరుగున వుండిపోతోంది.

అతడు సిటీబస్సు స్టాప్ కి అంతదూరంలో నిలబడ్డాడు. చేతిలోని న్యూస్ పేపర్ తిప్పాడు.

ప్రశాంతి నుదురు చిట్లించింది. అతడు పేపర్ చదవడంలేదు. మొహం కొద్దిగా ఎత్తి చూస్తున్నాడు. ఒక కన్ను తనవైపు చూస్తోంది.

ప్రశాంతికి కంపరంగా వుంది.

అతడు తననే చూస్తోన్నాడు. ఎందుకు? అయితే ఉదయంనుండీ అతడు తన కోసమే యింటిచుట్టూ తిరుగుతున్నాడన్నమాట!

ప్రశాంతికి మెదడులో మెరుపు వెలిగింది.

రమాకాంత్ అతడిని తనమీద నియోగించాడేమో! రమాకాంత్ తనని పూర్తిగా నమ్మాడు. తనకు అలా తోచిందేమో!

సిటీబస్సు వస్తోంది.

ఫెల్టుహాట్ కీ తనకీ మధ్యలో అడ్డంగా సిటీ బస్సు ఆగింది.

జనంలోంచి ప్రశాంతి అతడిని చూస్తోంది.

అతడు సిటీ బస్సువైపు పరుగెత్తుకుంటూ వస్తున్నాడు.

ప్రశాంతి చప్పున బస్సు ముందుకు పరుగెత్తింది. ఆడవాళ్ళ గేటులో ఎక్కలేదు. బస్సుకి కొంతదూరంలో టాక్సీ వుంది. టాక్సీ ఎక్కి కూర్చుంది.

"హెడ్ పోస్టాఫీసు...." అంది.

టాక్సీ కదిలింది.

ప్రశాంతి ఓరగా చూసింది. బస్సు వెనుక గుమ్మంలో ఫెల్టుహాట్ వ్యక్తి నిలబడి కనిపించాడు.

బస్సు డైరీఫారంవైపు వెళ్తోంది.

ప్రశాంతి నిట్టూర్చింది.

అతడు డైరీఫారం దిగుతాడు. వృధాప్రయాణం! తిరిగి వస్తాడు.

టాక్సీ జెయిలు రోడ్డులో పరుగుతీస్తోంది.

ప్రశాంతి హాండ్ బాగ్ తెరిచింది. పేపర్ కటింగ్ తీసింది.

"హత్యలు జరగాలా సంప్రదించండి!

పోస్టుబాక్సు నెం. 316

తిమ్మాపురం." అని వుంది.

రమాకాంత్ యింట్లో ఈ ముక్కలు తనకు చాలా దొరికాయి. ఇంతవరకూ రమాకాంత్ బిజినెస్సు గురించి తనకు తెలియలేదు. తనకీరోజు ఉదయం చెత్తబుట్టలో ఒక తెల్లటి కవర్ కనిపించింది. ముప్పయిఅయిదు పైసల స్టాంపు అంటించిన కవర్ అది!

కవర్ మీది చిరునామా 'పోస్టుబాక్సు నెంబర్ 316, తిమ్మాపురం' అని వుంది.

అంటే కటింగులకూ వృత్తరానికీ రమాకాంతకీ సంబంధం వుండాలి. పైగా కవర్ మీది చిరునామా రాసిన రాత తనకి పరిచయమైన రాతే!

ప్రశాంతికి ఒళ్ళు గగుర్పొడిచింది. రమాకాంత్ వృత్తిరీత్యా హంతకుడు! డబ్బుకి ఆశపడి ఎంతపనయినా చేస్తాడు! తాను అతడితో కలసి సహవాసం చేస్తోంది. తల్చుకుంటే తనని చంపగలడు.

ప్రశాంతి పళ్ళు బిగించింది.

తనకి ఈ ప్రపంచంలో వున్న ఒక్క ఆధారమూ పోయింది.

ఇప్పుడు తాను భయపడటంలో అర్థంలేదు.

కటింగును హాండ్ బాగ్ లో వుంచింది.

టాక్సీ ఆగింది. ప్రశాంతి దిగింది. అద్దె చెల్లించి టాక్సీని పంపేసింది. చుట్టూ చూసింది. పోస్టాఫీసు భవనంలోకి నడిచింది. పోస్టాఫీసు రద్దీగా వుంది.

'పోస్టు బాక్సు' అని రాసివున్న విశాలమైన గదిలోకి వెళ్ళింది.

ఆ గదిలో సేఫ్టీ వాల్వులున్నాయి. నెంబర్లు చూసుకుంటూ నడిచింది.

ప్రశాంతి గుండె దడదడలాడింది.

ఈ నెంబర్ ద్వారానే రమాకాంత్ పార్టీలను సంప్రదిస్తున్నాడు. హాండ్ బాగ్ లోంచి మైనం అచ్చు తీసింది. తాళంపట్టే రంధ్రంమీద అచ్చును నొక్కింది. అచ్చును భద్రంగా తిరిగి హాండ్ బాగ్ లో వుంచింది.

ఆ గదిలోంచి బయటకు నడిచింది.

మెయిన్ గేటులోకి చూచి వులిక్కిపడింది.

రమాకాంత్ లోపలికి వస్తున్నాడు.

ప్రశాంతి ప్రక్కకు తప్పుకుంది.

రమాకాంత్ 'పోస్టు బాక్స్' అని వున్న గదిలోకి నడిచాడు. ప్రశాంతి చాటునుండి చూస్తోంది.

రమాకాంత్ వాల్వు తెరిచాడు.

అతడి మొహంలో ఉత్సాహం కనిపించింది.

ప్రశాంతి బయటకు పరుగెత్తింది.

కనిపించిన టాక్సీని పట్టుకుంది. ఇంటిముందు దిగింది.

దూరంగా చెట్టుక్రింద ఫెల్టుహాట్ వ్యక్తి నిలబడాడు.

# 6

పోస్టాఫీసులోకి నడిచాను.

పోస్టు బాక్స్ నెం. 316 ముందు ఆగాను. వాల్వ్ తెరిచాను. పొడవుపాటి కవర్ వుంది. నేను సంతోషంగా ఎగిరి గంతేశాను. మరో బేరం వచ్చింది. ఈ కవర్ లో ఏ ప్రాణంవుందో—నా చేతుల్లో ఏ ప్రాణం ఎగరనున్నదో-

కవరు తీసుకుని తాళంపెట్టి వాల్వ్ ను ఆప్యాయంగా తడిమాను. బయటికి నడిచాను. టాక్సీ ఎక్కి కూర్చున్నాను.

టాక్సీ కదిలింది.

కవర్ తెరిచాను. తెల్లకాగితంమీద అల్లిబిల్లి రాత వుంది.

"మా ముసలి అత్తయ్యను మెట్లమీదనుండి తోసి చంపాలి. ఏమాత్రం కావాలి? బీచ్‌లో చిల్డ్రన్ పార్కులో ఏనుగుల బొమ్మవద్ద వుత్తరం వుంచాలి.

—రంగారావు."

ఉత్తరం మడిచి కవర్‌లో పెట్టాను. కవరు జేబులో పెట్టుకున్నాను. టాక్సీ అవ్‌లాండ్స్‌కి మళ్ళబోతోంది.

"బీచ్‌కి పోనివ్వు" అన్నాను.

టాక్సీ బీచ్‌రోడ్లోకి మరలింది.

చిల్డ్రన్ పార్క్ దగ్గర టాక్సీ దిగాను. బాడుగ చెల్లించి పంపేశాను. చిల్డ్రన్ పార్కులోకి నడిచాను. ఏనుగుల బొమ్మలవద్ద కూర్చున్నాను.

జేబులోంచి కాగితం కలం తీశాను.

జవాబు రాయబోయాను.

నా వెనుక అలికిడయింది.

తల త్రిప్పబోయాను.

"వెనక్కి చూడక!" అంది బొంగురు గొంతు.

"రంగారావుగారూ!" అన్నాను.

"అవును ఎంత కావాలి?"

'మానవుడు ఆత్రుతపడుతున్నాడు!' నిట్టూర్చాను.

"ఎంత యివ్వగలరు?" అడిగాను.

"ఇరవై వేలు!"

"ఇరవై అయిదు వేలు! తగ్గేదిలేదు!" చీకట్లోకి రాయి విసిరాను.

"ఆల్ రైట్!" వెనుకనుండి చెక్కుముందుకు మొహం

మీదకు పెట్టాడు రంగారావు.

మౌనంగా చెక్కు అందుకున్నాను. ఖాళీగా వుంది.

"పేరు రమాకాంత్ అని రాయండి!" అన్నాను.

నా తెగింపు నాకే ఆశ్చర్యం కలిగిస్తోంది,

రంగారావు చెక్కుమీద నా పేరు రాసి, సంతకం చేసి అందించాడు.

"ఎప్పుడు?" అడిగాను

"ఇంట్లో నేనూ, మా ఆవిడ, ముసలి అత్తగారూ వుంటాం."

"మీకు పిల్లలు లేరా?" అడిగాను.

"లేరు."

"ఆస్తి కలుస్తుందా?"

"కలవదు."

"నాకు 25 వేలు యిస్తోంటే మీకు 25 లక్షలు కలవాలి అదీ నా కోర్కె!"

"ఆ విషయాలు నీ కనవసరం!"

"ఆల్ రైట్!"

"ఈరోజు నేనూ మా ఆవిడా మాట్నీకి వెళ్తాం! మా అత్తగారు మేడమీద గదిలో వుంటుంది. కళ్ళు కనిపించవు."

"క్షమించండి రంగారావుగారూ! ఆమెను చంప డానికి నాకు అభ్యంతరం లేదు కాని కారణం చెప్పండి!"

"తన కూతురును నాతో సంసారం చేయనివ్వదు. నా భార్య ఎప్పుడూ తల్లినే అంటిపెట్టుకుని వుండాలి!"

"ఐసీ....సంసార సుఖం లేదన్నమాట!"

"మా యింట్లో మేం యిద్దరమూ పరాయివాళ్ళంగా మెలగాలి. మా అత్తగారి కోరిక అది!"

"మీరు ఇరవై అయిదు వేలు యివ్వకపోయినా అటు వంటి ప్రాణిని చంపుతాను. నాకు డబ్బు అవసరం!"

"తుపాకీ వద్దు!"

"యాక్సిడెంట్ లాగానా?"

"అవును!"

"మెట్ల మీదనుండి తోసెయ్యనా?"

పార్కు వెనక పొదలలో ఎవరో కదిలిన చప్పుడు!

రంగారావు వులిక్కిపడి నా ముందుకు వచ్చాడు!

అతడికి పాతికేళ్లుంటాయి. చేతులకు వుంగరాలు. అచ్చగా దొరబాబులాగా వున్నాడు.

"మనమాటలు యెవరో విన్నట్టున్నారు" అన్నాడు రంగారావు.

నేను చటుక్కున పొదలవైపు వెళ్ళాను. నా కంటికి ఎవరూ కనిపించలేదు.

"ఈ రోజే....వస్తాను!" అన్నాడు రంగారావు.

నేను తలూపి అతడివెంట నడిచాను.

"శాండ్ పార్క్ దాటాక మూడో మేడ. యూకలిప్టస్ చెట్లు ఒకచోట ఆవరణలో వుంటుంది." చెప్పి రంగారావు అక్కడే ఆగివున్న కారు ఎక్కాడు.

నేను నడిచి సిటీ బస్సు స్టాపులో ఆగాను.

## 7

"ఏమండీ! కాలింగ్ బెల్ మ్రోగుతోంది!"

బద్ధకంగా లేచాను. ప్రశాంతి నన్ను నిద్రలేపుతోంది. చటుక్కున మంచం దిగాను. బయటికి నడిచాను. తలుపు తెరిచాను. షర్టు సర్దుకున్నాను.

అవతల నలభై ఏళ్ళ వ్యక్తి నిలబడివున్నాడు. అతడి చెంపలు నెరిసి వున్నాయి. అయినా అతడి చేతులు

బలిష్టంగా మొహం కళగా యింకా యౌవనం కళతోనే వున్నాయి. అతడి కళ్ళు మెరుస్తున్నాయి.

"నన్ను రామానంద్ అంటారు" అన్నాడు అతడు చేయి చాపి.

నేను కరచాలనం చేయక తప్పలేదు.

"మిమ్మల్ని యిదే చూడటం!" అన్నాను.

"కావచ్చు. మీరు నాకు కొంతకాలంగా తెలుసు!"

"ఎలా తెలుసు?"

"డ్రాయింగ్ రూంలో కూర్చుందాం. నాకు చాల విషయాలు తెలుసు?"

"ఏ విషయాలు?"

"నిన్న మధ్యాహ్నం మూడు గంటల పన్నెండు నిమిషాలకు శాండ్ పార్క్ దగ్గర యింట్లో ఒక హత్య తెలుసు. మచ్చుకి ఇదో ఉదాహరణం అన్నమాట!"

నాకు నెత్తిన పిడుగులు పడ్డాయి—

అతడిని లోపలకు లాగాను. తలుపులు మూశాను.

"హత్యా? ఎవరు చేశారు?"

"మీరే. మేడమీదకు వెళ్ళారు. ఆమెను మెట్లమీద నుండి తోశారు."

"అబద్ధం!" నా భ్రమగానీ వృధాప్రయాస!

వీడెవడో ఘటికుడు. నిన్న మధ్యాహ్నం నేను ముసలిదాన్ని చంపేటప్పుడు వీడు ప్రక్కనే వున్నట్టు మాట్లాడుతున్నాడు.

"మీరు అప్పుడు ఎక్కడున్నారు?"

"నిన్న నేను మాట్నీ సినిమాలో వున్నాను."

"ఏ సినిమా?"

"మీరు చంపిన ముసలావిడ కూతురూ అల్లుడూ

చూస్తోన్న సినిమాయే."

"మీకు పిచ్చెత్తిందా?"

"ఏం?"

"మీరు సినిమా హాలులో వున్నారు. ఆ సమయంలో హత్య జరిగిందంటున్నారు. మీరు చూడని విషయం...."

రామానంద్ పకపక నవ్వాడు. సోఫాలో కూర్చుండి కళ్ళు మూసుకున్నాడు. మెల్లగా కళ్ళు తెరచి నావైపు ధీమాగా చూశాడు.

పిస్తోలు తెచ్చి వీడిని కాల్చితే!

నాకు అతడి ధీమా చూస్తే ఒళ్ళు మండిపోతోంది.

"నా దగ్గర టూయిన్ ఒన్ వుంది!"

"వుంటే? ఒక టేప్ రికార్డరూ, ఒక రేడియో కలసివున్న సెట్టు మీ వద్ద వున్నంత మాత్రాన ఏమవుతుంది?" నేను ఎదుటి సోఫాలో కూర్చున్నాను. నన్ను పసివాడిని చూసినట్టు చూశాడు రామానంద్.

"ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్ లో నాకు ఫారిన్ డిగ్రీ వుంది తెలుసా? నా దగ్గరవున్న టూయిన్ ఒన్ వేరే ఏర్పాటున్న యంత్రం!"

"ఏమిటా ఏర్పాటు?" అరిచినట్టన్నాను. నా మీద నాకే అదుపు తప్పుతోంది.

రామానంద నవ్వి, "ఆరవక! నా దగ్గర టెలివిజన్ కమ్ కెమేరా వున్నది. టెలివిజన్ లో ప్రసారమవుతోన్న ప్రసారాలను అవసరమని కెమేరా భావిస్తే అది వెంటనే 35 ఎం. ఎం. ఫిల్మును షూట్ చేస్తుంది."

"కావచ్చును. విజ్ఞాన శాస్త్రం అభివృద్ధి మీద నాకు ఆశవుంది!"

"అంతవరకూ నయం!" రామానంద ముందుకు

ఒంగాడు. నా షర్టుమీద వ్రేలుపెట్టి చూపించాడు.

"నిన్న నువు హత్యచేసేటప్పుడు ఇదే షర్టు వేసుకున్నావు! షర్టు చివర చూడు."

ఆశ్చర్యపోయాను. షర్టు చివర గుండ్రటి బొట్టువంటి మచ్చవుంది. రామానంద వ్రేలితో తన చేతులోకి లాక్కున్నాడు దానిని.

అది గుండ్రంటి రేకుముక్క. దానిమీద చిన్న తీగలు అటొకటీ యిటొకటీ అంటుకుని వున్నాయి. ఈ రేకు ముక్క నా షర్టుమీద ఎలా అంటుకున్నది? నాకువుండే కొద్దీ మతిపోతోంది.

"లక్ష్మీపతిని నువు హత్యచేస్తో నా కంట్లో పడ్డావు. అతడి చావువలన నీకు డబ్బు ముట్టింది. కాని నువు చట్టానికి దొరకవ్. నీకు మోటివ్ లేదు. నువు వృత్తిరీత్యా హంతకుడివని కనిపెట్టాను. సమయం చూసుకుని నీ షర్ట్స్ అన్నింటికి ఈ రేకుముక్క—అయ్‌మీన్ మైక్రో ట్రాన్స్‌మీటర్‌ను అంటించాను. మైక్రో ట్రాన్స్‌మీటర్‌ను టెలివిజన్ తెర ఆకర్షిస్తోంది. నువు ఎక్కడికి వెళ్తే అక్కడ మూడు నాలుగు గజాల వ్యాసంలో దృశ్యం టెలివిజన్ మీద ప్రసారమవుతుంది. నీలో తీవ్రమైన భావావేశాలు చెలరేగుతోంటే మాత్రం కెమెరా కలగచేసుకుంటుంది."

"నిజమా?"

రామానంద తన పాంటు జేబులో చెయ్యిపెట్టి కవర్ తీశాడు. కవర్‌లోంచి 35 ఎం. ఎం. ఫోటోలు బయట పడ్డాయి.

ఫోటోలు అందుకుని తేరిపార చూశాను.

ఒక ఫోటోలో ముసలావిడ ప్రక్కగా నిలబడ్డాను. ఆమెను దొంగ చూపులు చూస్తోన్నాను.

రెండో ఫోటోలో నా చెయ్యి ఆమె భుజానవుంది. ఆమె కాళ్ళక్రింద మొదటి మెట్టు!

మూడో ఫోటోలో ముసలావిడ మెట్లమధ్య పడి వుంది. ఆమె తల చిట్లినట్లు తలమీద నల్లటి మచ్చ కనిపిస్తోంది. ఆ మచ్చ వెంబడి రక్తం కాబోలు మొహం మీద కారుతోంది.

నాకు వెన్నులోంచి చలికెరటం పుట్టుకొస్తోంది.

ఎంతో తెలివిగా హత్యలు చేస్తోన్నట్టు భ్రమపడ్డాను. పురిట్లోనే సంధికొట్టింది.

"ఇవన్నీ నాకు ఎందుకు చూపిస్తున్నారు?"

"ఈ ఫోటోలు చూశాకనయినా నీకు తోచివుండాలి. బ్లాక్ మెయిలింగ్ కాబోలు అంటారు ఈ పద్ధతికి."

"ఎంత కావాలి? నెగటివ్స్ యిచ్చెయ్యాలి!"

"ఇరవై వేలు! నెగటివ్స్ యివ్వను."

"ఏం?"

"నీకు నెగటివ్స్ యిచ్చి ప్రయోజనమేమిటి?"

"మీ వుద్దేశ్యం నాకు స్పష్టంగా అర్థంకావడంలేదు."

"నువు మరల హత్యచేస్తావు. నా కెమెరా నేను ఎక్కడున్నా నా అవసరం లేకుండా ఎటూ నిన్ను పట్టుకుంటుంది. ఎన్ని నెగటివ్స్ కొనగలవు?"

"అంటే నేనో హత్య చేసినప్పుడల్లా ఇరవైలు వేలు యివ్వాలా?"

"చూశావా? కంగారుపడి నన్ను ఏకవచనంలో మాట్లాడుతున్నావు. ఆ తర్వాత జరిగే హత్యలలో నా రేటు తరువాత ప్రకటిస్తాను."

నాకు కళ్ళనీళ్ళ పర్యంత మవుతోంది.

"నాకు ఈ హత్యలో ముట్టింది 35 వేలు!"

"నీ రేట్లు నీవే నా రేట్లు నావే!"

"నిన్ను చంపితే!"

"చంపు. కెమెరా నిన్ను సులువుగా పట్టిస్తుంది" రామానంద తన షర్టు కాలర్ ఎత్తాడు. కాలర్ క్రింద మూడు రేకు ముక్కలున్నాయి "అంటే మూడు మైక్రో ట్రాన్స్‌మిటర్సన్నమాట!" అన్నాడు లేస్తూ.

"నీ కెమెరా, నీ టెలివిజన్ నిజమేనా?"

"నమ్మూ, నమ్మకపో!" రామానంద్ బయటికి నడిచాడు.

"సాయంకాలం—ఇరవై వేలు!" మెట్లు దిగి రోడ్డు మీద అడుగుపెట్టాడు.

నేను వరండాలో నిలబడి చూశాను.

మాధవ్ వస్తున్నాడు. రామానందను అతడికి చూపించి సైగ చేశాను.

మాధవ్ వ్రేలు చూపించి అడుగుతున్నాడు.

'రోజుకి వందా?' అని కాబోలు.

నాకు చిర్రెత్తిపోయింది.

డబ్బు కోసం మోహం చూసుకుంటూనా?—

మాధవ్ తలూపి రామానంద వెనకపడ్డాడు.

## 8

"హత్య జరగాలి—614879కి ఫోన్ చేయండి" ఇంతే వుంది కాగితంలో. జేబులో వుంచుకుని పోస్టాఫీసు బయటకు నడిచాను.

రోడ్డువారగా పబ్లిక్ టెలిఫోన్ బూత్ కనిపించింది.

బూత్‌లో దూరి రిసీవరెత్తాను. 614879కి రింగ్ చేశాను.

అవతల గొంతు వినిపించగానే సాకెట్‌లో నాణెం

వేశాను.

"ఎవరు కావాలి?" అడిగారు అవతల.

"పి. బి. 316" అన్నాను.

"రైట్. ఎంత కావాలి?"

"యాభై వేలు."

"చాల ఎక్కువ!"

"ఈ మధ్యాహ్నంలోపుగా క్యాష్ కావాలి!"

"అలాగే యిస్తాను!"

"ఎవరిని హత్య చేయాలి?"

'ప్రణవ్ గార్డెన్స్'లో రేపు రాత్రి ప్లిమత్ కారులో 10 గంటలకు ఒక వ్యక్తి వస్తాడు. అతడు కారును గారేజిలో వుంచి బయటకు రాగానే తుపాకీతో చంపాలి. మిస్సవకూడదు."

"అతడి పేరు?"

"జగ్గయ్య. కోటీశ్వరుడు జగ్గయ్య!"

నవ్వుకున్నాను. కోటీశ్వరుడని మెడలో బోర్డు వుంటుందా?

"రేపు రాత్రి 10 గంటల రెండు నిమిషాలకు గారేజి ముందు శవం వుంటుంది. సరేనా?"

"క్యాష్ ఎలా అందించాలి?"

"నేను ప్రణవ్ గార్డెన్స్ యివతల తపాలా పెట్టెవద్ద నిలబడతాను. క్యాష్ తెచ్చి చేతికి యివ్వండి!"

"అలాగే...."

"మీ పేరు?"

"అవసరంలేదు. పావు గంటలో తపాలా పెట్టెవద్ద క్యాష్ అందించబడుతుంది."

నేను రిసీవర్‌ని క్రెడిల్ చేసి చకచక జేబులోంచి

సామగ్రి తీశాను. దువ్వెనతో మధ్యపాపిడి తీశాను. చెంపలకు పౌడర్ అద్దాను. సన్నటి రిమ్ వున్న కళ్ళద్దాలు పెట్టుకున్నాను. చొక్కా తిరగవేసి తొడుక్కున్నాను.

బాత్ లోంచి బయటకు నడిచాను.

ప్రణవ్ గార్డెన్స్ వైపు నడవసాగాను.

రోడ్డు నిర్మానుష్యంగా వుంది. ఈ రోడ్డు ఎప్పుడూ యింతే! తపాలా పెట్టె దగ్గ ఆగాను. ఐదు నిముషాల తర్వాత బురఖాలో వున్న ఒక స్త్రీ వచ్చి ఒక సంచిని చేతికి అందించి వడివడిగా వెళ్ళిపోయింది.

అటూ యిటూ చూచి సంచిని తెరిచి చూశాను.

సంచిలో కరెన్సీ నోట్లున్నాయి. నా సంతోషానికి అంతులేదు.

ఉత్సాహంతో సంచీ తీసుకుని చకచక నడవసాగాను.

రోడ్డుమీద ఖాళీగా వెళ్తోన్న ఆటో కనిపించింది.

ఇల్లు చేరుకున్నాను.

ప్రశాంతి నా కోసమే ఎదురు చూస్తోంది.

ఆమెను పలకరించి సంచితో నా గదిలోకి వెళ్ళాను. తలుపు చేరవేసి డబ్బు లెక్కపెట్టాను. యాభై వేలు!

మాధవ్ కు టెలిఫోన్ చేశాను.

ప్రశాంతి వంటింట్లో వున్నట్టు అలికిడవుతోంది.

మాధవ్ పలికాడు.

"అతడు సబర్బన్ ట్రెయిన్ ఎక్కి తప్పించుకు పోయాడు!" అన్నాడు మాధవ్.

నేను నిట్టూర్చి, "ఈ సాయంకాలం అతడు నా యింటికి వస్తాడు. అతడిని జాగ్రత్తగా వెంటాడు. అతడి

ఇంటి అడ్రసు కనుక్కో. అడ్రసుకి వందరూపాయలు విడిగా యిస్తాను" అన్నాను.

"అలాగే...."

నేను డబ్బులో ఇరవై వేలు వేరుపరచాను. మిగతా సొమ్మును గాడ్రేజ్ బీరువాలో వుంచాను. ఇరవై వేలు విడిగా కట్టకట్టి క్రింది అరలో వుంచాను. బీరువాకి తాళం పెట్టాను.

వంటయింట్లోకి నడిచాను.

"అన్నం వడ్డించనా?" అడిగింది ప్రశాంతి.

తలూపి డైనింగ్ టేబులువద్ద కూర్చున్నాను.

ప్రశాంతి అన్నం వడ్డించసాగింది.

"నిన్న అతడు టూయిన్ ఒన్ అమ్మతానంటాడా? నేను సరిగా వినలేదు!" అడిగింది ప్రశాంతి.

నాకు తలలో మెరుపు మెరిసింది.

ప్రశాంతికి తట్టినట్టు — టూయిన్ ఒన్ కొంటే మంచిదేమో!

"అమ్మతాననలేదు! దానిగురించి చెప్పకువచ్చాడు!" అన్నాడు.

"అతడిదంతా బోగస్ వ్యవహారంలాగా వుంది!"

స్పష్టంగా ఫోటోలు చూపిస్తోంటే బోగస్ వ్యవహారం ఎలా అవుతుంది?

అందుకే నేను అనాసక్తంగా తలూపాను.

# 9

మాధవ్ ఆ యింటిముందు ఆగాడు.

రామానంద యింటిమెట్లు ఎక్కి వరండాలో అడుగు పెడుతూ కనిపించాడు. రమాకాంత్ అతడిని ఆప్యాయంగా రిసీవ్ చేసుకున్నాడు.

రామానంద మీద అతడికి గూఢచారి చర్య చేయ వలసిన అగత్యం ఏమిటి?

మాధవ్ ఆలోచిస్తున్నాడు.

ఇద్దరూ లోపలి గదిలోకి వెళ్ళారు.

మాధవ్ మెల్లగా యింటి ప్రక్కకు చేరుకున్నాడు. గది కిటికీవద్దకు ప్రాకాడు.

"ఆల్ రైట్! ఇరవై వేలు! సరిపోయాయి!" అంటు న్నాడు రామానంద.

రమాకాంత్ మెల్లగా నవ్వి, "మాట తప్పను!" అన్నాడు.

"ఆల్ రైట్! వస్తాను!"

"రామానంద్! నీ యంత్రం అమ్ముతావా? యాభై వేలిస్తాను. నీకు కావలిస్తే మరోటి తయారుచేసుకో వచ్చు!"

"అమ్మడమా? మై గాడ్! చూపించను కూడా చూపించను!"

"ప్లీజ్! రామానంద్! ఆ యంత్రం ఒక్కసారి చూపించు? అది ఎలా వుంటుందో చూడాలి! లేకపోతే నువు అబద్ధమాడుతున్నట్టే!"

"నువ్వు వెర్రివెధవలాగా మాట్లాడక! నా నిజాయితీని చూపించుకోవలసిన అవసరం నాకు లేదు."

రమాకాంత్ నిర్ఘాంతపోయాడు.

రామానంద బయటికి నడిచాడు.

మాధవ్ చప్పున రోడ్డుమీదకు దిగాడు.

రామానంద దారిన పోతున్న టాక్సీ ఆపాడు. ఎక్కి కూర్చున్నాడు.

మాధవ్ పొదల వెనుక ఆపిన స్కూటర్ వైపు

నడిచాడు.

క్షణాలలో స్కూటర్ రామానంద ఎక్కిన టాక్సీ వెంటపడింది. టాక్సీ నేషనల్ హైవేకి మరలింది.

నిర్మానుష్యంగా వున్న చోట ఆగింది.

మాధవ్ కొద్ది దూరంలో స్కూటర్ ఆపాడు.

రామానంద టాక్సీ దిగాడు.

మాధవ్ వైపు నడిచివచ్చాడు. మాధవ్ అతడివైపు తెల్లబోయి చూశాడు. రామానంద్ మెరుపులాగా అతడి మీద దూకాడు. గడ్డంక్రింద బలంగా గుద్దాడు.

మాధవ్ స్కూటర్‌తోసహా ప్రక్కకి పడ్డాడు.

కెవ్వున అరిచాడు. అతడి కుడికాలు మీద స్కూటర్ పడింది.

రామానంద ఏమీ జరగనట్టుగా టాక్సీవైపు కదిలాడు.

# 10

వాచీ చూసుకున్నాను. రాత్రి 9-30 అయింది. రోడ్డుమీద నడుస్తున్నాను. మరో పావుగంటలో ప్రణవ్ గార్డెన్స్‌లో వున్నాను. ఆకాశంలో చవితి చంద్రుడు మసక వెన్నెలలో ప్రసరిస్తున్నాడు.

ప్రణవ్ గార్డెన్స్ చుట్టూ ప్రహరీగోడవుంది. గోడ మీద చేతులుంచి లోపలకు దూకాను. లోపల క్రోటన్ మొక్కలు, సన్నజాజి పందిరి....ఆ ప్రక్కగా కారు గేరేజి....సన్నజాజి పందిరి క్రింద నుండి గేటులోంచి వచ్చేరోడ్డు గారేజివైపు వెళ్తోంది. గేటులో గూర్ఖా వున్నాడు.

దట్టంగా వున్న క్రోటన్ మొక్కల చాటున కూర్చున్నాను. పిస్తోలు తీసి సిద్ధంగా వుంచుకున్నాను. ఆరు బుల్లెట్లతో పిస్తోలు బరువుగా వుంది. మొక్కల చాటు

నుండి గేరేజి స్పష్టంగా కనిపిస్తోంది.

వాచీలో సమయం పదయింది.

గేటువద్ద కారువచ్చి ఆగింది. హెడ్‌లైట్స్ కాంతి లోపలకు ప్రసరిస్తోంది.

గూర్ఖా గేటు తెరిచాడు.

నా గుండెల చప్పుడు నాకే విచిత్రంగా వినిపిస్తోంది.

కారు లోపలకు వస్తోంది.

నేను తలవంచి కూర్చున్నాను.

కారు నా ముందునుండే వెళ్ళింది. గారేజివద్ద ఆగింది. అతడు కారు దిగాడు. గేరేజి తలుపు తెరిచాడు.

నేను తలవొంచి సేఫ్టీ కాచ్ లాగాను.

సైలెన్సర్ అమరిక నిర్దుష్టంగానే వుంది.

కారు లోపలకు వెళ్ళింది.

అతడు గేరేజి మూయలేదు. నా వైపు వస్తున్నాడు.

నేను ఆలోచించలేదు. చటుక్కున లేచి నిలబడ్డాను.

అతడు నా వైపు తెల్లబోయి చూశాడు.

అతడు కనురెప్ప వేయకుండానే పిస్తోలు తూటాలు తినగలిగాడు. నా గురికి నన్ను నేనే అభినందించుకున్నాను.

అతడు మాట్లాడకుండానే నేల కూలిపోయాడు.

నేను చకచకా గోడ దూకాను.

నిశ్చింతగా నడుస్తున్నాను.

ఎలక్ట్రికల్ స్తంభం వెలుగులో రిక్షా కనిపించింది.

రిక్షా మాట్లాడుకుని యిల్లు చేరాను.

ప్రశాంతి ప్రశాంతంగా నిద్రపోతోంది. నా గదిలోకి వెళ్ళాను.

టెలిఫోన్ గణగణలాడింది.

రసీవర్ ఎత్తి, "మాధవ్!" అన్నాను.

"కాను, రామానంద!" అటుప్రక్కనుండి వినిపించింది.

నాకు గుండెలు గుబగుబలాడాయి.

"చెప్పండి!" అన్నాను. ఎందుకయినా మంచిది. రామానందతో స్నేహంగా వుంటే నష్టంలేదు.

"నువు ఇప్పుడే హత్య చేశావు!"

అరె వీడు దేవాంతకుడు లాగా వున్నాడు. షర్టు తడుముకున్నాను. షర్టు వీపుమీద మైక్రోట్రాన్స్‌మీటర్ అంటుకుని వుంది.

నన్ను నేనే తిట్టుకున్నాను. నా నీడలాగా రామానంద నా వెంటే తిరుగుతున్నాడు. నేను కళ్ళు మూసుకుని ప్రవర్తించుతున్నాను.

"నేను హత్య చేయలేదు!" దబాయించాను.

రామానంద పకపక నవ్వాడు.

"నిజమే! నువు కావలసిన వ్యక్తిని హత్య చేయలేదు."

"ఏమిటి మీరు చెప్పేది?"

"నువు జగ్గయ్యను హత్య చేయలేదు!"

అతడి వాక్యం నాకు కొరుకుడు పడటంలేదు.

"నువు జగ్గయ్య అనుకుని జగ్గయ్య స్నేహితుడిని హత్య చేశావు!"

"నిజమా?"

"అవును. జగ్గయ్యతోపాటు అతడి స్నేహితుడు ప్రణవ్ గార్డెన్స్‌కి వచ్చాడు. జగ్గయ్య గేరేజిలో కారుకు తాళం పెడుతోంటే అతడి స్నేహితుడు తోటలోకి వచ్చాడు. నా టెలివిజన్ ఈ దృశ్యం అంతటినీ తెర మీద ప్రసారం చేయగలిగింది. స్నేహితుడిని కాల్చి

చంపావు. అతడు కిక్కురుమనకుండా నేలకూలాడు. నువు గోడ గెంతావు.

సరిగ్గా అదే సమయంలో గారేజిలోంచి జగ్గయ్య వచ్చాడు. తన స్నేహితుడికోసం చుట్టూ చూశాడు. అంతే! నువు రోడ్డుమీద నడుస్తోండటంతో టెలివిజన్ కి శక్తినీ చుట్టు మాత్రమే దృశ్యాన్ని ఆకర్షించుకోవడంలో పరిమితమయిపోయింది."

"ఇంతా మాస్తే నేను పనికిమాలిన హత్య చేశానా?"

"అవును."

చచ్చాను! డబ్బు తిరిగి యివ్వమంటాడేమో అతడు.

"రామానందంగారూ! నాకు మీ యంత్రాన్ని చూడాలనివుంది ప్లీజ్ .... చూపించరూ!"

"ఆలోచించి రేపు చెపుతాను!" అవతల క్లిక్ మన్నది.

నిట్టూర్చి రిసీవర్ పెట్టేశాను.

నాకు ఆ యంత్రం సొంతమయితే....

అసలు నేను హత్యలు చేయనక్కరలేదు. నేరస్తులను పనిగట్టి వాళ్ళ దుస్తులకు మైక్రోట్రాన్స్మిటర్ కు అమర్చితే చాలు! మిగతా పని అదే చేసుకుపోతుంది.

టెలిఫోన్ మరల గణగణలాడింది.

అవతల మాధవ్ పలికాడు.

"రామానంద నా కాలు విరగగొట్టాడు. నువ్వు ఇచ్చే వందకోసం కక్కుర్తిపడ్డాను. నాకు కాలు పోయింది."

"ఎలా జరిగింది?" నాకు చాలా చిరాకుగా వుంది.

మాధవ్ చెబుతున్నాడు.

ఎవరో దయామయుడు అతడిని జనరల్ ఆస్పత్రిలో చేర్చాడట!

అతడికి సానుభూతి చెప్పి ఫోన్ పెట్టేశాను.

# 11

"కారు తెచ్చాను. నీ కళ్ళకు గంతలు కట్టి తీసుకు వెళ్తాను."

"దారి తెలిస్తే నీకు వచ్చిన ప్రమాదం ఏమిటి?"

"నువ్వు హంతక వృత్తిలో నిలదొక్కుకుంటున్నావు."

"అయితే...."

"వాదన అనవసరం! టూ ఇన్ వన్ చూడాలనుకుంటే రా!"

రామానంద నాకు ఏ మాత్రం అర్థంగావటంలేదు. యంత్రం చూడాలి! దాని నిజాయితీ పరీక్షించాలి. అతడు అమ్మితే ఆ యంత్రం కొనుక్కోవాలి. అప్పుడే రామానంద ఆటకడుతుంది. అంతవరకూ నేను సహనం చూపించాలి.

"సరే. బయలుదేరదామా?" అన్నాను.

రామానంద లేచాడు.

ప్రశాంతి మేము కూర్చున్న చోటికి వచ్చింది. ఆమె చేతిలో ట్రే వుంది. ఇద్దరమూ కాఫీలు అందుకున్నాం.

"బయటికి వెళ్తున్నారా?" అడిగింది ప్రశాంతి.

తలూపాను.

"మీరు రైమంతా బయటే గడుపుతున్నారు. నాకు యింట్లో ఒంటరితనమూ భయమూనూ...." అంటోంది ప్రశాంతి.

"ఈమె మీ మిసెస్సా?" అడిగాడు రామానంద.

అతడి దృష్టిలో ప్రశాంతి పడటం నాకు ఎందుకో హితవుగా లేదు.

తలూపి, "రండి రామానందగారూ!" అని తొందరగా బయలుదేరతీశాను.

ప్రశాంతి గుడ్లనీరు క్రుక్కుతోంది.

భవిష్యత్తు నిర్మించుకోవడానికి ఆటంకంగా స్త్రీ మారకూడదు.

నేను నిర్లక్ష్యంగా బయటికి కదిలాను. రామానంద నా వెనుక వచ్చాడు.

రోడ్డుమీద కారు ఆగివుంది.

"ముందు సీట్లో కూర్చో!" అన్నాడు రామానంద.

అతడి మాట పాటించాను.

కారు బయలుదేరతీశాడు రామానంద.

నిర్జనంగా వున్న రోడ్డుమీద ఆపాడు. విండ్ స్క్రీన్ ఎత్తాడు. అవి కూలింగ్ స్క్రీన్స్! దట్టమైన నలుపు రంగులో వున్నాయి. డ్రయివింగ్ సీటుముందున్న గ్లాస్ మాత్రమే తెల్లగావుంది. తన జేబులోంచి నల్లటి గుడ్డపట్టి తీశాడు. నా కళ్ళకి అడ్డంగా పట్టిపెట్టి కట్టేశాడు. కళ్ళు వుండీ గ్రుడ్డివాడినయాను.

కారు బయలుదేరింది. టర్నింగులు తిరుగుతోంది. వాటినిబట్టి కారు ఎటు వెళుతోందో గుర్తించబోయాను. సాధ్యంకాలేదు. పావుగంట తర్వాత కారు ఆగింది. నన్ను చెయ్యి పట్టుకుని కారు దింపాడు రామానంద. నన్ను నడిపించుకుంటూ వెళ్ళాడు.

పెద్ద ఇనుప తలుపు తెరుచుకుంది.

నన్ను లోపలకు తీసుకువెళ్ళాడు రామానంద.

మా వెనుక తలుపు మూసుకుంది. కారు గేరేజిలాగా వుంది.

రామానంద నన్ను తడిమాడు. నా జేబులో వున్న ఆయుధం తీసుకున్నాడు.

నా అదృష్టదేవత—పిస్తోలు అది!

"ఇక్కడ నిన్ను చంపితే—" నవ్వాడు రామానంద. అతడి నవ్వు సంతోషంగాలేదు.

నవ్వాను "నన్ను చంపలేవు. చంపితే నీకే నష్టం!" అన్నాను.

అతడూ నవ్వి నా కళ్ళకున్న నల్లపట్టి తొలగించాడు.

## 12

నాకు చుట్టూ మసకగా కనబడటం మొదలుపెట్టింది.

నిజంగానే అది కారు గేరేజి. విశాలంగా వుంది. వెనుకప్రక్కకి గుమ్మం వుంది. రామానంద ఆ గుమ్మానికి వున్న తలుపు తెరిచాడు.

నన్ను ఆ గదిలోకి రమ్మన్నాడు.

నేను అతడి వెంట గదిలోపలకు నడిచాను.

ఆ గది చిన్నది. గోడ ప్రక్కగా పెద్దసైజు టెలివిజన్ సెట్టువుంది. సెట్టుకి ప్రక్క భాగంలోంచి 35 ఎం. ఎం. ఫిలిం తొంగి చూస్తోంది. రామానంద ఆ ఫిలిం పట్టుకుని లాగాడు.

"రాత్రి నువు చేసిన హత్య రికార్డయింది!" అన్నాడు రామానంద.

ఆ ఫిలింను వెనక ప్రక్కకి లాగాడు. ఏవేవో స్విచెస్ నొక్కాడు. టెలివిజన్ స్క్రీన్ మీద లైటు వెలిగింది. ఆ వెనుకనే లైటు ఆరి అడ్డుగా రూళ్ళు పరుగెత్త సాగాయి. తోట, క్రోటన్ మొక్కలూ వాటిమధ్యగా అస్పష్టంగా కనిపిస్తోన్న కార్ గారేజ్.

దృశ్యం మారింది.

గారేజిముందు కారు ఆగింది. క్రోటన్ మొక్కల చాటున నేను ఒదిగి కూర్చున్నాను.

తర్వాతి దృశ్యంలో కారులోంచి దిగిన వ్యక్తి కని

పిస్తున్నాడు.

నేను అతడిని పిస్తోలుతో బెదిరిస్తూ తర్వాత కనిపించాను.

నాకు రక్తంలో మంచి తేల్చుతోన్నట్టు కడుపులో దేవుతోంది.

రామానంద ఘటికుడు. అతడి యంత్రం అద్భుతం!

"ఆపండి! చూడలేను!" అరిచాను.

టెలివిజన్ మీద దృశ్యాలు ఆగాయి.

"కెమెరా చూపించండి!" అడిగాను.

"పిచ్చివాడా! కెమెరా లోపలే వుంటుంది. టెలివిజన్ ఆకరించే వ్యక్తిలోని భావావేశాన్నిబట్టి కెమెరా ఆటోమేటిక్ గా పనిచేయడం మొదలుపెడుతుంది. షూట్ చేసిన ఫిల్మ్ నెగెటివ్ బయటికి వస్తుంది. ఆ ఫిలిం తిరిగి టెలివిజన్‌లో లోడ్ చేస్తే పాజిటివ్‌లో స్క్రీన్ మీద బొమ్మ కనిపిస్తుంది. అంతే!"

చాల విచిత్రమైన అమరిక! అతడి మేధస్సును నిజంగానే మెచ్చుకున్నాను.

రామానంద టెలివిజన్ క్రింది అరలోంచి ఒక అట్టపెట్టె తీశాడు. దానినిండా మైక్రో ట్రాన్స్‌మిటర్స్ వున్నాయి, తోకకప్పల్లాగా.

రామానంద ఇప్పుడే వస్తానని చెప్పి, గది బయటికి నడిచాడు.

"ఈ యంత్రాన్ని ఎలా తీసుకువెళ్ళాలి?" ఆలోచిస్తున్నాను.

అప్పటికే చిన్న గుమ్మం తలుపు మూసుకుంది.

తలుపు బయట గొళ్ళెం పెట్టాడు. అయినా నేనా విషయం అంతగా పట్టించుకోలేదు. నేను ట్వాయిన్ ఒన్

వద్దకు నడిచాను ఉత్సాహంగా. రామానందను చంపైనా దాన్ని స్వాధీనం చేసుకోవాలనుకున్నాను.

టెలివిజన్ ఆగిపోయింది.

నేను స్విచ్ నొక్కాను. టెలివిజిన్ పని చేయలేదు. నాబ్స్ త్రిప్పాను.

వ్చ! టెలివిజన్‌లో వులుకూ పలుకూలేదు. కాబిన్ తట్టాను. టెలివిజన్ వెనక భాగంలో రేకు తెరిచాను. లోపలకు చూచి తెల్లబోయాను. మాజిక్ లాంతర్ వుంది. దానికి స్ప్రింగ్ చుట్టింది. ఇవతల ప్రక్క స్లయిడు లున్నాయి.

నాకు తలలో మెరుపు మెరిసింది.

స్లయిడ్సు అందుకున్నాను. పోజిటివ్‌లోకి మార్చిన ఫిలింలు వాటిలో ఫ్రేము కట్టి వున్నాయి. స్లయిడ్స్ లాగడంలో స్ప్రింగ్ తెగింది.

గదిలో ఎక్కడో టక్ టక్ చప్పుడవుతోంది. అలారం కదులుతోన్న చప్పుడు!

టెలివిజన్ అని రామానంద అమ్మింది డొక్కు కాబిన్!

నా కళ్ళు అటు చూశాయి. కాబిన్‌లో వుత్తరం వుంది. అందుకుని చూశాను.

ఆ వుత్తరం నాకు రాసిందే!

"డియర్ రమాకాంత్!

నువు మోసపోయినట్టు ఈపాటికి తెలిసేవుంటుంది. నువు లక్ష్మీపతిని చంపావు. లక్ష్మీపతి కూతురు కాంత నిన్ను చూసింది. శ్రీపతి తరఫున నువు ఆమె తండ్రిని చంపావని అర్థం చేసుకుంది. ప్రశాంతిగా పేరు మార్చుకుంది. వేషం మార్చుకుంది. నిన్ను వంచించింది. ఆశ్రయం సంపాదించుకుంది.

నువ్వు ఒక పోస్టుబాక్స్ నెంబర్‌ను మెయిన్‌టెయిన్ చేస్తోనట్లు తర్వాత తెలుసుకుంది.

ప్రశాంతీ నేనూ ప్రేమికులం. ఆమె నాతో చెప్పింది. వాల్వ్ తాళంపట్టే రంధ్రం, తాళంచెవినీ మైనం ముద్రలు తీసి నాకు యిచ్చింది. రంగారావు రాసిన వుత్తరాన్ని నీకంటే మేమే ముందు చూశాం. చిల్డ్రన్ పార్క్‌లో కాచుకున్నాం.

రంగారావుకీ నీకూ జరిగిన సంభాషణ విన్నాం. ఆ మధ్య రంగారావు యింట్లో ప్రవేశించాం. నువ్వు ముసలావిడను హత్య చేసేటప్పుడు ఫోటోలు తీశాం. 35 ఎం. ఎం. ఫిలింమీద వీలైనన్ని ఎక్కువ ఫోటోలు తీశాం.

ప్రశాంతి నీతో బాటే వుంటుంది. కాబట్టి మైక్రో ట్రాన్స్‌మిటర్‌గా అబద్ధమాడిన రేకుముక్కలు నీ దుస్తులకు తగిలించడం పెద్ద సమస్య కాలేదు. ప్రశాంతి మీద నామీదా నువు నియోగించిన మాధవ్‌ను తప్పించు కోవడం కూడా మాకు కష్టం కాలేదు.

తర్వాతి రోజు 614870 నుండి నీకు వచ్చిన ఉత్తరం మాకు కనిపించింది. ఎక్స్‌ఛేంజ్‌లో దర్యాప్తుచేసి అడ్రసు పట్టుకున్నాం. టెలిఫోన్ స్తంభంమీద 6148'9 ఫోన్‌ని టాప్ చేశాను. అతడికీ నీకూ జరిగిన టెలిఫోన్ సంభాషణ విన్నాను.

ప్రణవ్ గార్డెన్స్‌లో నీకోసం సాయంకాలం నుండి కాచుక్కూర్చున్నాను. ఫోటోలు తీశాను. మొత్తం 60 ఫోటోలు!

నువు యింటికీ వచ్చేసరికి నీ కోసం ఫోన్ చేశాను.

నేరాలను కనిపెట్టే యంత్రం నిజంగానే నా దగ్గర వున్నట్టు నీకు రూఢి అయింది. నువు యంత్రం కొనడానికి

సిద్ధపడ్డావు. నేను పెట్టే మానసిక హింసను తట్టుకోలేక పోయావు.

టూయిన్ ఒన్ కోసం నువు నా వెంబడిపడ్డావు.

నిజానికి 35 ఎం. ఎం. ఫిలిం నెగెటివ్వూ, పోజిటివ్వూ కలగలిపి నిన్ను బుట్టలో వేశాను. చిన్న అమరికతో టెలివిజన్ స్క్రీన్ మీద రూళ్ళ గీతలు వెళ్ళడం దృశ్యం పడటం చేశాను.

ఈ పనులకి అంతాకలసి మాకు ఏడువేల రూపాయలు ఖర్చయ్యాయి. అంతే! కాని దానితో ప్రశాంతి (శాంత) నీమీద పగసాధించింది. తన తండ్రిని చంపినవాడిని, చంపించినవాడినీ తుదముట్టిస్తోంది.

ఈ సమయానికి అక్కడ శ్రీపతి చస్తాడు. నీ పిస్తోలుతోనే. పిస్తోలూ నీ ఆనవాళ్ళూ శవం దగ్గర దొరుకుతాయి.

అక్కడ నువ్వు....

ఈ గదిలో అమర్చిన టైంబాంబుకు బలయిపోతావు. స్ప్రింగ్ తెగిన పావుగంటకి టైంబాంబు ప్రేలుతుంది. నిముషాలు లెక్కపెట్టు. —రామానంద."

అంతే! అది చదివి నిశ్చేష్టుణ్ణైపోయాను. నా తెలివి తక్కువకు, అత్యాశాకు నన్ను నేనే నిందించుకున్నాను.

నాకు చేతులు వణుకుతున్నాయి.

అలారం టిక్ టిక్ మంటోంది ఎక్కడో.

నా మరణం కొన్ని నిముషాలలో....క్షణాలలో.... క్షణాలు లెక్కపెడుతున్నాను.

నా గుండెల చప్పుడు నాకే వినిపిస్తోంది—అలారం మోతలాగా.

—:ఐ పో యిం ది:—

# బావిలో శవాలు!

సికిందర్

శ్యామల డాబా మెట్లెక్కి వచ్చి, పిట్టగోడ నానుకొని నిల్చొని, నా ప్రాణాలెగిరిపోయేలా ఒక్క కేక పెట్టింది. "ఫోన్ వచ్చింది! మిమ్మల్ని బాస్ పిలుస్తున్నారు!"

మొదటిది నా ప్రాణాలెగిరిపోవడం, రెండవది టైప్ మిషన్ మీద నా వ్రేళ్ళు తప్పుకొట్టేయడం, రెండూ ఒకేసారి జరిగాయి.

చటుక్కున తలెత్తిచూశా నామెని.

"ఫోన్ వచ్చింది! బాస్ పిలుస్తున్నారు మిమ్మల్ని!" అర్చిందామె మళ్ళీ.

నాకు నీరసం కమ్ముకుంది. ఈ అరుపుల్ని అసలు భరించలేకపోతున్నాను. మొదట్లో కళ్ళతో మింగేసేలా చూసి భయపెట్టేది. కాని క్రమంగా నాకది అలవాటై పోవడంతో, పద్ధతి మార్చి ఇలా గొంతు చించుకొని అరవటం మొదలుపెట్టింది. ఏదో ఒకరకంగా నన్ను

భయపెట్టడం ఆమె ముఖ్యోద్దేశం.

"ఎందుకలా అరుస్తావు సైరన్ లా?" అన్నాను రెచ్చిపోతూ.

"సైరన్ కి భయపడటానికి మీరేమైనా దొంగనా?"

"నేనిక్కడ బెపు కొట్టుకుంటున్నాను — జూదగృహాలమీద రిపోర్టు! ఏకాగ్రత అవసరం!"

"మీ రిపోర్ట్స్ అంటే నాకు వళ్ళుమంట!"

"నీ అరుపులంటే నాకూ వళ్ళుమంట!"

"నా అరుపులకు లొంగకపోయారో, కరుస్తానంతే!"

"అది కూడా మొదలు పెట్టావా? నీకు నేనెందుకు లొంగాలి?"

"నన్ను కట్టుకున్నందుకు! నాకు మొగుడయినందుకు!"

"ఛ ఛ! భాష.... భాష!" నెత్తి కొట్టుకున్నాను, "నీతో ఇహ చచ్చినా మాట్లాడను. మితిమీరిపోతున్నావు. నడువ్, ఫోన్ మీద ఎవరు; పెద్ద బాసా? చిన్న బాసా?"

"చిన్న బాస్!" ఆమె కఠినంగా చెప్పి మెట్లు దిగసాగింది.

నేను అలసటగా లేచి ఆమె వెనుక వెళ్ళాను.

ఆమె కిచెన్ లోకెళ్ళి గలగల చప్పుళ్ళు చేయసాగింది.

నేను ముందుగదిలోకెళ్ళి ఫోన్ ఎత్తాను. "హలో సర్?"

"సుందర్, నువ్వెంటనే రా!" శర్మ గొంతు పలికింది.

"ఎక్కడికి?"

"బాస్ ఇంటికి!"

"దేనికి?"

"తెలీదు, రాబర్టు ఫోన్ చేసి వెంటనే రమ్మన్నాడు."

"కానీ నేనిక్కడ రిపోర్టు వ్రాస్తున్నాను."

"నేనూ వ్రాస్తున్నాను ఇక్కడ—ఎడిటోరియల్!"

"మీరు వెళ్తున్నారా?"

"అవును, నువ్వెంట నేరా!" అతను ఫోన్ పెట్టేశాడు.

నేనూ పెట్టేసి టైము చూశాను. అరవుతోంది. గబగబా తల దువ్వుకొని శ్యామలని పిల్చాను. "వెళ్తున్నాను, తలుపేసుకో!" అన్నాను.

"ఎక్కడికి?"

"బాస్ ఇంటికి, రమ్మన్నారు."

"ఎప్పుడొస్తారు?"

"ఆయన వెళ్ళమన్నప్పుడు."

"మీకసలు నేనెందుకు!" అర్చిందామె కివ్వున.

ఆమెని కొట్టబోతూ ఆగిపోయాను. ఆవేశం అణచుకున్నాను అతి ప్రయత్నంమీద.

"బాస్‌తో చెప్పి నీ సైరన్ పీకించేస్తాను!" అన్నాను వెంటనే అక్కడ్నుంచి కదిలి వెళ్ళిపోతూ.

## 2

బంగళా ఆవరణలో బైక్ ఆపి దిగాను.

వరండాలో నీరజ ఎదురు చూస్తోంది. ఆమెని చేరుకుని ఏమిటన్నట్టు చూశాను.

"పదండి, మీ కోసమే చూస్తున్నారు" అందామె లోపలికి దారితీస్తూ.

"ఏం జరిగింది?" అడిగాను ఆమెతో నడుస్తూ.

"ఎవరో యువతి వచ్చింది."

"ఎవరామె?"

"ఏమో, బాస్ శరణుకోరి వచ్చింది—"

"బాస్ మరీ కరుణామయుడై పోతున్నారు" అన్నాను. ఇద్దరం మెట్లెక్కి పైన గదిలోకి ప్రవేశించాం.

అక్కడ వాళ్ళంతా నిశ్శబ్దంగా కూర్చున్నారు. ఎడిటర్ శర్మ, బాస్ బాడీగార్డు రాబర్ట్సు, ఒక యువతి, మా బాస్.

మా బాస్, బ్లేడ్ పత్రిక యజమాని, శ్రీ మహీందర్ రావు అందరికంటే గంభీరంగా, హుందాగా కూర్చున్నాడు. ఆయన చేతిలో సిగరెట్ కాల్తోంది. అరవై పైబడ్డా ఆయన శరీరంలో చురుకుదనం పోలేదు. ముఖంలో తేజస్సు కళ్ళలో తీక్షణత తగ్గలేదు.

ఆయన్ను ఒకచోట కూర్చోబెట్టి వ్యవహారాలన్నీ చూసేందుకు మేమంతా ఉన్నాం. ఆయనకు పూర్తి శారీరక విశ్రాంతిని చేకూర్చగలం. కానీ మానసికంగా ఆయనకు విశ్రాంతిలేదు. నిరంతర గడియారంలా ఆలోచిస్తూనే వుంటాడు. కొత్త కొత్త ప్రణాళికలు రూపొందించి మా మీదకు వదులుతుంటాడు.

ఆ ప్రణాళికలన్నీ సమాజం బాగుకోసమే!

సమాజంలోని అవినీతినీ, అన్యాయాల్నీ, అక్రమాల్నీ సమస్త దుష్కృతుల్నీ నిర్మూలించి ఆరోగ్యవంతం చేయడమే జీవిత లక్ష్యంగా కంకణం కట్టిన మహోన్నత వ్యక్తిగా దేశవ్యాప్తంగా ఆయనకు గుర్తింపూ ఆదరణా వున్నాయి. మేధావి వర్గాల్లో ఆయనపట్ల ఎనలేని గౌరవాభిమానాలున్నాయి.

ఆయన సంస్కర్తమాత్రమేకాదు, దానశీలుడుకూడా. ఏ స్వచ్ఛంద సేవా సంస్థలకైనా ఆయన అండదండలుంటాయి; ప్రోత్సాహముంటుంది. అనాథలకీ, అన్యాయాలకు బలైన వాళ్ళకి ఆయన చేతులనుండి ధారా

పాతంగా విరాళాలు ప్రవహిస్తుంటాయి.

అవినీతి—అది ఏ రూపంలో, ఏ స్థాయిలోనున్నా—దాన్ని వెలికిలాగి ప్రపంచానికి వెల్లడిచేసేవరకూ ఆయన విశ్రమించడు. అందుకు ఆయన చేపట్టిన దర్పణం 'బ్లేడ్' పత్రిక. దీని ఖ్యాతి దినదిన ప్రవర్థమానమవుతూ ఉజ్వలంగా వెలిగిపోతోందంటే, అది పూర్తిగా పత్రికా వ్యవహారాల్లో ప్రత్యక్షంగా పాలుపంచుకొనే మా బాస్ వల్లనే.

ఇలాంటి పత్రికలకి సహజంగానే శత్రువులుంటారు. ఆటంకాలు సృష్టిస్తారు. కాలరాయడానికి యత్నిస్తారు. ఇవన్నీ గతంలో ఆయన ఎన్నోసార్లు ధైర్యంగా ఎదుర్కొన్నాడు. అలాంటి శక్తుల్ని తిప్పికొట్టాడు.

ఒకసారి జీవన్‌లాల్ అనే ఒక డోప్ స్మగ్లర్, ('పరువా? ప్రాణమా?' నవల చదవండి) మరోసారి సక్సేనా అనబడే ఒక బ్లాక్‌మార్కెటీర్, ('కీర్తి దాహం' నవల చదవండి). ఇంకా ఎందరెందరో మహానుభావులు వేసిన ఎన్నో ఎత్తుగడల్ని చిత్తుచేయడమే గాక; వాళ్ళ వాళ్ళ అంతరంగిక జీవితాల్లోకి తొంగి చూసి, తలపడి, బహిర్గతం చేసి, అశేష ప్రజాభిమానాన్ని చూరగొనడం జరిగింది.

ప్రతి ప్రతిఘటనలోనూ పత్రిక ప్రతిష్ట పెరుగుతూనే వచ్చింది తప్ప పడిపోలేదు.

అయితే ఇప్పుడు బాస్ అందర్నీ ఇలా సమావేశపరిచాడంటే మళ్ళీ ఏదైనా ఉపద్రవం వచ్చి పడిందా?

ఆయనకు నమస్కరించి కూర్చున్నాను.

నా చూపులు ఆ యువతిమీద పడ్డాయి. పాతికేళ్ళుంటాయి. అవివాహిత. అంత అందంగా లేదుగానీ,

ఆకర్షణీయంగా అలంకరించుకుంది. ఆమె కళ్ళలోకి సూటిగా రెండు క్షణాలు చూసిన నాకు కలవరపాటు కలిగింది. అవి బాగా ఎర్రబడి వున్నాయి. ఆమె ఏడ్చి వుంటుంది.

"ఏం జరిగింది, సర్?" అన్నాను బాస్ వైపు తిరిగి.

ఆయన నోట్లోంచి సిగరెట్ తీసి నన్ను చూశాడు, క్రోధాన్ని కక్కుతున్న కళ్ళతో.

"ఈమెమీద అత్యాచారం జరిగింది, సుందర్. తప్పించుకొని ఇక్కడకొచ్చింది."

"ఎవరు చేశారు, సర్?"

"లిఫ్ట్ ఇస్తానన్న ఒక లోఫర్!"

"ఎలా, సర్?"

"నువ్వు చెప్పమ్మాయ్" అన్నాడాయన ఆమెవైపు తిరిగి.

ఆమె సంకోచించింది.

"మీ పేరు?" అడిగాను.

"సుమిత్ర—" మళ్ళీ కొనసాగించ లేదు.

"ఎక్కడుంటారు?"

"పంజా గుట్టలో."

"ఏం చేస్తుంటారు?"

"ఉద్యోగం-సెనోని."

"ఇప్పుడు ఏం జరిగిందో వివరంగా చెప్పండి."

"మేం తక్షణం చర్య తీసుకుంటాం!" శర్మ అన్నాడు దృఢంగా.

ఆమె తలవంచుకుని నెమ్మదిగా చెప్పసాగింది.

"ఈ రోజు నేను ఆఫీసు నుంచి నాలుగున్నరకే వచ్చేశాను, వంట్లో బాగాలేకపోతే. బస్ స్టాప్ దగ్గర

నిలబడి ఎదురు చూస్తున్నాను. అంతలో ఈ కారు వచ్చింది. అందులో వున్నాయన పెద్దమనిషిలా కనిపించాడు. నా తండ్రి వయసులో వున్నాడు—మర్యాద స్తుడిలా తోచాడు. అతడు కారాపి లిఫ్ట్ కావాలా అనడిగాడు. నేను తత్తరపడలేదు—అది నాకు ప్రతి రోజూ అలవాటే. అలా ఎన్నోసార్లు వెళ్ళాను. అందులో తప్పులేదు. ఒక్కోసారి నేనే చొరవచేసి అడుగుతాను. ఇతన్ని చూసి నాకు మంచి అభిప్రాయం కల్గడంతో, తిరస్కరించడం సభ్యత కాదనిపించింది...."

"చెప్పండి."

"నేను థాంక్స్ చెప్పి ఎక్కి అతని ప్రక్కన కూర్చున్నాను. కారు పోనిచ్చాడు. అప్పుడు నన్ను ప్రశ్నించడం మొదలెట్టాడు. నా పేరేమిటి, ఏం చేస్తుంటాను, ఎక్కడ వుంటాను, నాకెవరున్నారు.... ఇలా ఎన్నో అడిగాడు. అన్నిటికీ ఓపిగ్గా చెప్పాను. అప్పుడు తన గురించి మొదలు పెట్టాడు — తానొక ఫ్యాక్టరీలో పెద్దాఫీసరు. మంచి జీతం. ఎన్నో సదుపాయాలు. పెళ్ళయింది. పిల్లల్లేరు. భార్య ఊరికెళ్ళింది. ఇంట్లో యెవరూలేరు. నాకూ యెదురుచూసే వారెవరూ లేరు—తనతో ఓ రెండు గంటలు గడపగలనా?"

"అలా అన్నాడా?"

"నిర్లజ్జగా అన్నాడు!"

"మానర్‌లెస్ పంక్!" బాస్ తిట్టాడు.

"అప్పుడు మీరేం చేశారు?" అడిగాను.

"అతన్ని చూసి నేనెంత పొరబడ్డానో తెలుసుకున్నాను. ఈడ్చి కొట్టబోయాను. అతడు నా చేయి మెలితిప్పి పట్టుకొని, 'ఇదుగో అమ్మాయ్! నీ కిష్టముంటే

అవుననను, లేకపోతే కాదను. ఇలా చెయ్యెత్తావంటే రెచ్చిపోతాను. నేను లిఫ్ట్ ఇచ్చినవాళ్ళెవరూ నాకు లిఫ్ట్ ఇవ్వకుండా పోలేదు!' అన్నాడు."

"అప్పుడు—?"

"నాకు చెడ్డ భయంవేసింది! అరవాలనుకున్నాను. కానీ అందరికీ ముఖం చూపించుకోలేను తర్వాత. డోర్ తీసి దూకేయాలనుకున్నాను, కానీ వేగంగా పోనిస్తున్నాడు. నన్ను దింపేయమన్నాను. వికటంగా నవ్వి ఇంకా వేగం పెంచాడు. అప్పటికి కారు యెటెటో వెళుతోంది—వేరే తోవలో—నా ఇంటివైపుగాక. భయంతో నాకేమీ పాలుపోలేదు. అతడు నవ్వుతూ మధ్య మధ్యలో ఏదో వాగుతూ డ్రైవ్ చేస్తున్నాడు—ఒకచేత్తో నా చెయ్యి పట్టుకొని."

ఆమె వూపిరి పీల్చుకుంది. "చివరకి కారు ఈ వీధిలోకి తిరిగినప్పుడు నేను తెగించి ఏదో ఒకటి చేసేయాలనుకున్నాను—అతని ఇల్లెక్కడో చెప్పలేదు. ఈ ప్రాంతాలే ఉండొచ్చు. ఏ క్షణంలోనైనా చేరుకోవచ్చు. ఈలోపే తప్పించుకోవాలి! అంతే, అప్పుడింకేమీ ఆలోచించకుండా అతని చెయ్యిపట్టి కొరికేశాను—"

"అప్పుడేం జరిగింది?"

"అతను కెవ్వున అరిచాడు. నా చెయ్యివదిలేసి కొట్టబోయాడు. కానీ కారు కంట్రోలు తప్పి యెదురుగా యెలక్ట్రిక్ స్తంభాన్ని గుద్దుకోబోవటంతో సడన్ బ్రేకు వేశాడు—అదే సమయంలో నేను డోర్ తీసి దూకేశాను బయటికి—వెనక్కి తిరిగి పరుగు ప్రారంభించాను. అతను వెనుకనుంచి అరుస్తున్నాడు, రాత్రి నా ఇంటికొచ్చి అంతుచూస్తానని! అప్పుడు వీధిలో యెవరూ లేరు—ఆ

సంఘటన యెవరూ చూడలేదు. నేనలాగే పరిగెత్తు కుంటూ గేటు తీసివుంటే ఈ ఇంట్లో కొచ్చేశాను."

ఆమె చెప్పడం పూర్తి చేసి, బాస్ వైపు తిరిగింది.

"ఇక్కడ మిమ్మల్ని చూస్తాననుకోలేదు! అంతా దైవ సంకల్పం. మిమ్మల్ని చూసి నా ఆనందానికి హద్దు లేకుండా పోయాయి....మీ గురించి చాలా విన్నాను. నేను అనాధని. నాలాంటి అనాధలకి మీరే దిక్కు, సర్వం. మా పట్ల మీరు చూపుతున్న సానుభూతి సహ కారానికి మీరంటే నాకెంతో భక్తి గౌరవం ఏర్పడ్డాయి. మీరు నాకు పూజ్యనీయులు. ఆ భగవంతుడే నన్నిలా మీ పాదాల చెంతకు పంపాడని—"

ఆమె కన్నీళ్ళను ఆపుకోడానికి ప్రయత్నిస్తోంది.

బాస్ ఆమె చేతిని తట్టాడు మృదువుగా.

"అధైర్యపడకు, మేమంతా వున్నాం."

అప్పుడు నా వైపు తిరిగి—"అరవిందా? ఆ బ్లడీ లోఫర్ మీద ఫైలు సిద్ధం చెయ్!" అన్నాడు.

"అలాగే సర్" అన్నాను ఆమె వైపు తిరుగుతూ, "అయితే అతని ఇల్లెక్కడో చెప్పలేదా?"

ఆమె తలూపింది అడ్డంగా. "చెప్పలేదు."

"పేరు?"

"అది కూడా చెప్పలేదు, ఏ ఫ్యాక్టరీలో పని చేసాడో కూడా చెప్పలేదు."

"కారు నెంబర్ చూశారా?"

"అప్పుడు నా పరిస్థితి మీకు తెలుసు. యెందుకు చూస్తాను? కానీ అది అంబాసిడర్ కారు—నల్లరంగుది."

"ఈ వీధిలోకి తెచ్చాడంటే ఇల్లు ఇక్కడే వుంటుంది" అన్నాడు శర్మ.

"ఈ వీధిలో ఫ్యాక్టరీలో పనిచేసే ఆఫీసరెవరూ లేడు" అన్నాడు రాబర్టు.

"వీధిని గాక మొత్తం లొకాలిటీని చూడండి" అన్నాడు బాస్.

"అవును, వీధి అంటే ఈ ఒక్క వీధికే వర్తిస్తుంది" శర్మ అన్నాడు.

"నేను కనుక్కుంటాను" అన్నాన్నేను.

"అతను రాత్రి ఇంటికొస్తానన్నాడు...." అందామె భయంగా.

"అవును, మీరిప్పుడు ఇంటికెళ్ళరా?"

"వెళ్ళను! ఇంట్లో నాకెవరూ లేరు."

"అయితే ఎవరింటికైనా వెళ్ళి వుండండి."

"నాకెవరూ తెలీదు."

బాస్ అన్నాడు. "ఫరవాలేదు, ఈ రాత్రి నువ్విక్కడే వుండు. ఇక్కడ నీకు భయంలేదు. నా సెక్రటరీ నీకు తోడుగా వుంటుంది—" నీరజవైపు తిరిగి—"ఈమెని నువ్వు జాగ్రత్తగా చూసుకోవాలి" అన్నాడు.

నీరజ తలూపింది.

బాస్ నావైపు తిరిగాడు. "నువ్వీ ఏరియాలో దర్యాప్తు చెయ్. అతన్ని ట్రేస్ చేయగలవేమో చూడు. లేకపోతే రాత్రి ఈమె ఇంటి దగ్గర నిఘావుండు—ఆ లోఫర్ వస్తే వెంటాడి—వెల్ ఏం చెయ్యాలో నీకు తెలుసు."

నేను తలూపాను.

తర్వాత బాస్ ఆమెవైపు తిరిగాడు. "నువ్వేం భయపడకు. ఇందులో నీ పేరెక్కడా రాదు. ఇది పోలీసు దర్యాప్తుకాదు, మా పత్రిక స్వంత ఇన్వెస్టిగేషన్. ఆ

లోఫర్ ఇంకేం తప్పుడు పనులు చేస్తున్నాడో ఆరాలుతీసి, ప్రజల్లో అపఖ్యాతిపాలు చేస్తాం. ఆ శిక్ష చాలదూ?"

ఆమె తలూపింది, చేతులు జోడిస్తూ.

## 3

పోస్టల్ అధికారుల ధృవీకరణలో ఆ ఏరియాలోనూ, ఇంకా ఆ చుట్టుప్రక్కలలోనూ ఫ్యాక్టరిలో పనిచేసే ఆఫీసరు ఎవరూ నివశించడంలేదని తేలింది.

అక్కడ స్థానికంగా జరిపిన దర్యాప్తులో తమ వీధుల గుండా అటువంటి కారు ఏదీ పోతూ కన్పించలేదని చెప్పారు అక్కడి పౌరులు.

సుమిత్ర చెప్పిన ఎలక్ట్రిక్ స్తంభం దగ్గర, రోడ్డు మీద సడెన్ బ్రేకు వేసిన చిహ్నాలేవీ కనిపించలేదు.

బాలానగర్‌లో ఆమె వేచివుండిన బస్ స్టాప్ దగ్గర కూడా ఆ కారును గురించిన సమాచారం దొరకలేదు.

ఇదంతా పూర్తిచేసుకొని ఆఫీసుకి నిరుత్సాహంగా తిరిగి వచ్చేసరికి రాత్రి తొమ్మిదయింది. శర్మ అంతా తెలుసుకొని ఆలోచనలో పడ్డాడు.

"అయితే అతను రాత్రి ఆమె ఇంటికొస్తాడంటావా?" అన్నాడతను.

అసిస్టెంట్ ఎడిటర్ మోహన్ అందించిన చల్లటి మంచినీళ్ళు తాగి అడ్డంగా తలూపాను.

"నమ్మకం లేదు, సర్. అది ఆవేశంలో చేసిన ఉత్తుత్తి బెదిరింపులా వుంది."

"అవును, అలా వెళితే ఆమె పందిని కూడగట్టుకొని అతన్ని మసాలా రుబ్బేయొచ్చు."

"ఏం చేద్దాం?"

"మర్చిపోదాం,"

"కానీ బాస్ మర్చిపోరు, నా కప్పగించిన పనిని."

"యూ ఫూల్!"

"నేనా?"

"నువ్వే, నీకో పాయింట్ తట్టిందా?"

"ఏ పాయింట్, సర్?"

"అతనిల్లు మన బాస్ యింటి ప్రాంతాల వుంటే నే కదా ఆ వీధిలోగుండా ప్రయాణిస్తాడు?"

"అవును...."

"మరి రోజూ అతడి రాకపోకలు ఆ వీధిలోగుండా నే సాగాలి కదా?"

"అవును...."

"రేపుదయం ఆ వీధిలో కాపుకాయ్, ఫ్యాక్టరీకి పోతూ కన్పిస్తాడు."

"ష్యూర్?"

"ష్యూర్."

"కానీ ఆ ప్రాంతాల అటువంటి కారుని చూడ లేదన్నారుకదా ప్రజలు...."

"అప్పుడు చూడలేదన్నారు—ఎప్పుడు? ఆ యువతిని తీసుకొచ్చిన సమయంలో. నువ్వక్కడ అపార్థం చేసుకున్నావు."

ఉలిక్కిపడ్డాను. అవును, అది నిజమే!

"మరి పోస్టల్ వాళ్ళ ఇన్ఫర్మేషన్ సర్?"

"వాళ్ళకి తెలియకుండా అతను ఇటీవలే ఇల్లుమారి వుండొచ్చు."

"అయితే రేపు మీరు చెప్పినట్టు చేస్తాను."

"గుడ్!" అన్నాడతను లేస్తూ, "పద, పోదాం! నన్ను ఇంటిదగ్గర దింపేయ్."

ఇద్దరం కిందకొచ్చి బైక్ ఎక్కి బయల్దేరాం.

నా ఆలోచనలు ఆ యువతి చుట్టే తిరుగుతున్నాయి. ఆమెని గురించి ఆలోచిస్తున్నకొద్దీ ఆందోళన ఎక్కువవుతోంది. ప్రపంచంలో ఏకాకిగా వుండటం—అందునా ఆడవాళ్ళకి ఎంత దుర్భరంగా వుంటుందో!

"ఏమిటి బాబూ ఆలోచిస్తున్నావ్" శర్మ అన్నాడు వెనుకనుంచి.

"శ్యామల గురించి...." పరధ్యానంగా అన్నాను.

"ఏమిటామె గురించి?"

"ఆమె ఎందుకలా అరుస్తుందో అర్ధంగావడంలేదు."

"ఆడవాళ్ళు అరుస్తారు" అన్నాడతను.

"ఎందుకరుస్తారు?"

"నీకు సైకాలజీ తెలీదు."

"మీకేం తెలుసు?"

"నువ్వామెని పట్టించుకోవడంలేదు."

"అయితే?"

"నిర్లక్ష్యం చేస్తున్నావ్."

"చేస్తే?"

"యెంతసేపూ బయిటి గొడవలే కాదు బాబూ, భార్యల ముచ్చట్లు కూడా చూడాలి!"

"నాకు భార్యలులేరు, భార్య వుంది. ఒక్కటి!"

"నీకు గ్రామర్ కూడా తెలీదు!"

"మరి నాకేం తెలుసు?"

"ఆమెచేత చాకిరీ చేయించుకోవడం!"

"సరే, అయితే ఈ ఉద్యోగానికో నమస్కారం పెట్టేసి ఊటీ వెళ్ళిపోతాను. ఆమెతో షికార్లు కొడతాను."

"అక్కర్లేదు, బాస్‌తో చెప్పి నీ పని వేళల్ని క్రమబద్ధకంగా చేయిస్తాను. వారానికొక రోజు సెలవు ఇప్పిస్తాను."

"అప్పుడామె అరుపులు తగ్గుతాయంటూరా?"

"తగ్గుతాయి, నువు సరిగా చూసుకుంటే."

"చూద్దాం."

ఇంటికి వెళ్ళి భోజనంచేసి బెడ్ మీదకు చేరాను అలసటగా. అంతసేపూ శ్యామల ఏమీ మాట్లాడలేదు. నేనూ పట్టించుకోలేదు. చివరకి నా ప్రక్కన చేరి సంగతులు అడిగింది. టూకీగా చెప్పాను.

"దేశంలో మా ఆడవాళ్ళకి సెక్యూరిటీ లేకుండా పోయింది!" అంటూ వాపోయిందామె.

నేను నిద్రపోయాను.

# 4

ఉదయం యెనిమిది గంటలకి నేను బయల్దేరుతుండగా ఫోను మ్రోగింది.

"హలో, సుందర్!" రాబర్టు అరిచాడు కంగారుగా.

"యస్, రాబర్టు?"

"కొంప మునిగింది! మీరు వెంటనే రండి!"

"ఏమిటి మీర నేది? ఏం జరిగింది?"

"ఆ అనాధ పారిపోయింది!"

"ఏమిటీ! యెందుకు పారిపోయింది?"

"ఫోన్ మీద చెప్పే విషయంకాదు, వెంటనే రండి!" ఫోన్ పెట్టేశాడతను.

నేను అయోమయంగా నిలబడ్డాను. శ్యామల వచ్చి, "ఏం జరిగింది?" అనడిగింది.

నేను ఫోన్ పెట్టేసి బయట పరిగాను—వెనుకనుంచి

అరుపులు విన్పిస్తోంటే....

బాస్ ఇంట్లో బైక్ దిగి లోపల దూరికాను. నీరజ యెదురుకాలేదు. పైకురికి ఆ గదిలో ప్రవేశించాను. వాళ్ళంతా కూర్చుని మాట్లాడుకుంటున్నారు. బాస్, శర్మ, రాబర్టు, నీరజ.

నన్ను చూసి నిశ్శబ్దమయిపోయారు. బాస్ నన్ను కూర్చోమన్నాడు.

"ఏం జరిగింది సర్?" అడిగాను అయోమయంగా.

బాస్ అన్నాడు నిదానంగా. "ఆ అమ్మాయి—ఆ అనాథ వెళ్ళిపోయింది సుందర్, నాతో చెప్పకుండానే. ప్చ్, కృతజ్ఞత లోపించింది లోకంలో."

"యెందుకు వెళ్ళిపోయింది, సర్?"

బాస్ రాబర్టుని చూసి చిటికవేశాడు.

రాబర్టు అరిచాడు ఆవేశంగా. "ఆ ఆడది ఒక దొంగ! హీన విలువల సెరజాణ! షీ ఈజె టార్ట్—"

బాస్ వారించాడు, "ఆవేశం వద్దు రాబర్టు, దూషణ వద్దు!"

"అయాం సారీ, సర్" నొచ్చుకున్నాడు రాబర్టు, "రాత్రి తొమ్మిది గంటలకే ఆమె నిద్రపోయింది, కదూ సిస్టర్?" నీరజ తలూపడంతో తిరిగి అన్నాడు, "బాస్ ప్రక్క గదినే ఆమెకు కేటాయించాం. ఆమె లోపల నుంచి గడియపెట్టుకుని పడుకుంది వంటరిగా. నేనిక్కడ అన్నీ సరిచూసుకుని, పదిగంటలకి విక్టర్, చంద్రన్‌లు డ్యూటీకి రావడంతో వెళ్ళిపోయాను. కానీ తెల్లారుతుండగానే వాళ్ళు కంగారుగా ఫోన్ చేసి పిల్చారు. నేను వెంటనే ఇక్కడకొచ్చి చూస్తే—నాకు మతిపోయింది!

"నీరజ ఏడు గంటలకి తలుపు కొడితే ఆమె

పలకలేదు. చాలాసేపు కొట్టి విరమించుకుంది. ఇంతలో బయట చంద్రన్ ఆమె గది కిటికీనుంచి ఏదో వ్రేలాడుతూండటం చూసి వెళ్ళాడట—అవి కిటికీ తెరలు. ఒకదానికొకటి ముడివేసి తాడులా చేసి దాని సహాయంతో-గాడ్! ఆమె ఆడదికాదు—

"చంద్రన్ అప్పుడు కేకలువేస్తూ పైకివెళ్ళి తలుపులు బద్దలుకొట్టి చూస్తే లోపల ఆమెలేదు! రాత్రి యెప్పుడో కిటికీలోంచి పారిపోయింది, గార్డ్సు కంటబడకుండా. వాళ్ళిద్దర్నీ వెంటనే డిస్మిస్ చేసి పంపించేశాను.

"అప్పటికింకా బాస్ లేవలేదు. నేను సాహసించి ఆయన గదిలోకి వెళ్ళి లేపాను. ఆయన బద్ధకంగా అగుపించారు. వంట్లో యెలాగో వుందన్నారు. ఆయన అంతసేపు యెప్పుడూ నిద్రపోలేదు. సుస్తీ చేసిందనుకొని వెంటనే డాక్టర్ని పిలవమని నీరజకు చెప్పాను. ఆమె అలా వెళ్ళిందో లేదో, నా దృష్టి బెడ్ ప్రక్కన దీనిమీద పడింది—ఈ కాటన్ వుండమీద—చూడండి, ఇది క్లోరోఫాంలో తడిపింది!"

చటుక్కున అందుకొని చూశాను. గుండె వేగంగా కొట్టుకుంది.

రాబర్టు అన్నాడు ఆవేశంగా. "ఆ బిచ్ బాస్ని దాంతో స్పృహ పోగొట్టి సేఫ్లోని డాసియర్ ఎత్తుకు పోయింది, సుందర్!"

అదిరిపడ్డాను, "యెవరి డాసియర్?" అరిచాను.

"నందకిషోర్ కాషిక్!"

"ఓ మై గాడ్!"

"అయోమయ మాటలతో నమ్మించింది, మొసలి కన్నీళ్ళతో వశపర్చుకుంది, చాలా తెలివిగా తన పని

కానిచ్చుకుంది—ఐ విల్ కిక్ హార్ టు డెత్!"

"శాంతించు, గాబర్టు" బాస్ మందలించాడు.

"సారీ సర్, ఇది పూర్తిగా నా అసమర్థతవల్లనే...."

బాస్ నాకేసి తిరిగాడు, "ఆ డాసియర్ చాలా ముఖ్యమైనది సుందర్. నీకు తెలిసివుండదు, కాషిక్ చరిత్రంతా అందులో వుంది. ఆ యువతి యెవరో మనకి తెలియదు. ఆడవాళ్ళ కన్నీళ్ళకి నేనిట్టే కరిగిపోతాను. అది నా బలహీనత. భగవంతుడు నాకు మెత్తని హృదయ మిచ్చాడు. కానీ యే కన్నీరూ ఇంతవరకు నన్నిలా మోసపుచ్చలేదు. అందుకే ఈ అమ్మాయి కన్నీటి మాటున కపట ఉద్దేశ్యం ఉంటుందనుకోలేదు. సుల భంగా ఫూల్ని చేసింది. నాకిప్పుడు ఆ డాసియర్తో పాటు ఆ అమ్మాయి కూడా కావాలి సుందర్."

"అలాగే, సర్! ఆమెని పట్టుకు తీర్తాను!"

"కానీ ఆమె యెవరసలు?" అన్నాడు శర్మ.

బాస్ అన్నాడు, "తనమీద మనం డాసియర్ సిద్ధం చేసినట్టు కాషిక్కి ఎలాగో తెలిసింది. తస్కరించడానికి ఈ అమ్మాయిని పంపాడు. కానీ ఈమె తెలుగు అమ్మాయి, ఇక్కడి నివాసి. కాషిక్ ఢిల్లీలో వుంటాడు. ఆమెకు అతనితో సంబంధాలెట్లా ఏర్పడ్డాయి? ఈమె ఢిల్లీలోనే వుంటుందా? లేక ఇక్కడ కాషిక్ మనుషుల తరఫున పనిచేస్తోందా?"

"ఇక్కడ కాషిక్ మనుషులున్నారా, సర్?"

"చెప్పలేం, అతనిది పెద్ద ఇల్లీగల్ ఆర్గనైజేషన్."

నీరజ గాభరాగా పరిగెత్తివచ్చింది. "సర్, ఢిల్లీ నుంచి టెలెక్స్!"

ఆమె వణుకుతున్న చేతులులో ఒక స్లిప్ని బాస్

కందించింది. అది చదివి ఆయన ముఖం కందిపోయింది! దాన్ని శర్మకిస్తూ, "ఢిల్లీ బ్యూరోకి కనెక్షన్, క్విక్!" అనుసరించాడు లేస్తూ. నీరజ విసురుగా పరుగుతీసింది.

స్లిప్ చదివిన శర్మ, "ఓహ్, గాడ్!" అన్నాడు.

దాన్ని నేను లాక్కుని చూశాను. నా వళ్ళు చల్లబడి పోయింది!

అందులో ఇలా వుంది.

Sivakumar shot dead last night-body found early morning—police moved in—office ran sacked—d. c. of d disappeared — instructions.

"దిసీజ్ టూ మచ్!" అరిచాడు రాబర్టు కూడా చదివి.

బాస్ ఒక్క ఉదటున కిటికీ దగ్గర కెళ్ళి బయటకు చూస్తూ ఆ షాక్‌ని సడలించుకున్నాడు.

మేం బొమ్మల్లా కూర్చుని వున్నాం.

బాస్ మా వైపు తిరిగి సిగర్ వెలిగించుకున్నాడు వణుకుతున్న చేతులతో.

"కుమార్ ....దట్ డామ్ లిటిల్ ఫూల్. ఆ డాసియర్ అందించినందుకు మనసారా అభినందించాలనుకున్నాను."

"క్రాషిక్‌ని సర్వనాశనం చెయ్యాలి సర్!" అన్నాడు రాబర్టు ఆవేశంగా.

నీరజ టెలిఫోన్‌తో ఉరికివచ్చింది. కార్డ్‌ని గదిలోని ఎక్స్‌టెన్షన్ సాకెట్‌లోకి పెట్టి, బాస్‌కి రిసీవర్ అందించి, "మిస్టర్ చోప్రా, సర్!" అంది.

బాస్ రిసీవరందుకొని, "ఎస్, చోప్రా?...." అన్నాడు.

రెండు నిముషాలు అవతలి మాటలు శ్రద్ధగా విని అప్పుడన్నాడు. "వెల్, అక్కడ కూడా డాసియర్‌ని కాజేశారన్నమాట, డూప్లికేట్ కాపీని. ఇక్కడా ఆ

డాసియర్ పోయింది, చోప్రా. ఇప్పుడు మర్డర్. ఈ మూడు పనులూ అతనివే—ఆ చీడపురుగు కౌశిక్! వెంటనే రంగంలోకి దూకండి, హంతకుడ్ని పట్టుకోండి! హంతకుడు పోలీసులకి చిక్కకూడదు ముందు—కౌశిక్ వెళ్ళి రక్షించుకుంటాడు పలుకుబడితో. అర్థమైందా? పోలీసులకంటే ముందు హంతకుడ్ని పట్టుకుని కౌశిక్ నేరాన్ని పలికించండి—కన్ఫెషన్ రికార్డుచేసి అప్పుడు అప్పగించండి పోలీసులకి. అంతవరకూ పోలీసులకి ఏ ఇన్ఫర్మేషన్ ఇవ్వకూడదు.... వెరీ వెల్, వెరీ గుడ్.... కుమార్ తల్లికి టెలిగ్రాం పంపండి, తర్వాత నేను వచ్చి కలుసుకుంటాను.... సుందర్ ఇప్పుడు బయల్దేరుతాడు."

రిసీవర్ని నీరజకిస్తూ, "ఢిల్లీ ఫ్లయిట్ ఎన్ని గంటలకి?" అన్నాడు బాస్.

"పదీ యాభైకి, సర్!"

"వెంటనే సుందర్కి టికెట్ బుక్ చెయ్!"

"అలాగే, సర్!" ఆమె పరుగుతీసింది.

నేను అయోమయంగా చూస్తున్నాను.

బాస్ అన్నాడు నా వైపు తిరిగి, "నువ్వెంటనే బయల్దేరు సుందర్, చోప్రాని కలుసుకో. అతనొక్కడే దీన్ని హేండిల్ చేయలేడు. దిలీప్ ఇంకా కొత్తవాడు. నువ్వెళ్ళి వాళ్ళ సహాయంతో హంతకుడ్ని ట్రేస్ చెయ్! పట్టుకుని కన్ఫెషన్ కక్కించు! కౌశిక్కి ఈ మర్డర్లో నుంచి తప్పించుకునే అవకాశాల్ని మృగ్యం చెయ్! రాబర్టు ఇక్కడ ఆ అమ్మాయిని ట్రేస్ చేస్తాడు, ఆ డాసియర్ ఇంకా కౌశిక్కి చేరివుండదు!"

## 5

మూడురోజుల క్రిందటి సంగతి — ఆఫీసుకు ఒక ఇన్సూర్ చేయబడ్డ పార్శిల్ అందింది ఢిల్లీ నుంచి. నేను ప్రక్కన వుండగా శర్మ దాన్ని విప్పి చూశాడు. అందులో, నీటుగా టైపు చేయబడ్డ 12 ఫూల్స్కేపు షీట్లు, ఒక కవరులో ఎనిమిది ఫోటో నెగెటివ్ లూ, వాటి పాజటివ్ ప్రింట్సూ వున్నాయి.

వాటితో జత చేసిన స్లిప్ మీద 'Complete Investigative Report on Mr. N.K.K.' అనివుంది.

శర్మ సంతోషంతో ఒక్క కేక వేసి, వాటిని తీసుకొని బాస్ దగ్గర కురికాడు.

అప్పుడా రిపోర్టు గురించి నాకేమీ తెలియదు. కానీ ఢిల్లీలో నందకిషోర్ కౌషిక్ అనబడే ఒక మల్టి మిలియనీర్ ని బ్లాక్ మార్కెటీర్ గా, డ్రగ్ ట్రాఫిక్కర్ గా స్లేవ్ ట్రేడర్ గా రాజకీయ పక్షాలు ఆరోపించడం తెలుసు. అతని ఆగడాలు మితిమీరి పోవడంతో మా బాస్ ఢిల్లీ బ్యూరో చీఫ్ రిపోర్టర్ ని సమగ్ర దర్యాప్తునకు ఆదేశించడం కూడా తెలుసు. చోప్రా తక్షణం తన స్టాఫ్ రిపోర్టర్ శివకుమార్ తో రంగంలో దూకడమూ తెలుసు—అంతే!

ఇప్పుడు డొసియర్ అందింది ఇలా....

తరువాత దాని గురించి శర్మని అడిగాను. అతను టూకీగా వివరాలు చెప్పాడు. కౌషిక్ మీద వున్న ఆరోపణలన్నీ రుజువయ్యే సాక్ష్యాధారాలన్నీ లభించాయి. ఢిల్లీలోని నిత్యావసర వస్తువుల మార్కెట్ చాలావరకు అతని హస్తాల్లోనే వుంది. వాటిని దొంగచాటుగా నిల్వచేసి బ్లాక్ చేసే గిడ్డంగుల సమాచారం లభించింది—

ఫోటోలతో సహా. నేపాల్ నుంచి భారీ ఎత్తున మత్తు ద్రవ్యాల్ని ఢిల్లీలో దిగుమతి చేసుకొని యువతని పాడుచేస్తూ తద్వారా లాభాలార్జిస్తున్న ప్రత్యక్ష నిదర్శనాలు కూడా లభించాయి. ఉద్యోగాల పేరిటి స్త్రీలను మోసపుచ్చి విదేశాలకి విక్రయించే అతని బోగస్ సంస్థ బండారం కూడా బైటపడింది.

అంతేగాక ఏఏ అధికారుల్ని తన ఏఏ బ్లాక్ మెయిల్ పద్ధతుల ద్వారా ఏ విధంగా లోబర్చుకున్నాడో—ఆ పురాణం కూడా వుంది.

అతని ఈ సంపూర్ణ రామాయణమంతా నెలాఖరు సంచికలో రావాలని నిశ్చయించాడు బాస్. ఆ పై వారంలో కాషిక్ దేశంలో ఘరానా నేరసుడిగా ముద్రపడి, అపఖ్యాతిపాలై జైలుకెళ్ళి ముఖం దాచుకుంటాడు.

ఈ రిపోర్టు వ్యవహారంలో చోప్రాది పైపై అజమాయిషీయే అయినా, పూర్తి లెగ్ వర్క్ చేసింది శివకుమారే. ఆ సమయంలో మరొక స్టాఫ్ రిపోర్టర్ దిలీప్ సెలవుమీద వున్నాడు. శివకుమార్ కు ఈ వ్యవహారంలో ప్రతి చిన్న అంశం క్షుణ్ణంగా తెలుసు. కాషిక్ మనుషుల్ని వాళ్ళతో పరిచయాన్ని, వాళ్ళ నెలవుల్ని అతను స్వయంగా దర్శించాడు. అదే ఇప్పుడు కాషిక్ కి తెలిసిపోయింది—తత్ఫలితమే శివకుమార్ హత్య. శివకుమార్ ని సమూలంగా అంతమొందించడమేగాక, తనకి ముప్పు తెచ్చే సాక్ష్యాధారాలైన అపత్రాల్ని సంగ్రహించాడు.

బాస్ ఈ దురాగతాన్ని ఎంత తీవ్రంగా పరిగణిస్తాడో నాకు తెలుసు. పత్రికా వ్యవహారాల్లో

క్యం—విలేఖరి హత్య—ఇవి రెండూ ప్రజల్లో ఎంత ఆగ్రహావేశాలు సృష్టిస్తాయో చెప్పనవసరంలేదు.

ఇప్పుడు బాస్ నన్ను ఢిల్లీ పంపుతున్నాడు. ఆయన ఒక కార్య భారాన్ని మా భుజస్కంధాలపై వేశాడంటే, తానాశించిన ఫలితాన్ని మేం ఇచ్చి తీరాల్సిందే!

నేను ఇంటికొచ్చాక నీరజ ఫోన్ చేసి టికెట్ బుక్ చేసినట్టూ, నేను వెళ్ళి బుకింగ్ తీసుకోవచ్చనీ చెప్పింది.

శ్యామల పెద్ద సూట్‌కేసు తీయబోతోంటే తిట్టి, చిన్న బ్రీఫ్‌కేసులో సామాను సర్దుకున్నాను. ఫ్లయిట్‌కి సుమారు గంట టైమువుంది. అశాంతిగా పచార్లు చేస్తూ కాలం గడుపుతున్నాను. అప్పుడు అకస్మాత్తుగా ఫోను మ్రోగింది....

వెళ్ళి రిసీవరెత్తాను. "మిస్టర్ సుందర్?" అడిగింది అవతలి కంఠం.

"యస్, సుందర్ హియర్" అన్నాను అతనెవరో అర్థంగాక.

"సుందర్, నా హెచ్చరిక పాటించు. ఢిల్లీ వెళ్ళకు!"

కలవరపడ్డాను. "హలో, ఎవర్నువ్వు?" అన్నాను తీవ్రంగా.

"నువ్వు ఢిల్లీ వెళ్ళకు సుందర్! చింతిస్తావు."

"ఓ.కే. థాంక్యూ" అతనితో కాలం వృధాచేయ దల్చుకోలేదు. డిస్కనెక్టుచేసి బాస్ ఇంటికి ఫోన్ చేశాను. నీరజ పలికింది.

"నీరజ! నా మాటలు జాగ్రత్త వినండి. శత్రువులు మన మాటలు వింటున్నారు. అక్కడి బాస్ ఇంటిని బగ్గింగ్ చేసి వుంటారు. ఫోన్నని టాప్ చేసి వుంటారు.

వాటిని కనుక్కునేంతవరకూ జాగ్రత్తగా మసలుకోండి. వాటిని తొలగించి రాబర్టుని ఫోన్ చెయ్యమనండి నాకు, క్విక్!"

సరిగ్గా ఏడు నిముషాలకి రాబర్టు ఫోన్ చేశాడు.

"సుందర్, మీరన్నట్టు ఇక్కడ నిజంగానే బగ్గింగ్ చేశారు!"

"తొలగించారా?"

"డిటెక్టర్‌తో వాటిని పీకి చితగ్గొట్టాను!"

"గుడ్! రాత్రి ఆ యువతి అమర్చి వుంటుంది. మన మాటలన్నీ విన్నారు ఉదయం. నా ప్రయాణం సంగతి వాళ్ళకి తెలిసిపోయింది. ఫోన్ చేసి మానుకో అన్నాడు ఇందాక. నన్ను ఏర్‌పోర్టుకి వెంటాడవచ్చు. మీరు వెంటనే కారేసుకొని వస్తారా, నాతో ప్రయాణిస్తే వాళ్ళ లీడ్ దొరుకుతుంది?"

"అలాగే, సుందర్ వెంటనే వస్తాను."

"నాకు రివాల్వర్ అవసరం ఇప్పుడు. కానీ విమానంలో వీలుకాదు. నీరజకు చెప్పండి, చోప్రాకు ఫోన్ చేసి రివాల్వర్‌తో అతన్ని అక్కడ ఏర్‌పోర్టు దగ్గర వుండమని!"

"అలాగే, సుందర్. కానీ ఇక్కడ మీ మిసెస్‌ని.... ఒంటరిగా...."

"బందోబస్తు చేద్దాం!" అని ఫోన్ పెట్టేశాను.

"ఎవరికి బందోబస్తు చేస్తున్నారు?" వచ్చి అడిగింది శ్యామల.

"శ్యామలాదేవికి, సోమసుందర్ అర్ధాంగి....."

"ఏం చేసిందామె?"

"శాంతిభద్రతలకి ముప్పుగా ప్రవర్తించింది."

ఆమెని పట్టి గాఢంగా చుంబించి వదిలాను.

సరిగ్గా పన్నెండు నిముషాల్లో రాబర్టు ఇంట్లోకొచ్చి వాలాడు.

"ఓ. కే?" అన్నాను.

"ఓ. కే!" రాబర్టు అన్నాడు, "ఇక్కడ నా మనుషుల్ని పెట్టించనా?"

"ఇక్కడ మనుషులెందుకు?" అడిగింది శ్యామల.

"నీకు రక్షణగా, పరిసితి బాగాలేదు" అన్నాను.

"అయితే నేనిక్కడ వుండను!" అందామె చటుక్కున.

"మీ తాత దగ్గరికి వెళ్ళిపోతావా?"

తలూపిందామె వెంటనే.

"గుడ్ రాబర్టు, ఆమె ప్రయాణం చూడండి!"

"అలాగే! కమాన్ సిస్టర్, హారియప్! బట్టలు సర్దుకోండి!"

ఆమె కంగారుగా పరుగెత్తింది.

పదినిముషాల్లో మేం బయటకొచ్చి ఇంటికి తాళం వేశాం. కారెక్కి కూర్చున్నాం.

రాబర్టు స్టార్టుచేశాడు. నేనతనిప్రక్కన కూర్చున్నాను. శ్యామల వెనుక సీట్లో కూర్చుంది. రాబర్టు తాపీగా డ్రైవ్ చేస్తున్నాడు, డ్రైవింగ్ మిర్రర్‌లో అప్పుడప్పుడు దృష్టి నిలుపుతూ. వెనుక చాలా వాహనాలున్నాయి. కానీ ఏదీ అనుమానాస్పదంగా లేదు. వెంటాడే శాల్తీని (అది మనిషయినా, వాహనమయినా) అతను ఇట్టే పసిగట్టేస్తాడు, దాని గమనాన్ని బట్టి. ఇప్పుడెవరూ వెంటాడ్డంలేదని తేల్చేశాడు. అయితే ఏర్‌పోర్టులో వేచి వుండొచ్చు, నా ఆగమనం కోసం.

పార్కింగ్ ప్లేస్‌లో కారు దిగి, కంటి చివరలనుండి చుట్టూ దృష్టిని సారిస్తూ, రిసెప్షన్ లాంజ్‌లోకి అడుగు పెట్టాం. హడావుడిగా వుంది. ఎవరు ప్రత్యర్థో పోల్చుకోలేక పోయాం ఆ జన సందోహంలో. స్పీకర్‌లో అనౌన్స్‌మెంట్ ఇంతలో: ఢిల్లీ ఫ్లయిట్ ప్రయాణానికి సిద్ధం! కంగారుగా బుక్కింగ్‌ని సమీపించాను. పేరు చెప్పి ఎనిమిదివందల చిల్లర నగదు చెల్లించి, టిక్కెట్ తీసుకున్నాను—హడావుడిగా సెక్యూరిటీ చెకప్ ముగించుకుంటుంటే రాబర్టు వచ్చి చెవిలో వూదాడు చిన్నగా.

"సారీ, మన ఫ్రెండ్స్ ఎవరూ లేరిక్కడ. అక్కడ హంతకుడికి వార్త అందించి వుంటారు, మీ కోసం అక్కడ కాచుకునుంటాడు. ఏర్‌పోర్టు దగ్గర."

సాలోచనగా తలూపాను.

"మీరక్కడ జాగ్రత్త!" అన్నాడు రాబర్టు మళ్ళీ.

"ఒకవేళ ఈ ఫ్లయిట్‌లోనే ఎదురు చూస్తున్నాడేమో?"

రాబర్టు ఉలిక్కిపడ్డాడు, "పాసిబుల్."

శ్యామల చటుక్కున నా చెయ్యి పట్టుకుంది. ఆమె కళ్ళనిండా భయం!

"డోంట్ వర్రీ. క్షేమంగానే వస్తాను. వచ్చాక నీకు ఫోన్ చేస్తాను, నిశ్చింతగా నువ్వు మీ వూరెళ్ళిపో!"

ఆమె చేతిని నిమురుతూ తప్పించి, చటుక్కున కదిలిపోయాను.

## 6

పాలెం విమానాశ్రయం రిసెప్షన్ లాంజ్‌లో నన్ను చూసి వాళ్ళిద్దరు వేగంగా సమీపించారు: చోప్రా, దిలీప్‌లు. షేక్‌హాండ్స్ ఇచ్చాను. చోప్రా వయసు

యాశై వుంటుంది, దిలీప్ కి ముప్పై. ఇద్దరి ముఖాల్లో విషాదం గోచరిస్తోంది. హడావుడిగా నన్ను తీసుకొని బయటకు వెళ్ళి కారెక్కించారు.

"సుందర్, ఈ రివాల్వర్ వుంచండి" అన్నాడు చోప్రా.

దాన్ని తీసుకుని జేబులో తోశాను. దిలీప్ కారు స్టార్టుచేశాడు. "మిస్టర్ చోప్రా, హంతకుడు మనల్ని కనిపెడుతూండాలి. నాకు హెచ్చరిక అందింది" అన్నాను.

"కనిపెట్టనివ్వండి! వాడెవడో తెలిస్తే, పోల్చుకుంటే, ఇదుగో ఈ రివాల్వర్ తీసి కాల్చేస్తాను అక్కడికక్కడే!"

నవ్వాను. "అతన్ని చంపమనికాదు ఆదేశం, మిస్టర్ చోప్రా. పట్టుకొని కన్ ఫెషన్ కక్కించమని. కాపికొని కటకటాల వెనక్కి పంపించమని!"

చోప్రా తలూపాడు. "నాకు తెలుసు, సుందర్."

"కుమార్ చావు మిమ్మల్ని బాధిస్తూండాలి."

"ఎవరిని బాధించదు? ఆ పూర్ ఫెలో తన విధేయతను ప్రకటించుకోవడానికి ఎంత తాపత్రయపడేవాడు! నన్ను గురువుగా పూజించేవాడు."

"అతని తల్లికి టెలిగ్రాం పంపారా?"

"పంపాను. పూర్ మదర్ .... ఈ శోకం తీరేదికాదు, సుందర్."

పది నిముషాలు నిశ్శబ్దంగా ప్రయాణించాం. కారు ఇప్పుడు క్రెసెంట్ రోడ్ లో వురుకుతోంది.... ట్రాఫిక్ ఎక్కువ లేదు, ఇరు ప్రక్కలా షాపుల్లో జనసందోహంగా వుంది కానీ. దిలీప్ ఓ కన్ను డ్రైవింగ్ మిర్రర్

మీద వుంచి నడుపుతున్నాడు. అక్కడక్కడా అక స్మాత్తుగా వేగం తగ్గిస్తూ, అనుమానం తీర్చుకుంటూ, చకచకా డ్రైవ్ చేసుకు పోతున్నాడు. అనేకసార్లు వెనక్కి చూసిన నాకూ ఏ వాహనమూ అనుమానా స్పదంగా తోచలేదు. మా వెనుక కారులోనే ఓ సరదా పురుషుడైన సర్దార్జీ కుటుంబ సమేతంగా ఎక్కడికో ప్రయాణమయ్యాడు. అతని కారులో నిండుగా తలలుండటంవలన ఆ వెనుక వాహనాల సంగతి తెలీడం లేదు.

దానికి తోడుగా, ముందు సీట్లో ఐస్‌క్రీమ్ తింటోన్న అంబులెన్స్ సైజు సర్దార్జీ భార్య ఉండుండి ఫెళ్ళున క్లోజప్ లో భీకరంగా నవ్వుతోంటే, కళ్ళు గుర్లొప్పడిచి వెనక చూసే సాహసం కలగటంలేదు.

దాదాపు సగం ప్రయాణమంతా ఆమె అలాగే రాజ్యమేలుతూ వచ్చింది.

కన్నాట్ సర్కస్ దాటి జనపథ్‌లోని ఆఫీస్ కాంప్లెక్స్ చేరేవరకూ మమ్మల్ని ఎవరైనా వెంటాడారో లేదో ఇదమిద్ధంగా తేల్చుకోలేక పోయాం.

"వెల్, లెటజ్ ఫర్గెట్" అన్నాడు చోప్రా.

ముగ్గురమూ కారుదిగి బిల్డింగ్ లోకి నడిచాం. లిఫ్ట్‌లో తొమ్మిదో అంతస్తులోని మా ఆఫీసు గదికి చేరుకున్నాం. దిలీప్ తాళంతీసి ఆహ్వానించాడు.

లోపలికెళ్ళి చుట్టూ చూశాను. చోప్రా తన స్థానంలో కూర్చుంటూ మమ్మల్ని కూర్చోమన్నాడు. మేమిద్దరం అతనికి ఎదురుగా కూర్చున్నాం.

"జరిగిన ఘటనకి బాస్ మా మీద ఆగ్రహం చెందారనుకుంటాను" అన్నాడతను.

"లేదు, మీమీద ఆగ్రహించలేదు. దుర్ఘటన అక్కడా జరిగింది."

"అక్కడ డాసియర్ ఎలా పోయింది?"

క్లుప్తంగా వివరించాను. అతను నిట్టూర్చాడు.

"క్లాసిక్ పకడ్బందీగా జరిపించాడు.... రాత్రి ఆఫీసులోకి ప్రవేశించి డూప్లికేట్ కాపీ తస్కరించారు."

"కుమార్ని ఎలా షూట్ చేశారు?"

"తెలీదు, ఎవరూ చూడలేదు. కానీ హత్య అతని ఫ్లాట్లోనే జరిగింది. షాట్ ప్రక్క ఫ్లాట్స్లో ఎవరికీ విన్పించలేదు. సైలెన్సర్ అమర్చివుండాలి. కంఠంలోకి షూట్ చేశాడు. రాత్రి ఒకటీ—రెండు గంటల మధ్య జరిగుండాలని పోలీసులు...."

"ఆ సమయంలో హంతకుడి రాకపోకలు ఎవరూ చూడలేదా, జానిటర్ కూడా?"

"ఎవరూ చూడలేదు. జానిటర్ లేడు, అదొక థర్డ్ గ్రేడ్ అపార్టుమెంట్."

హఠాత్తుగా ఫోన్ మ్రోగడంతో చోప్రా ఎత్తి, విని, నా కందించాడు!

"మిస్టర్ సుందర్?" అంది అవతలి గొంతు.

నిటారుగా కూర్చున్నాను. "యస్, నువ్వెవరు?"

"సుందర్, నువ్వెంటనే వెళ్ళిపో! ఇక్కడి నీళ్ళు పడవు."

"తమరి నామధేయం?"

"నువ్వెంటనే వెళ్ళిపో, సుందర్! ఇక్కడి నీళ్ళు నీకు పడవు!"

"అలాగే, ఆలోచిస్తాను" ఫోన్ పెట్టేసి చోప్రా వైపు తిరిగాను, "ఇది కొత్త గొంతు. హైద్రాబాదులో

విన్నది కాదు. కనుక నన్నెవరూ వెంటాడి రాలేదు. ఇక్కడ వాళ్ళ మనిషికి నా రాక సమాచారం అందింది. ఇతను కూడా తెలుగులో బెదిరించాడు. కౌషిక్ మనుషుల్లో తెలుగువాళ్ళున్నారా?"

"తెలుగువాళ్ళా.... లేరు. అతని మనుషుల్లో తెలుగు వాళ్ళుగానీ, ఆ భాష వచ్చినవాళ్ళుగానీ లేరు. అంతా నార్త్ ఇండియన్స్. వాళ్ళెవరూ ఆయుధాలు ధరించిగానీ, దొమ్మీల్లో పాల్గొనిగానీ. లేరు—ఒక్క బిల్లూ తప్ప."

"అత నెవరు?"

"కౌషిక్ బాడీగార్డు, మహా కిరాతకుడు."

"అలాగా .... అయితే ఈ సుమిత్ర ఎవరు? హైద్రాబాదులో నన్ను బెదిరించిందెవరు? ఇప్పుడు హెచ్చరించిన మనిషెవరు? వీళ్ళంతా తెలుగువాళ్ళే..."

"సింపుల్! కౌషిక్ హైద్రాబాదులో ఏదో ముఠా సహాయం కోరివుంటాడు, అక్కడి డాసియర్ని తస్కరించడానికి. అక్కడ మీకు తెలిసిన ముఠాలు లేవా?"

"ఇంతగా తెగించగల ముఠా....ఓహ్, వుంది!"

"ఏది?"

"మొకాసిన్ గ్యాంగ్!"

"మొకాసిన్ గ్యాంగ్?"

"అవును, వాళ్ళు హైద్రాబాద్ హెడ్క్వార్టర్స్గా దేశవ్యాప్తంగా ఆపరేట్ చేస్తున్నారు .... ఇది వీళ్ళ పనే!"

కిటికీ అద్దం చిటుక్కున విచ్చుకొని, నా చెవి ప్రక్క నుంచి తుమ్మెదలా ఝుంకారం చేస్తూ వెళ్ళి బుల్లెట్, ఎదురుగోడకున్న కేలెండర్లోకి చొచ్చుకుపోయింది. కాగితాలు కాలి చివ్వున పొగ వచ్చింది!

మేం తటాలున ప్రక్కకు దూకేశాం నేలమీద. మరో బుల్లెట్ రాలేదు. చోప్రా కిటికీ దగ్గరకు దూకి అవతలకి చూశాడు. మరుక్షణం అరుస్తూ పరుగుతీశాడు, "కమాన్! ఎదురు బిల్డింగ్ లోకి!"

మేం కూడా లేచి పరుగుతీశాం. కారిడార్ లోనుంచి లిఫ్ట్ లో దూరం. కిందకు చేరుకొని రోడ్డుమీద పడిగెత్తాం. ట్రాఫిక్ కి భయపడకుండా చాకచక్యంగా తప్పించుకొని రోడ్డవతల పడ్డాం. బిల్డింగ్ లోకి జొరబడి రిసెప్షన్ దగ్గర ఆగాం. అప్పుడే ఎదురయ్యాడు మాకు—బ్రౌన్ కలర్ జీన్స్ లో వున్న ఒక నల్లటి యువకుడు. మమ్మల్ని చూస్తూనే మాకంటే ముందు రియాక్టు అయి, మెరుపు వేగంతో మూడు దెబ్బలు మాకు వడ్డించి క్షణకాలంలో అదృశ్యమయ్యాడు.

నేనూ దిలీప్ తత్తరబోయి తేరుకునేంతలో చోప్రా అరుచుకుంటూ బయటకు పరుగుతీశాడు. మేం అతని వెనుక ఉరికాం, రివాల్వర్ పట్టుకొని. అప్పుడే రోడ్డువారగా ఆగివున్న ఒక పాత పసుపురంగు ఫియట్ కారు స్టార్టయి దూసుకుపోతోంది. చోప్రా ఆగిపోయి గురిచూసి దాని దిశలో కాల్చాడు. పెద్ద ప్రేలుడు సంభవించి హాహాకారాలు చెలరేగాయి. జనం పిచ్చిగా పారిపోతున్నారు. ఆ కారు ఇంకా వేగం పెరిగి క్షణంలో కనుమరుగైంది— దిలీప్ వెనుదిరిగి బిల్డింగ్ లోకి పరుగుతీశాడు. చోప్రా మరోసారి వెర్రి ఆవేశంతో కాల్చబోతే రివాల్వర్ లాక్కుని వారించాను. "తెలివిలోకి రండి! పబ్లిక్ మర్డర్ చేస్తారు!"

ట్రాఫిక్ పోలీసులువచ్చి అతన్ని చుట్టుముట్టారు. నేను నెమ్మదిగా జారుకొని బిల్డింగ్ లోకి వెళ్ళిపోయాను.

రిసెప్షన్‌లో దిలీప్ ఫోన్‌లో మాట్లాడుతున్నాడు. మధ్య కాసేపు ఆగడంతో, "ఎవరికి ఫోన్?" అన్నాను.

"లైసెన్సింగ్ అథారిటీకి! ఆ కారు నెంబర్ నేను చూశాను——" అన్నాడతను. తర్వాత అవతలి మాటలు విని థాంక్స్ చెప్పి సీవర్ పెట్టేశాడు.

"లెటజ్ గో! భారత్ గ్యారేజికి, షాదారాలో!"

మేం బయటికి వచ్చేసరికి చోప్రా పోలీసుల్ని వదిలించుకుని దిక్కులు చూస్తున్నాడు. జనం ఇంకా అతన్ని సమీపించడానికి జంకుతున్నారు. దిలీప్ అతనికి విషయం చెప్పాడు. తిరిగి మేం రోడ్డుమీదనుంచి మా ఆఫీసు కాంప్లెక్స్‌లో కరికి కారెక్కాం. శరవేగంతో షాదారా వైపు దూసుకుపోయాం.

'భారత్ గ్యారేజి' షాదారాలోని పాత లొకాలిటీలో వుంది. మేం కారు దిగిన వెంటనే నల్గురు గ్యారేజి పన్రాళ్ళు వేగంగా చుట్టుముట్టి కారుని పరీక్షించడం మొదలుపెట్టారు. ప్రొప్రయిటర్ నవ్వుతూ బయటికొచ్చి మాతో కరచాలనం చేశాడు. చోప్రా విషయం చెప్పేసరికి అతని ముఖం బిగుసుకుపోయింది.

"కమాన్! ఆ కారెవరిది?" రెట్టించాడు చోప్రా.

"మాదే——కానీ మీ రెవరు?"

"ఆ కారెక్కడ వుంది? కమాన్!"

"అదెకు పోయింది, కానీ మీరు...."

"ఎవరికిచ్చారు? ఎప్పుడు?"

"ఈ ఉదయం. అతను ప్రెసిడెంట్ లాడ్జి అడ్రెసు ఇచ్చాడు, చాందినీచౌక్‌లో. అతని పేరు ప్రకాష్."

"చూండూ, ఇది ఖూనీకేసు" చోప్రా అన్నాడు హెచ్చరిస్తూ, "ప్రకాష్ మాకు కావాలి. ట్రిక్స్ చేశా

వంటే జైల్లో వుంటావు. ఫోన్ చేసి ప్రకాష్‌ని హెచ్చరించేవు, జాగ్రత్త!" దిలీప్ వైపు తిరిగి అన్నాడు మళ్ళీ, "నువిక్కడే వుండు. ఇతను ఎవరికీ ఫోన్ చెయ్యకుండా చూడు. ప్రకాష్ వస్తే ఏదో మిషతో నిర్బంధిస్తాడు ఈ సచ్చాసింగ్. మేం అరగంటలో తిరిగి వస్తాం, ఏం సచ్చాసింగ్?"

"నా పేరు సచ్చాసింగ్ కాదు."

"కానీ నువ్వు సత్యమే పలకాలి!" అన్నాడు చోప్రా కారు దగ్గరికి నడుస్తూ, "కమాన్, సుందర్, ప్రెసిడెంట్ లాడ్జ్!"

ప్రెసిడెంట్ లాడ్జి చాందినీచౌక్‌లోని ఒక ఇరుకు ఏరియాలో వుంది. సిక్లాస్ లాడ్జి, ఆవరణలో కారు దిగి ఆతృతగా చూశాం అక్కడ ఆగివున్న కార్లని. చోప్రా నా వీపు తడుతూ రెండు అంబాసిడర్ కార్ల మధ్య ఫియట్ కారుని చూపాడు. పసుపు రంగులో వుంది, దిలీప్ చెప్పిన నెంబర్‌తో.

"కమాన్, మన ఫ్రెండ్ ఇక్కడే వున్నాడు!" చోప్రా లోపలికి దారితీశాడు. నేను వెంబడించాను కంగారుగా.

చోప్రా కౌంటర్ దగ్గర ఆగి, "ప్రకాష్!" అన్నాడు.

"ఏ ప్రకాష్?" అడిగాడు కౌంటర్‌లోని వ్యక్తి.

"ఎందరు ప్రకాష్‌లున్నారు మీ కొంపలో?"

"ఒక్కడే!"

"అతడే!"

"రూం 24, ఉన్నాడు పొండి!"

చకచకా మెట్లెక్కి అయిదో అంతస్తులోకి చేరుకున్నాం. నడవలోకి నడిచి ఆ నెంబర్ గదిముందాగాం.

లోపల ఫ్యాను తిరుగుతోన్న చప్పుడవుతోంది. మరే అలికిడీ లేదు. చోప్రా కీ హోల్ లోంచి చూసి, చిటికె వేస్తూ చటుక్కున దూరంగా కదిలి వెళ్ళిపోయాడు. అతని వెనుక నేనూ వెళ్ళాను. ఇంతలో ఆరవ అంతస్తు నుంచి దిగుతూ కన్పించాడు రూం బాయ్.

"స్సో, చత్తారాం, కాస్త ఆగు" పిలిచాడు చోప్రా, అతన్ని సమీపిస్తూ.

అతను ఆగి చూశాడు, "నా పేరు సియారాం, సాబ్."

"చూడు సియారాం, 24లో కస్టమర్ లేడా?"

"ఉన్నాడు సాబ్."

"మరి పలకదేమిటి?"

"పిలవమంటారా, సాబ్?"

"నువ్వు పిలువ్, కానీ మేం వచ్చినట్టు చెప్పకు."

"మీరెవరు సాబ్?"

"అనవసరం! అర్థమైందా? ఈ నోటు నీది!"

రూం బాయ్ పదిరూపాయలనోటు కళ్ళజూడటంతో బుల్ డాగ్ అయిపోయాడు. విశ్వాసంతో ముందుకు నడిచి, ఛాతీ విరుచుకొని 24 బెల్ నొక్కాడు. మేం ఎడమవైపు గోడకానుకుని నిలబడ్డాం. బాయ్ మళ్ళీ నొక్కి పిల్చాడు, "సాబ్, తలుపు తీయండి. గది ఊడ్వాలి."

"పొద్దున్నే కదా ఊడ్చావు?" అంది లోపలి గొంతు.

"రెండు పూటలా ఊడుస్తాం సాబ్, మా సేఠ్ పెట్టే తిండితో సమానంగా."

చటుక్కున హేండిల్ తిరిగి తలుపు రెక్క సగం తెరుచుకుంది. ఒక యువకుడి తల బయటికొచ్చింది.

"మరి చీపురేది, బద్మాష్?" అన్నాడతను చీదరింపుగా.

"ఇక్కడ వుంది!" చోప్రా గభాల్న తలుపుని ఢీకొని, పిడికిలితో అతని ముఖాన్ని బద్దలు చేస్తూ గదిలోకి వెల్లకిలా పడేసి జొరబడ్డాడు.

నేను తటాలున దూకి ఆ యువకుడి జేబులు తడిమి రివాల్వర్ తీసేసుకున్నాను. సైలెన్సర్ అమర్చిన రివాల్వర్. అతను తేరుకొని బిత్తర చూపులు చూస్తున్నాడు.

చోప్రా రెండంగల్లో అతన్ని సమీపించి మెడపట్టి లేపి దవడకింద కొట్టాడు, "కన్ఫెషన్!"

"ఎవరు మీరు!" అరిచాడా యువకుడు ఉక్కిరి బిక్కిరవుతూ.

"నీకు తెలుసు!" చోప్రా పిడికిలి అతని ముఖంమీద చోటు చేసుకుంది, "కమాన్, కన్ఫెషన్!"

ఆ యువకుడు బాధ తట్టుకోలేక కేకపెట్టాడు. అది చూసి రూం బాయ్ పారిపోయాడు. వెంటనే తలుపు మూశాను.

చోప్రా ఆవేశంతో ఆ యువకుడి మెడపట్టి బెడ్ మీదకు తోశాడు. ఒక్క అంగలో వెళ్ళి, అతని జుట్టులోకి వేళ్ళు పోనిచ్చి, పట్టి లాగుతూ తల పైకెత్తాడు. "చెప్పు! నువ్వెవరి మనిషివి?"

"నా పేరు—ప్రకాష్."

"ఎవరి మనిషివి?"

"నేనెవర్నీ చంపలేదు."

"రాత్రి మా మనిషిని చంపావు. ఇందాక మామీద హత్యా ప్రయత్నం చేశావు."

"నేనేమీ చేయలేదు."

చోప్రా అతని చెంప ఛెళ్ళుమనిపించాడు.

"నువ్వీక తప్పించుకోలేవు, ఫూల్! నిన్నెవరు పంపారు చెప్పు!"

"నే నే వచ్చాను!"

"కాషిక్ పంపాడా?"

"నే నే వచ్చాను!"

"మొకాసిన్ గ్యాంగ్ పంపిందా?"

"నే నే వచ్చాను!"

"నువ్వెలా వచ్చావు, నూవర్ కే బచ్చే!"

చోప్రా అతని మెడవంచి వీపుమీద బాదాడు.

"ఆగండి! నన్ను వదిలేయండి! చెబితే వాళ్ళు నన్ను బ్రతకనివ్వరు."

"ఎవరు వాళ్ళు? నువ్వెవరి తరఫున వచ్చావు?"

"అది—మీరు—నన్ను—"

"సుందర్! కాల్ ది పోలీస్!" చోప్రా అరిచాడు అసహనంగా.

"మీ మనిషిని చంపింది నేనే! కానీ పట్టుబడను—పట్టుబడకూడదు—"

బలాన్నంతా కూడదీసుకుని ఒక్క తోపుతో చోప్రాని దూరంగా నెట్టేశాడు ప్రకాష్-అదే ఊపుతో మెరుపులా వెళ్ళి ఎత్తయిన కిటికీ అద్దాన్ని ఢీకొని దాన్ని పగులగొట్టుకుంటూ బయటకు దూసుకుపోయి, క్షణకాలం గాల్లో అలా తేలి, టప్పున రాలిపోయాడు కొబ్బరికాయలా.

క్రింద హఠాత్తుగా కేకలు వెలువడ్డాయి.

7

ఒక పబ్లిక్ కాల్ బూత్‌లో కెళ్ళి అరంకెల నెంబర్

తిప్పాను. వెంటనే రిసెప్షన్స్ వచ్చింది, "యస్, మిస్టర్ కౌశిక్స్ రెసిడెన్స్" అంది ఒక ఆడగొంతు.

"కౌశిక్‌ని కలవాలి." అన్నాడు.

"మీ పేరు?"

"సోమసుందర్."

"అపాయింట్ మెంట్ వుందా?"

"అక్కర్లేదు, క్రైమ్ రిపోర్టర్‌నని చెప్పండి, అర్థం చేసుకుంటారు."

"దేనికి?"

"బ్లేడ్ వీక్లీకి."

"జస్ట్ మినిట్...." కొన్ని క్షణాల తర్వాత అందామె, "మీరు వెంటనే రావచ్చు."

"థాంక్యూ వెరీ మచ్!" ఫోన్ పెట్టేసి బయట కొచ్చాను.

టాక్సీ ఎక్కి చాణక్యపురి పోనివ్వమన్నాను. అది పరిగెడుతోంటే విశ్రాంతిగా వెనక్కి వాలి కళ్ళు మూసుకున్నాను. ఈ ప్రకాష్ చావు వ్యవహారాన్ని పూర్తిగా అప్‌సెట్ చేసింది! అతన్నుంచి వాఙ్మూలం రాబట్టలేకపోయాం. అనూహ్యంగా ఆత్మాహుతి చేసుకున్నాడు. దీన్నిబట్టి అతను మొకాసిన్ గ్యాంగ్ మనిషని స్పష్టమవుతోంది.... ఇది వాళ్ళ సాంప్రదాయమే. పట్టుబడితే నోరు మెదపకుండా ఆత్మాహుతి గావించుకుంటారు. గ్యాంగ్ మనుగడని కాపాడుకుంటారు. దానిపట్ల తమ విధేయతని చివరివరకూ నిలుపుకుంటారు.

సరిగ్గా సంవత్సరం క్రితం ఈ గ్యాంగ్ కలాపాలు ప్రారంభమయ్యాయి. దీని నాయకుడెవరో తెలియదు. దీని హెడ్‌క్వార్టర్స్ హైద్రాబాద్ అని తెలిసినా ఆ

స్థావరం ఎక్కడో ఇంతవరకు తెలుసుకోలేక పోయారు. దేశవ్యాప్తంగా ఈ గ్యాంగ్ మనుషులు పర్యటిస్తూంటారు, క్లయంట్స్‌నుంచి వివిధ కాంట్రాక్టులు పొంది. దొంగతనాలూ, దోపిడీలూ, రాని బాకీ వసూలు, ప్రత్యర్థుల వళ్ళు మరమ్మత్తూ, ఫోర్జరీలూ, కిడ్నాపింగ్, చివరికి హత్యలవరకూ.... వీళ్ళు చేపడతారు.

తమ ఉనికిని ఎంతో రహస్యంగా కాపాడుకుంటారు. ఎక్కడా ఆధారాలు వదలకుండా జాగ్రత్తపడతారు. ఒకవేళ ఏమరుపాటుగా పట్టుబడితే పోలీసులకు ఎటువంటి సమాచారం ఇచ్చి సహకరించరు. తమ ఆచారం ప్రకారం ఆత్మాహుతి చేసుకుంటారు. అలా ఆత్మాహుతి చేసుకుంటే ఆ చావుకి కారకులైన వారిమీద పగతీర్చుకోకుండా వూరుకోదు గ్యాంగ్. ఈ సంవత్సర కాలంలో ఇలాంటి చావులు మూడు సంభవించాయి హైద్రాబాదులో. అయిదుగురు పోలీసు అధికారులు కాల్చివేయబడ్డారు ప్రతీకార చర్యగా.

ఇప్పుడు ప్రకాష్ చావు.

ప్రతీకారంగా ఎవర్ని చంపుతారు?

ఉలిక్కిపడ్డాను. నన్నా? అవును, వాళ్ళ హెచ్చరిక పెడచెవిని పెట్టి నేనిలా వచ్చాను. పర్యవసానమే ఈ చావు అని భావిస్తారు. కానీ ప్రత్యక్ష కారకుడ్ని నేను కానేమో? ఇది వాళ్ళు ఆలోచిస్తారా? లేక గుడ్డిగా నన్నే అనుకుని లేపేస్తారా? వాళ్ళ తీర్పు ఏమిటో వేచి చూడాలి. అయితే ముందు చోప్రాని హెచ్చరించాలి.

చోప్రా ఆ లాడ్జింగ్‌లో పోలీసులతో వ్యవహారం ముగించుకొని ఆఫీసుకి వెళ్లానన్నాడు. ఫోన్ చేసి గ్యారేజి దగ్గర్నుంచి దిలీప్‌ని రప్పించుకున్నాడు. నేను కాషిక్‌ని

కలుసుకుంటానని అడ్రసు తీసుకొని బయల్దేరాను. పోలీసులకి సంబంధించినంత వరకూ శివకుమార్ హత్య పరిష్కారమైంది—ప్రకాష్ చావుతో, అతని దగ్గర రివాల్వర్ తో. కానీ మాకు సంబంధించి ఈ వ్యవహారం ముగియలేదు. అసలు హంతకులు వేరే వున్నారు. వాళ్ళని నిర్మూలించాలి.

టాక్సీ ఆగడంతో తేరుకుని చూశాను. చెప్పిన అడ్రసుకి చేర్చాడు డ్రైవర్. దిగి ఫేర్ చెల్లించి పంపేశాను. ఆ గేటు దగ్గరకి నడిచి గూర్ఖాకి నా పేరు వివరాలూ చెప్పాను. అతను బూత్ లోకి వెళ్ళి ఫోన్ చేసివచ్చి గేటు తెరిచాడు. తిన్నగా లోపలికి నడిచాను. చుట్టూ ఎత్తయిన కాంపౌండు వుంది. దూరంగా భవంతి కన్పిస్తోంది—పైసగభాగం. క్రింది భాగాన్ని దాని ఎదురుగా పెంచిన దట్టమైన వృక్షాలు కప్పివేశాయి.

సుమారు వంద గజాల బాట నడిచి పోర్టికోలో చేరుకున్నాను. వరండాలో ఓ పంజాబీ యువతి ఎదురు చూస్తోంది. మెల్లెక్కి ఆమె దగ్గరికి వెళ్ళాను. "దిస్ వే ప్లీజ్...." అందామె దారి చూపిస్తూ.

ఆమె వెంట నడిచి హాల్లోకి వెళ్ళాను. అక్కడెవరూ లేరు. ఆమె నన్ను కుడిప్రక్క గదిలో ప్రవేశపెట్టి, పేరు ప్రకటించి నిష్క్రమించింది....

గది చల్లగా, అడుగువేస్తే మోకాలివరకూ కూరుకుపోయే కార్పెట్స్ తో, ఖరీదయిన ఫర్నిచర్ తో పరమ ఆర్భాటంగా అలంకరించివుంది.

తలుపుకి సరిగ్గా ఎదురుగా, కిటికీ దగ్గర విశాలమైన టేబిల్ వుంది. దానిచుట్టూ నాలుగు ఫోమ్ కుర్చీలూ, దానిమీద మూడు టెలిఫోన్స్, చెల్లాచెదురుగా ఫైళ్ళూ

కాగితాలూ వున్నాయి.

ఆ టేబిల్ వెనుక విగ్రహంలా కూర్చునున్నాడు, నాకు కావల్సిన మనిషి. అతనికి సుమారు అరవై ఏళ్ళుంటాయి. తెల్లగా, లావుగా, దట్టమైన తల వెంట్రుకలతో, చురుకైన కళ్ళతో ఉత్సాహంగా కన్పించాడు. నోట్లో పైప్ కాల్తోంది.

"మిస్టర్ సుందర్? కమాన్, సిట్ హియర్" అన్నాడతను నవ్వుతూ.

వెళ్ళి కూర్చున్నాను. షేక్‌హాండ్ ఇవ్వలేదు.

"ఏమిటి విషయం, మిస్టర్ సుందర్?" అన్నాడతను మళ్ళీ, ఆసక్తిగా.

"మిస్టర్ కౌషిక్, మీరు రిపోర్ట్స్‌ని తస్కరించి మీ శ్రేయస్సుని కాపాడనుకున్నారనుకోండి. మీరిప్పుడు ఆయా స్థలాల్లో ఆధారాలు తొలగించినా, మీ దొంగ నిల్వల గోడవున్స్‌ని మార్చివేసినా, మీ బోగస్ రిక్రూటింగ్ సంస్థని ఎత్తివేసినా, మీ డోప్ రాకెట్‌ని తాత్కాలికంగా నిలుపుదల చేసినా, వీటన్నింటికంటే చాలా పెద్ద నేరంలో చిక్కుకోవడానికి సిద్ధంగా వున్నారు మీరిప్పుడు."

"మిస్టర్, నువ్వు చాలా చెప్పేస్తున్నావు. అవన్నీ నాకున్నాయా?"

"ఉన్నాయి, మిస్టర్ కౌషిక్. కానీ మా దగ్గర ఆధారాలే పోయాయి. ఫరవాలేదు, ఇప్పుడు నీమీద హత్యకు సంబంధించిన సాక్ష్యాల్ని సేకరిస్తున్నాం. వీలయితే నీ బిజినెస్ బండారం కూడా వెల్లడిచేయగలం- హైద్రాబాదులో తస్కరించిన నీ డాసియర్ ఇంకా ఆ గ్యాంగ్ దగ్గరే వుందనుకుంటాను. ఆ గ్యాంగ్‌ని

ధ్వంసం చేసి మా రిపోర్టర్ హత్యలో నీ హస్తాన్ని నిరూపించి పగ తీర్చుకుంటాం!"

అతను చటుక్కున పైప్ పెట్టేసి బెల్ నొక్కాడు. వెంటనే వెనుక తలుపు తెరుచుకున్న చప్పుడైంది. నిశ్శబ్దంగా కదిలివచ్చి ఒక ఆకారం నా ప్రక్కగా నిల్చుంది.

"బిల్లూ, టేకలుక్!" అన్నాడు కౌషిక్.

బిల్లూ నన్ను ఆపాదమస్తకమూ చూశాడు, పిల్లి కళ్ళతో. నేనూ చూశాను అతన్ని తీక్షణంగా. తలమీద జుట్టు ఎంత అందంగా దువ్వుకున్నాడో; ముఖం అంత జిడ్డుగా, క్రూరంగా పెట్టుకున్నాడు. కుడిచేతిలో ఎందుకో ఒక పల్చని ఏడంగుళాల స్టీలు కత్తెర పట్టుకున్నాడు. దాన్ని చూపుడు వేలుతో పెట్టి గుండ్రంగా తిప్పుతూ, ఓ వెకిలి నవ్వు పారేసి పరీక్ష పూర్తి చేసుకొని వెళ్ళిపోయాడు.

"ఏం చేస్తాడు?" అన్నాను కౌషిక్ వైపు తిరిగి.

"నిన్ను గుర్తుపెట్టుకుంటాడు" అన్నాడు కౌషిక్.

"ఎంత ప్రేమ! నన్ను గుర్తుపెట్టుకునే వాళ్ళని గౌరవిస్తాను" అన్నాను సిగరెట్ అంటించుకుంటూ. "కానీ ఆ చేతిలో కత్తెర ఎందుకు?"

"కడుపు చీల్చి పేగులు కత్తిరిస్తాడు."

"నయం, క్షవరం చేస్తాడనుకున్నాను" అన్నాను పొగ లాగి వదులుతూ. "ఆ థగ్ నన్ను వాడలగొడ్తాడనుకుంటున్నావా, మిస్టర్? నా సైలెన్సర్ రివాల్వర్ లాగి వాడి గట్స్‌లోకి ఒక బుల్లెట్ దింపానంటే ఎవరికీ చెప్పకుండా స్వర్గానికెగిరిపోతాడు."

"ఐసీ...."

"అప్పుడే ఏం చూశావు? నువ్వు నియోగించిన మురాా మనిషి చచ్చాడు ఈ రోజు. అది తెలిసి వాళ్ళు మా మీద పగ బడ్తారు, చంపడానికి బయల్దేరతారు. అప్పుడు చూడు మా చివరి ఎత్తుగడ! ఆ మురాకు మురా అంతా మా చేతిలో చిక్కకొని కోరస్ పాడతారు, కచేరి జరిపిస్తాం. నేరాలన్నీ పలికించి హత్యను నీ మెడకి చుట్ట బెడతాం, తెలుసుకో!"

హేళనగా నవ్వాడతను. "యూ ఆరే ఫూల్! వాళ్ళంతా పిరికివాళ్ళు కారు. క్లయంట్స్ విశ్వాసాన్ని వమ్ముచేయరు. వాళ్ళ రహస్యాల్ని, క్షేమాన్ని, ప్రయోజనాల్ని సురక్షితంగా కాపాడతారు. వాళ్ళనుంచి మీరేమీ పలికించలేరు, పోలీసులు కూడా! వాళ్ళ మౌన వ్రతాన్ని చెడగొట్టలేరు. చిత్రహింసలు పెడితే వీరోచితంగా ఆత్మార్పణం చేసుకుంటారు. అసలిదంతా మీకు వాళ్ళు చిక్కినప్పటి సంగతి! ఒక అమెచూర్ మురాకు పత్రిక నడుపుకునే ఒక ఆకతాయి మేళానికి అది సాధ్య పడని పని! ఎప్పుడూ అందని చందమామకోసం పాకే చంటిపాపాయి మీ బాస్!"

"నువ్వు అందని చందమామవా?" గట్టిగా నవ్వేసి బయటికొచ్చాను.

ఆ జిడ్డు మొఖం హాల్లో ఎక్కడా కన్పించలేదు. వేగంగా నడిచి వరండాలో కొచ్చాను. అక్కడా లేదు. ఎక్కడో, ఏవో ఏర్పాట్లు చేస్తూంటాడు. నా జేబులో రివాల్వర్ వుంది. కత్తెర వాడి ఆయుధమైతే దాని ఉపయోగమేమిటో తెలియచెప్తాను.

మెట్లు దిగి పోర్టికోలోంగుండా ఆవరణలోకి నడిచాను. అలా ఇరవై గజాలు వెళ్ళానో లేదో, వెనుక వేగంగా

అడుగులు వినిపించాయి. తిరిగిచూసేందుకూడా సమయం మించిపోయింది. నా మెడని బలమైన హస్తం చుట్టి వేసింది. శ్వాసనాళం బిగుసుకుపోయింది. ఉక్కిరి బిక్కిరవుతూ పెనుగులాడాను. అతను నా కుడిచెయ్యి జేబులోకి వెళ్ళకుండా వెనక్కి విరిచి పట్టుకొని, ఎడమచేతిని నా మెడచుట్టూ తిప్పి ఒక్కలాగు లాగాడు. ఎముకలు పెద్దగా శబ్దంచేసి బాధతో అరిచాను. అతడికి నాకంటే ఎక్కువ బలం వుంది. అప్పుడతను వెనక్కివంచి వెల్లకిలా పడేసే ప్రయత్నంచేశాడు — నేనదుపులోకొచ్చి ప్రతిఘటించాను. అప్పుడు గ్రహించాను, నా కాళ్ళు స్వేచ్ఛగానే వున్నాయి. వెంటనే నేను కుడికాలు వెనక్కి జాడించి అతని మోకాలిమీద బలంగా తన్నాను. బూటు తాకిడికి మోకాలి చిప్ప అదిరి, కెవ్వున అరుస్తూ నన్ను వదిలేశాడు. నేను ఊపిరి కూడా తీసుకోకుండా అతనిమీదకు దూకబోయాను—కానీ తళుక్కున అతని చేతిలో కత్తెర మెరవడంతో వెనక్కి తగ్గి, మళ్ళీ తెగించి ముందుకు దూకి అతని రెండు కాళ్ళ మధ్య తన్నబోయాను; చచ్చేవాడే; ప్రక్కకు జరగడంతో ఆ దెబ్బ తొడమీదపడి అతన్ని పడగొట్టింది. కత్తెర వెళ్ళి దూరంగా పడింది.

నేను గబుక్కున దగ్గరికెళ్ళి అతని నెత్తిమీద రెండు దెబ్బలు తీశాను. కళ్ళుమూతపడి తలవాల్చేశాడు.

ఆయాసం తీర్చుకుంటూ చెమట తుడుచుకున్నాను. అప్పుడు చూశాను బిల్డింగ్ కేసి, వాళ్ళిద్దరు చూస్తున్నారు నోళ్లు తెరిచిపెట్టేసి: బాల్కానీలో క్రాఫిక్, పోర్టికోలో పంజాబీ యువతి.

నేలమీదకు చూశాను. అతడలాగే పడివున్నాడు

మట్టిలో. దూరంగా ఓ తెర కనిపించింది. దాన్నందుకొని అతని అందమైన క్రాపును కత్తిరించ నారంభించాను. అస్తవ్యస్తంగా కత్తిరించి వదిలాను. వెంట్రుకల్ని పోగుచేసి అతని జేబులో తోశాను. లేచి నిలబడి వాళ్ళిద్దరి చెయ్యూపి గబగబా నడిచాను.

గేటు దగ్గర గూర్ఖా వుంటాడు. కౌశిక్ అతన్ని ఫోన్ చేసి హెచ్చరిస్తాడు. వేగంగా నడక సాగించాను. అనుకున్నట్టుగానే గూర్ఖా బూత్‌లో వున్నాడు ఫోన్‌లో ఆదేశాలు వింటూ.

చటుక్కున డోర్ లాగి, గడియపెట్టేసి చక్కాపోయాను.

ఆఫీసుకు చేరుకునేసరికి బాగా చీకటిపడింది.... ఇంకా హోటల్‌లో గది తీసుకోనేలేదు. ఆ ఓపిక కూడా ఇప్పుడు లేదు. ఆఫీసులోనే పడక వేయాలనుకుంటూ ప్రవేశించాను. చోప్రా గాభరగా చూశాడు నన్ను.

"సుందర్, రాబర్టునుంచి ఫోన్!"

"ఏమని?"

"మీ మిసెస్‌ని కిడ్నాప్ చేశారట!"

"వాట్!"

"మీరు వెంటనే బయల్దేరితే ప్లేన్ అందవచ్చు!" అతను ఫోన్ ఎత్తి చకచక నెంబర్ తిప్పుతున్నాడు.

నా అలసటంతా ఎగిరిపోయిందప్పుడు!

## 8

రాబర్టు అన్నాడు తలొంచుకొని విచారంగా.

"సుందర్, నేనిలా జరుగుతుందనుకోలేదు. ఆ వేళప్పుడు ట్రెయిను లేకపోతే ఆమె బస్సులో వెళ్ళిపోతానంది. కానీ అక్కడ డైరెక్టు బస్సు లేదు.

విజయవాడ వరకే వుంది. అయినా ఆమె అందులో వెళ్ళిపోయి అక్కడ మారతానంది. నే సెక్యూం చేశాను. కానీ ఆమె కూడా మనిషిని పంపాలని ఆలోచన రాలేదు."

"ఫోన్ ఎప్పుడొచ్చింది?" అన్నాను తీవ్రంగా ఆలోచిస్తూ.

"సాయంత్రం 5 గంటలకు. మీరు ఢిల్లీలో ప్రయత్నాలు మానుకొని తిరిగివచ్చేస్తే ఆమెని క్షేమంగా అప్పగిస్తామని షరతు పెట్టారు. ఏర్‌పోర్టునుంచి మేం వెళ్ళేటప్పుడు ఎవరూ వెంటాడలేదు. కానీ తర్వాత బస్సుని ఎలా వెంటాడి కిడ్నాప్ చేశారో తెలియడంలేదు. ఎక్కడ చేశారో కూడా తెలియడంలేదు. విజయవాడ వరకూ వెళ్ళి చేశారో, లేక మధ్య స్టేజీల్లో ఏదో మిషతో దింపేసి ఆమెని తీసుకెళ్ళిపోయారో అర్థంగావడంలేదు."

"విజయవాడలో నే చేసివుండాలి," అన్నాడు శర్మకి "మధ్యలో అవకాశం చిక్కివుండదు. అందుకే ఫోన్ చెయ్యడానికి అంత టైము పట్టింది."

తలవిదిలించాను. "ఓ. కే. అయితే వాళ్ళకు ప్రకాష్ చావు వార్త అయిదుగంటలవరకూ అందలేదు. నేను ఆరుగంటలకి కాషికొని కలుసుకున్నాను. అతను ఫోన్ చేసి తెలిపివుంటే ఈపాటికి తెలిసిపోతుంది. దాని రియాక్షన్ ఏమిటో మీకు తెలుసా?"

"ఆమెని చంపేస్తారా?"

"అది వాళ్ళ పద్ధతికాదూ, ప్రతీకారం తీర్చుకోడం?"

"సుందర్ సువ్వలా మాట్లాడకు."

"ఇంకెలా మాట్లాడాలి....ఇది వాస్తవం, జరగబోయేది."

రాబర్టు అన్నాడు ఆందోళనగా. "ఈ బిజినెస్‌లో మొకాసిన్స్ దిగారని మీరు చెప్పేవరకూ నాకు తెలీదు. ఉదయం నుంచీ ఆ బిచ్‌ని గాలిస్తున్నాను. పోలీసు మిత్రులతో ఫైల్స్ తీయించి ఫోటోలన్నీ చూశాను. అటువంటి ముఖంలేదు. ఆమె మొకాసిన్ మనిషయితే తప్పకుండా ఆ డాసియర్ గ్యాంగ్ దగ్గరే వుంటుంది ఇంకా. పారితోషికం తీసుకొని డెలివరీ ఇస్తారు. అప్పుడు కాపిక్‌ని మనం కనిపెట్టివుంటే ఆ ముహూర్తానికి ఊడిపడి దాన్ని దక్కించుకోవచ్చు. అది వేరే విషయం. అంత తీవ్రమైంది కాదు. కానీ మీ మిసెస్ గురించి ఏమిటి? ప్రాణాలతో చెలగాటం...."

అడ్డంగా తలూపాను. "ఆమెని అప్పుడే ఏమీ చెయ్యరనుకుంటాను. ముందు నన్ను కాంటాక్టు చేయాలి. అసలు చంపవల్సింది నన్ను. వాళ్ళు హెచ్చరిక చేసి నా రాకకోసం చూస్తూంటారు. ఏర్‌పోర్టునుంచి నన్నిక్కడ వెంటాడి వుంటారు. నే నిప్పుడు ఇంటికెళ్తాను.... లేపితే నన్ను దార్లోనే లేపెయ్యాలి. లేకపోతే ఇంటికి ఫోన్ చేసి తమ దగ్గరికి రప్పించుకోవాలి. ఏం జరుగుతుందో చూద్దాం!" అన్నాను లేస్తూ.

"అయితే మీ వెనుక నేనూ వస్తాను" అన్నాడు రాబర్టు కూడా లేస్తూ, "వాళ్ళు వెంటాడుతారేమో చూస్తాను. మీరు ఆటోలో వెళ్ళండి. మీ వెనుక కొంత సమయమిచ్చి నేను వస్తాను. మీ మీద దాడి జరిపితే వచ్చి ఆదుకుంటాను."

తలూపాను. ఇద్దరమూ బయటికి నడిచాం. రాబర్టు మెట్లదగ్గరాగిపోయాడు. నేను క్రిందకు వెళ్ళి ఆటోని పిల్చి ఎక్కాను బ్రీఫ్ కేసుతో. నా దగ్గరిప్పుడు రివాల్వర్

లేదు. దాన్ని చోప్రాకిచ్చేసాను. నా స్వంత రివాల్వలర్ ఇంట్లో నేవుంది. ఆటో పోతోంటే రెండుమూడుసార్లు వెనక్కి చూశాను ప్రక్కనుంచి తొంగి. వెనుక మరో రెండు ఆటోలూ, ఒక కారూ వున్నాయి, ఆ వెనుక బస్సు వస్తోంది.

కారు అనుమానం కల్గించింది. అది రాబర్టు కారు కాదు. డ్రైవర్‌ని వేగం తగ్గించమన్నాను. నా అనుమానాన్ని తీరుస్తూ వెనుకనున్న ఆటోలతో సహా ఆ కారు కూడా దాటిపోయింది. ఏమీ జరగ లేదు. ఛాషింగ్ లేదు, షూటింగ్ లేదు.

కుతూహలపడుతూ మరోసారి వెనుక చూశాను. అప్పుడు కన్పించింది రాబర్టు కారు. అంతే—ఆ తర్వాత ఇంటి వరకూ ఆ కారే వెంటాడుతూ వచ్చింది. మధ్యలో చాలా వాహనాలు వచ్చాయిగానీ, ఒక్కటీ పట్టుమని రెండు నిముషాలుండలేదు.

ఇంటిముందు ఆటో దిగి పంపేశాను.

రాబర్టు కారువచ్చి ప్రక్కన ఆగింది. అతను దిగి వచ్చాడు.

"వెల్?" అన్నాను.

"వెల్! మన వెనుక బాడీగార్డ్సులేరు."

"ఫన్నీ ఫెలోస్, వెంటాడటం వాళ్ళ ఇంటా వంటా లేదనుకొంటాను."

నవ్వాడు రాబర్టు, "ఇప్పుడు మీకు ఫోన్ రావచ్చు. మీ మిసెస్ కోసం ఫలానా చోటికి రమ్మంటారు. వెళ్ళకండి. మిమ్మల్నిద్దర్నీ కలిపి అంతమొందించే ఆలోచన వుండొచ్చు వాళ్ళకు. అలా ఫోన్ వస్తే నాకు తెలియ జేయండి. లేకపోతే మీతోపాటు నేనూ వుండనా?"

"అవసరంలేదు, వెళ్ళండి. మీరు నాకు కాదు, బాస్‌కు బాడీగార్డు."

రాబర్టు గుడ్ నైట్ చెప్పి వెళ్ళిపోయాడు.

# 9

గేటు తెరిచి లోపలికి నడిచి తలుపు తాళం తీశాను.

శ్యామల గుర్తొచ్చి నా గుండె వేగం హెచ్చింది. సాలోచనగా తలుపు తోసి లోనికి అడుగుపెట్టాను చీకట్లో—అది పొరపాటయితే, ఆ పొరపాటు నా మంచికోసమే జరిగిందనుకోవాలి — చీకట్లో రెండు ఆకారాలు అకస్మాత్తుగా నా మీద విరుచుకుపడి, రెక్కలు విరిచిపట్టుకున్నాయి. బ్రీఫ్ కేసు జారిపోయింది. తెలివిలోకొచ్చాను. మౌనంగా వాళ్ళతో నడిచాను.

వాళ్ళు నన్ను లాక్కెళ్ళి కుర్చీలో కుదేశారు. చటుక్కున అప్పుడు లైటు వెలిగింది. కళ్ళు చెదిరాయి. తల విదిలిస్తూ చూశాను, వాళ్ళిద్దరు రివాల్వర్స్ గురిపెట్టి నిల్చున్నారు. కొత్త మొఖాలు. కానీ నా ఎదురుగా కూర్చున్న ముఖం తెలిసినదే—మమ్మల్ని అతితెలిగ్గా ఫూల్స్ చేయగల్గిన చలాకీ రాణి సుమిత్ర!

ఆమె రివాల్వర్ పట్టుకొని నిటారుగా కూర్చునుంది. ఆమె కళ్ళు హేళనగా నవ్వుతున్నాయి.

"హలో, ప్రయాణం కులాసాగా జరిగిందా హీరో?"

నేను లేచి ఆమె మీదకి దూకబోయాను. ఆగంతకులు తిరిగి కుదేశారు.

"శ్యామల ఎక్కడుంది? ఏంచేశారామెని?" అరిచాను తీవ్రంగా.

ఆమె పకపకా నవ్వింది. "ఎంత పిరికివాడివి! కాస్త హీరోలా కనపడు, ఢిల్లీ వెళ్ళి వచ్చినవాడివి!"

ఆమె మాటలకి రెచ్చిపోయాను. కానీ ఆగంతకులు నన్ను అదుపు చేశారు.

"చూడు హీరో, నువ్వు కాస్త వళ్ళు దగ్గర పెట్టుకో! వీళ్ళు పరమ కిరాతకులు. సహనం తక్కువ. ఈ బచ్చాగాడు గుళ్ళు వాయిస్తాడు. ఈ తుగ్లక్ గాడు తుక్కు చేస్తాడు. అర్థమైందా? తర్వాత నేను హెచ్చరించ లేదనకూడదు."

తలెత్తి వాళ్ళిద్దర్నీ చూశాను. బచ్చాగాడు బక్కగా తంతే, గాల్లోకి లేచేలా వున్నాడు. తుగ్లక్ గాడు గుండ్రాయిలా వున్నాడు. నున్నగా గుండు గీసుకున్నాడు.

"నువ్వొక టక్కరిచుక్కవి! నీ మొసలి కన్నీళ్ళతో చక్కగా నటించి మమ్మల్ని ఏమార్చావు. నిన్నిప్పుడు సన్మానించడానికి మా బాస్ ఎదురుచూస్తున్నారు" అన్నాను కసిగా.

"పెద్ద బఫూన్ మీ బాస్."

లేచి ఆమెని కొట్టబోయాను, ఆమె చేతిలో రివాల్వర్ని లెక్కచెయ్యకుండా. తుగ్లక్ నన్ను వెనక్కి తోశాడు. "అల్లరి చేయక కూర్చో బిడ్డ, పిస్తోళ్ళున్నాయి మా కాడ!"

బచ్చాగాడు రివాల్వర్ నా తలకానించాడు.

"సుందర్, నువ్వు ఎందుకెళ్ళావ్?" అందామె ధోరణిమార్చి కఠినంగా, "చింతిస్తావని మేం చెప్పలేదూ? అక్కడ మా మనిషిని పట్టుకోవాలనుకుని వెళ్ళావు. కానీ ఇక్కడ నీ భార్యని మేం పట్టుకోగలమని ఆలోచించలేదు. సరే, ఇప్పటికైనా పొరపాటు గ్రహించి తిరిగి వచ్చావు, సంతోషం. ఇప్పుడు నీతో మాకు—"

హఠాత్తుగా ఫోన్ మోగడంతో ఆగిపోయిందామె.

నేను ఉలిక్కిపడి చూశాను. ఆగంతకులిద్దరూ ప్రశ్నార్థకంగా ఆమెకేసి చూశారు.

"ఎత్తకండి, అదే వూరుకుంటుంది" అందామె వారిస్తూ, "మన హీరో ఇంకా ఇంటికి రాలేదనుకుంటారు, ఏం సుందర్?"

నా రక్తం వురకలువేసింది. ఎగిరివెళ్ళి రిసీవర్ ఎత్తాలనుకున్నాను. కానీ రివాల్వర్స్ నన్ను కదలనివ్వలేదు. ఫోన్ చేస్తోందెవరు? ఎందుకు?

"నెమ్మది, సుందర్! నెమ్మదిపడు!" అందామె.

అప్పుడు ఫోన్ నిశ్శబ్దమైపోయింది....

"పదండి, ఇక వెళ్ళిపోదాం!" అందామె చటుక్కున లేస్తూ.

తుగ్లక్ నా రెక్క పుచ్చుకు లాగాడు. "లెగు బిడ్డ, నిన్ను పెళ్ళాంకాడికి కొంటపోతాం."

"పోరా బాస్టర్డ్."

"సుందర్! నువ్వు మాతో రావాలి. మా బాస్ ఆజ్ఞ. నీతో ఒక కాగితం వ్రాయించుకుంటాం. నువ్వొప్పుకొని వ్రాసిస్తే నిన్ను సతీ సమేతంగా సాగనంపుతాం— క్షేమంగా ఇంటికి. లేకపోతే నువ్వొంటరిగా వెళ్తావు, నీ భార్య చావుచూసి."

"ఏమిటా కాయితం?"

"తెలుస్తుంది, పద!"

ఈ పరిమాణం విపరీతమనిపించింది. ఇది బ్లాక్ మెయిల్. అదెలాంటి కాగితమై వుంటుందో ఊహించగలను. దాంతో నా భవిష్యత్తు నా చేతిలో వుండదు. నా సర్వం వాళ్ళ స్వాధీనమైపోతుంది. శ్యామల ప్రాణాలు పణంగా వాళ్ళు నాచేత నన్ను బ్లేమ్‌చేసే సాక్ష్యం ఏదో సృష్టించుకో

బోతున్నారు.

అయితే ఇది కేవలం వాళ్ళ హెచ్చరిక పాటించని ఫలితమేనా? లేక ప్రకాష్ చావుకి ప్రతీకారం కూడానా? కానీ చావుకి ఇటువంటి శిక్ష ఎప్పుడూ విధించలేదు. ప్రాణానికి ప్రాణం తీసుకోవడం వాళ్ళ సిద్ధాంతం. మరి ఇప్పటి పరిస్థితిని ఎలా అర్థం చేసుకోవాలి? వాళ్ళ కింకా ప్రకాష్ చావు తెలియదనా? అంతే అయుండాలి. లేకపోతే ఈ క్షణంలో నేనిలా సజీవంగా ఉండే వాడినా!

# 10

వాళ్ళు ఇంటి వెనుక దారిగుండా తీసుకెళ్ళి నన్ను అక్కడున్న కార్లోకి ఎక్కించారు.

కారు బయల్దేరాక మళ్ళీ ఆ ఫోన్ కాల్ గుర్తొచ్చింది. ఎవరు చేసివుంటారు? ఎందుకు చేసి వుంటారు? ఏదైనా కొత్త పరిణామమా? అయితే మళ్ళీ చేస్తారు. అప్పుడూ రెస్పాన్స్ వుండదు. అప్పుడు శర్మకో, రాబర్టుకో అనుమానంవచ్చి ఇంటికొచ్చి చూస్తారు—

తుగ్లక్ కారు కుదుపుకి నామీదకి ఒరగడంతో ఆలోచనలకి అంతరాయం కల్గింది. వాళ్ళిద్దరు నా చెరో ప్రక్క కూర్చున్నారు. ఆమె డ్రైవ్ చేస్తోంది. వాళ్ళ ప్రవర్తన, పద్ధతి నాకు వింతగా తోచాయి. తమ ఉనికిని ఎంతో గుట్టుగా కాపాడుకుంటోన్న వీళ్ళు, నా కళ్ళకి కనీసం గంతలైనా లేకుండా తమ స్థావరానికి మార్గం తెలిసేలా ఎందుకు తీసుకెళ్తున్నారు?

కారు శరవేగంతో పంజాగుట్ట, సనత్ నగర్, కూకట్ పల్లీ దాటేసి, బాంబే రోడ్డుమీద చీకట్లో దూసుకుపోతోంటే అనుమానంవేసి అడిగాను, "మీ

స్థావరం సిటీవెలుపల దూరంగా వుందా?"

"సిటీ వెలుపల ఒక పెద్ద బావి వుంది" అందామె.

"వుంటే?"

"అందులో నిన్ను పడేస్తాం."

"నేను కాయితం వ్రాయనని చెప్పలేదే?"

"అక్కర్లేదు, వ్రాయనవసరంలేదు. అసలా కాయితం లేదు, కల్పించాను. నువ్వు గొడవచెయ్యకుండా వస్తావని. సుందర్, మా మొకాసిన్ గ్యాంగ్ గురించి నీకు బాగా తెలుసనుకుంటాను?"

"తెలుసు."

"మా గ్యాంగ్ దిగ్విజయంగా ఆపరేట్ చేస్తోంది" అందామె తీవిగా డ్రైవ్ చేస్తూ.

"మా శక్తిసామర్థ్యాలమీద మా క్లయంట్స్‌కి చాలా విశ్వాసముంది. దేశవ్యాప్తంగా వున్న మా క్లయంట్స్‌లో ఏ ఒక్కరు ఎన్నడూ మా సేవలు పొంది అసంతృప్తి చెందలేదు. అన్‌ఫిట్ అనలేదు. మొకాసిన్స్ ఆర్ ది మోస్టు కన్నింగ్ ఆపరేటర్స్ ఇన్ ది అండర్ వరల్డు బిజినెస్ అంటారెవరైనా...."

"అది తెలుసు, తెలియంది చెప్పు."

ఆమె నవ్వింది. "నీకు తెలియందేమిటి—మా ప్రొసీజర్ కోడ్ నీకు తెలుసు. మా మనిషి ఎవరైనా ఎవరి మూలంగానైనా చచ్చాడంటే, సుందర్, ఆ మూల పురుషుడు కూడా ఠకీమని చావాల్సిందే. దానికి తిరుగు లేదు. నీ విషయమే తీసుకో, నువ్వు ఢిల్లీ వెళ్ళి గూఢచారిలా మా ప్రకాష్‌ని చంపావు. అవునా?"

నా గుండె వేగంగా కొట్టుకుంది. ఏమీ అనలేక

పోయాను.

ఆమె వెనక్కి తిరిగి పకపకా నవ్వింది. "ఇప్పుడు నువ్వు మూలపురుషుడివి! మాకు ఫోన్ వచ్చింది ఇందాక కాషిక్‌నుంచి. ప్రతాప్ చావు తెలిసింది. అంతేగాక కాషిక్ బాడీగార్డుని నువ్వు గాయపర్చి అవమానకర సితిలో వదిలి వచ్చావు. ఇంత సాహసం నీకెలా వచ్చింది? నువ్విప్పుడు చావబోతున్నావని తెలిసీ ఆ సాహసం— గట్స్ ఇంకా వున్నాయా?"

"వివరాలు కావాలి, నన్నెలా చంపుతారు?"

"అచ్ఛా, గట్స్ వున్నాయన్నమాట? అయితే దాచుకో, ప్రయోజనం లేదు."

ముందుకు విరుచుకుపడి ఆమె కంఠం పట్టుకున్నాను. యావత్ శక్తినీ నా చేతుల్లోకి తెచ్చుకొని కసిగా నలిపేయసాగాను. ఆమె ఉక్కిరిబిక్కిరై స్టీరింగ్‌ని వదిలేసింది—కారు వంకరటింకరగా వెళ్ళింది. అప్పుడు చీకట్లో జరుగుతున్నది గ్రహించి అనుచరులిద్దరూ నన్ను లాగి సీట్లో కుదేశారు. బచ్చాగాడు లాగి నా గూబమీద కొట్టాడు. బాధగా అరిచాను.

"ఖబడ్దార్, బిడ్డ!" తుగ్లక్ అన్నాడు నా చొక్కా పుచ్చుకొని.

కారు అదుపులోకొచ్చి తిన్నగా దూసుకెళుతూంది.

"ఏమిటి, నువ్విప్పుడే చావాలనుకుంటున్నావా?" అందామె తిరిగి హుందాగా డ్రైవ్ చేస్తూ, "నీ భార్యని కడచూపులు చూసుకోవూ? అలాకాదు, మీరిద్దరూ కడచూపులు కళ్ళారా చూసుకొని కలిసి హరీమంటే చాలా బాగుంటుంది.... పునర్జన్మంటూ వుంటే చెట్టాపట్టా లేసుకు పుడతారు. ఏం తుగ్లక్?"

"ఛోక్రైన మాట, ప్యారీబహెన్!" తుగ్లక్ అన్నాడు నావైపు తిరుగుతూ, "జన్మ జన్మల బంధం, బిడ్డ!"

"మేరే భాయ్, బలే తియ్యని చావురోయ్!" అరిచాడు బచ్చాగాడు.

తుగ్లక్ అన్నాడు. "ఆడ బాయి వుంది, బిడ్డ. మా ఏజెంట్లు సీ ఆడమనిషితో అడికి వస్తారు. మీ కాళ్ళకీ, చేతులకీ బిర్రుగా తాళ్ళు చుట్టి, పీకలకి ఇంతా పెద్ద బండకట్టి దాంట్లో దడాల్న ఎత్తేస్తాం, బిడ్డ. బుడుంగున మునిగి చస్తారు.... క్యాశే కంత్రీ, ఎలాగుంటుంది?"

"మేరేభాయ్, ఎంత ఆరాంగా వుంటుంది!"

"కిందకుపోయి ఆరాం తీసుకోండి, బిడ్డ. దాంట్లో చాలా శవాలున్నాయ్, గవన్నీ మీతో దోస్తీగా వుంటాయ్ హేహ్హా హిహ్హి...."

బచ్చాగాడు నా గెడ్డం పట్టుకొని పాడ్డం మొదలెట్టాడు, "మేరే దోస్తుకిస్నా ఏ క్యా హోగయా...."

నేనలాగే మౌనంగా కూర్చున్నాను వింటూ. కారిప్పుడు పూర్తిగా సిటీ దాటేసి, హైవే దిగి, అడ్డమార్గాన మట్టి రోడ్డులో వెళుతోంది. చిమ్మచీకటిగా వుంది అంతా. చల్లటి గాలి ఈడ్చికొడ్తోంది. హెడ్‌లైట్స్ వెలుగులో ముందంతా విశాలమైన మైదానం కన్పిస్తోంది. వెనుక దట్టమైన ధూళి మేఘం.

ఆమె హఠాత్తుగా వేగం తగ్గించి కుడివైపు తిప్పింది. గుంటల్లో పడ్తూ లేస్తూ నెమ్మదిగా సాగుతోంది కారు. ఇప్పుడు ఇరువైపులా చెట్లు కన్పిస్తున్నాయి. ఎత్తయిన వృక్షాలు, గుంపులు గుంపులుగా వున్నాయి. కింద ఏపుగా పెరిగిన గడ్డి. అలా కొంతదూరం వెళ్ళాక చిన్న బయలు ప్రదేశం వచ్చింది. అక్కడ చెట్లులేవు, గడ్డిలేదు.

అక్కడ కారాపి ఆమె లైట్లార్పేసింది. "దిగండి!" అంది తనూ దిగుతూ.

తుగ్లక్ చటుక్కున డోర్ తీసి దిగాడు. వెనుక నేను దిగాను. అవతలనుంచి బచ్చాగాడు దిగాడు. వాళ్ళిద్దరు నన్ను కారుముందుకి తీసుకొచ్చారు. ఆమె నా ముందు కొచ్చి రివాల్వర్ గురిపెట్టి వాళ్ళతో అంది, "మీరు వెళ్ళి ఏర్పాట్లు చూడండి!"

"మన ఏజెంట్లు ఇంకా రాలేదేమిటి, బహేన్?" తుగ్లక్ అన్నాడు.

"వచ్చేస్తారు పది నిముషాల్లో, నువ్వెళ్ళు!"

"రైట్! నువ్వెళ్ళి తాళ్లు తీయ్ బచ్చా, నేను బండ ఎత్తుకొస్తా!"

వాళ్ళిద్దరూ కదిలారు. బచ్చాగాడు వెనక డిక్కీ దగ్గర కెళ్ళాడు. తుగ్లక్ చీకట్లో దూరంగా మాయమైయ్యాడు.

అంతటా నిశ్శబ్దం ఏర్పడింది. కటిక చీకటిగా వుంది. సుమిత్ర ఏదో చెప్తోంది. నేను విన్పించుకోడంలేదు. చుట్టూ చూస్తున్నాను. ఆ దగ్గర్లోనే ఎక్కడో బావి వుండాలి. దాంట్లో చాలా శవాలున్నాయన్నారు. ఇప్పుడు వాటితో మేమూ కలుస్తాం. బావిలో శవాలు! తలుచుకోగానే ఒళ్ళు గగుర్పొడిచింది.

శ్యామల! నా గుండె వేగంగా కొట్టుకుంది. రక్తం ఉరికింది. సందేహించకు సుందర్, సాగిపో! తొందర పెట్టింది మనసు. సమయంలేదు, సాహసించు!

"అదుగో శ్యామల వచ్చేస్తోంది, శ్యామలా!" కేక పెట్టాను కవ్వేన.

ఆమె అదిరిపడి వెనుదిరిగింది. చాలు—ఆమె మెడ మీద రెండు చేతులూ బిగించి కొట్టి కాలితో రివాల్వర్ని

ఎగరగొట్టాను. ఆమె కీచుగా అరుస్తూ నామీదకి రాబో తూంటే ముఖంమీద ఫెడీమని కొట్టాను. ఆమెకు ఊపిరి స్తంభించి గిరగిరా తిరిగింది—బొంగరంలా. మరో దెబ్బ వీపుమీద కొట్టడంతో విసురుగా నిశ్శబ్దంగా వెళ్ళి పడింది—చీకట్లో ఎక్కడో! అప్పుడు పెద్దగా కేక, ఆ వెంటనే నీళ్ళ చప్పుడూ విన్పించాయి. అక్కడేవుండాలి బావి! ఆమె బావిలోపడింది!

"ఏం జరిగింది, బహెన్?" బచ్చాగాడు ఉరికి వచ్చాడు మెరుపు వేగంతో. వాడ్నలాగే రానిచ్చి అదే క్షణంలో, అదే వేగంతో, కాలెత్తి వాడి రెండుకాళ్ళ మధ్య లాగి తన్నాను బలంగా. ఒక హృదయవిదారకరమైన కేక. కిందపడి దొర్లుతున్న చప్పుడు—అప్పుడు నీళ్ళుచేసిన పెద్ద ధ్వని!

"బచ్చా, ఏం జరిగింది?" తుగ్లక్ అరుపు విన్పించింది దూరంగా. వెంటనే నేలమీద తడిమి సుమిత్ర పడేసిన రివాల్వర్ అందుకున్నాను. వేగంగా వురికి కారు వెనుక నక్కాను. తుగ్లక్ కేక వేస్తూ పరుగెత్తుకొచ్చాడు, "చెల్లమ్మా! ఒకేయ్ చిడియా! సప్పుడు చెయ్యరేంటి మల్ల!"

సరిగ్గా అదేక్షణంలో నా చేతిలో రివాల్వర్ చప్పుడు చేసింది. దిక్కులదిరే గావుకేక. పిచ్చిపిచ్చిగా బుల్లెట్లు వచ్చి కారుకి తగుల్తున్నాయి. అర నిముషంపాటు విపరీతమైన రొద! ఆ మరుక్షణం హఠాత్తుగా నిశ్శబ్దం.

కళ్ళు చీల్చుకొని చూశాను, నేలమీద అస్పష్టంగా కన్పిస్తోందొక ఆకారం. అలాగే గొంతుక్కూర్చుని దానికేసి జరిగాను, రివాల్వర్ సిద్ధంగా పట్టుకొని. దాన్ని సమీపించి చూశాను. కదలికలేదు. జాగ్రత్తగా తడిమి

చూశాను. రెస్పాన్స్ లేదు. సిగార్ లైటర్ వెలిగించి దానిమీద వెలుతురు వేశాను. కణతలో బుల్లెట్ గాయంతో నిర్జీవంగా పడివున్న తుగ్లక్ కాయం.

లైటర్ ఆరిపోవడంతో మళ్ళీ వెల్గించి, లేచి నాలు గడుగులు అవతలగా వేశాను. అక్కడ వుంది విశాలమైన గట్టులేని బావి. లోపల నీళ్ళు కన్పించడంలేదు, వెలుతురు సరిపోలేనిమూలాన. దట్టమైన చీకటిగా వుంది. కప్పలు అరుస్తున్నాయి. మరేదో జంతువు కూడా వికృతంగా శృతి కలుపుతోంది....వళ్లు గగుర్పొడిచి వెంటనే కదిలి పోయాను. శవం దగ్గర నిల్చుని క్షణంపాటు సందే హించాను. గుండె చిక్కబట్టుకొని దాని కాళ్లు పట్టి లాక్కుంటూ వెళ్ళి బావిలోకి తోశాను. వెనక్కి చూడ కుండా కారు దగ్గరకి వురికాను.

అప్పుడే దూరంగా హెడ్ లైట్స్ కన్పించాయి.... వాళ్ళొచ్చేస్తున్నారు! తటాలున కారెక్కి స్టార్టుచేసి చెట్లమధ్యకి పోనిచ్చాను వేగంగా. అక్కడాపి వెంటనే దిగి నిలబడ్డాను రివాల్వర్ తో.

రెండు నిముషాల్లో ఆ కారువచ్చి ఆగింది బావిదగ్గర. లైట్లు ఆరిపోయాయి. అందులోనుంచి ఇద్దరు దిగారు. ఏవో మాటలు విన్పించాయి. టార్చి వెలిగింది.... నా రక్తం వురకలు వేసింది. శ్యామల! ఆమెని సురక్షితంగా దక్కించుకోవాలి!

టార్చి వెలుగు చుట్టూపడుతోంది. "ఏమైపోయారు?" అందొక గొంతు.

"ఇంకా రాలేదనుకుంటాను" అంది మరో గొంతు.

"ఎందుకైంది ఆలస్యం?"

"ఆగు! ఇక్కడేదో వుంది .. రక్తం!"

టార్చి వెలుగు నేలమీద ఒకచోట నిలచింది.

"అవును.... అప్పుడే పని పూర్తిచేసి వెళ్ళిపోయారా?"

"కానీ షూట్ చెయ్యమని చెప్పలేదే?"

ఇద్దరూ బావిదగ్గరికి కదిలారు. టార్చి బావిలో వేశారు. మరుక్షణం అరుపు విన్పించింది, "హో, అటుచూడు! ఏమిటవి?"

"చెప్పులు.... ఆడవాళ్ళవి!"

"గాడ్, సుమిత్రవి కదూ?"

"అవును, ఏం జరిగిందిక్కడ?"

"తారుమారైంది, యాదవ్. ఆమెతోపాటు ఇద్దరూ పోయారు ఇందులోకి. ఆ రిపోర్టర్ తో సేసి పారి పోయాడు."

"చూద్దాం, పద! రివాల్వర్ పట్టుకో!"

వెనక్కి వచ్చేశారిద్దరూ. బాటవెంట కొంతదూరం వురికారు, చుట్టూ టార్చివేసుకుంటూ. నేను వెంటనే వాళ్ళువచ్చిన కారు దగ్గర కురికాను. విండోలోంచి తొంగిచూశాను ఆరాటంగా, "శ్యామల? నేనొచ్చే శాను...." అన్నాను.

కానీ సమాధానంలేదు. నా గుండె వేగం హెచ్చి నోరు తడారింది. చటుక్కున డోర్ లాగి సీటుమీద తడిమిచూశాను. ఖాళీ! కార్లో శ్యామల లేదు!

దగ్గరలో మాటలు విన్పించడంతో వెనక్కి తిరిగి వురికాను, అయోమయంగా. తలతిరిగిపోయింది. టార్చి వెలుగు నన్ను అనుసరిస్తూ పడింది. ఆ వెంటనే అరుపు, "యాదవ్, అదుగో కాదు!"

తేరుకొని చెట్లమధ్యకి వురికాను. వాళ్ళిద్దరు కారుని సమీపించారు. టార్చివేసి పరీక్షించసాగారు. "బుల్లెట్స్

రంధ్రాలు....అందర్నీ షూట్ చేసి చంపేశాడు!"

"కానీ ఎక్కడికెళ్ళాడు, కారెక్కడ వదిలి?"

"సిటీకి రోడ్డుమీద లిఫ్ట్ సంపాయించి. ఈ కార్లోనే వెళ్లే మనం ఎదురుపడతామని భయపడివుంటాడు."

"ఓ. కే, వెంటనే బాస్‌కి తెలియజేయాలి. నువ్వీ కార్లో రా, నేనా కార్లో పోతాను" ఒక ఆకారం కదిలి వెళ్ళిపోయింది.

రెండో ఆకారం కారు డోర్ తీసింది. నేను నిశ్శబ్దంగా వెనుక చేరుకున్నాను.

"ఈ కార్లో నేను పోతాను, యాదవ్."

అతను అదిరిపడి చూశాడు, "నువ్వు—"

"నువ్వు వాళ్లోవాడివి, నా లక్కీ నెంబర్!"

రివాల్వర్ ఎత్తి నడినెత్తిమీద కొట్టాను ఫట్‌మని.

# 11

బేగం పేటలోని ఒక బంగళావరకూ ఆ కారును వెంటాడాను. అతనెక్కడా అనుమానించలేదు. తిన్నగా డ్రైవ్ చేసుకుంటూ పోయాడు.

బంగళాముందు గేటు దగ్గర ఆపిన వెంటనే లోపలి నుంచి ఒక మనిషి గేటు తెరిచి చెయ్యూపాడు. ఆ కారు కదిలింది. దాని వెనుక నేను పోనిచ్చాను.

లోపల ఆవరణంతా చీకటిగావుంది. బంగళాలో అక్కడక్కడా లైట్లు వున్నాయి. ఆ కారు ఎడమ వైపుగా వెళ్ళి గ్యారేజి ముందాగింది. అక్కడా దీపాల్లేవు. మనుషులెవరూ లేరు. అతను దిగి నా కారు దగ్గరికొచ్చాడు "యాదవ్, దిగు!" అంటూ.

నేను మాట్లాడకుండా అలాగే కూర్చున్నాను. అతను మళ్ళీ పలికాడు. నేను నిద్ర నటించాను. చీకట్లో నా

ముఖాన్ని అతను గుర్తించలేదు. అప్పుడు జరిగింది అంతా నేననుకున్నట్టు ...

అతను హాండిల్ తిప్పి డోర్ లాగి చూశాడు యాదవ్ ని పిలుస్తూ. అది రాలేదు. విండోలోంచి చెయ్యి పెట్టి నన్ను తట్టాడు. నేనదేపళంగా ప్రక్కకు ఒరిగిపోయాను. అప్పుడతను తలలోపలికి పెట్టి వంగాడు కంగారుగా, 'ఏమయింది, యాదవ్?' అంటూ — నేను గబుక్కున లేచి అద్దాన్ని పైకి లేపేశాను. అతను బాధగా అరవబోతే నోట్లో కర్చీఫ్ కుక్కి, రివాల్వర్ తో నెత్తిమీదకొట్టాను. నిశ్శబ్దంగా తలవాల్చేశాడు—

వెంటనే అవతలినుంచి కారు దిగి గేటు దగ్గరికి పరుగు తీశాను. నా వేగాన్ని చూసి అక్కడి మనిషి కంగారుగా లేవబోయాడు స్టూలుమీద నుంచి. లేచేంతలో అతని మీదపడి రివాల్వర్ తో నెత్తిమీద కొట్టాను. గంటన్నర దెబ్బ! మూర్ఛలోకి చెక్కేశాడు. స్టూలుమీద అలాగే కూర్చోబెట్టి వెనక్కి వురికాను.

అప్పుడే బంగళా వరండాలోకి ఓ యువతి వచ్చింది. పోర్టికోలోంచి పరుగెత్తివస్తున్న నన్ను చూసి అరవబోయింది భయంతో. ఆమె నోరైనా తెరవకముందే వెళ్ళి ఆమెని పట్టుకుని బలంగా కొట్టాను ముఖంమీద. కళ్ళు తేలవేసింది. జడపట్టి గుండ్రంగా తిప్పి వదిలాను. వెళ్ళి గోడకి కొట్టుకుని స్పృహ తప్పింది.

మెరుపులా హాల్లో వురికాను. అక్కడ సోఫాలో కూర్చుని రమ్మీ ఆడుకుంటోన్న ఇద్దరు నన్ను చూసి అదిరిపడి లేచారు — చేతులు జేబుల్లోకి వెళ్ళాయి. అవి బయటికి వచ్చేలోపు వాళ్ళ దగ్గరికి గెంతి ఒకడి నెత్తి బద్దలు చేశాను-కూలిపోయాడు. రెండోవాడు రివాల్వర్ తీసి

కాల్చబోయాడు. కాలెత్తి సకాలంలో దాన్ని ఎగర గొట్టాను మారంగా. "ఇది రజనీకాంత్ షాట్!" అన్నాను.

"నువ్వెక్కడ్నుంచి వచ్చావ్?" అన్నాడతను చెయ్యి పట్టుకొని బాధగా. "హాలీవుడ్ నుంచి!" అన్నాను పిడికిలితో బిగించి ముఖంమీద బాదుతూ, "ఇది జిమ్ కెల్లీ పంచ్!" రక్తం చింది నోరుపట్టుకున్నాడతను. రివాల్వర్ తో బహుకరించాను, గంటన్నర ఘాతం!

అప్పుడు పక్కనున్న గదిలోంచి మరో ముగ్గురు బాణాల్లా దూసుకొచ్చారు. వాళ్ళందర్నీ కొట్టుకుంటూ పోయాను. వాళ్ళంతా గంటన్నర వాహ్యాళికి పోయాక, మేడమీదనుంచి మరో పార్టీ విరుచుకుపడింది. వాళ్ళప్పుడే నిద్రలేచినట్లున్నారు, చేతుల్లో ఆయుధాలేవీ లేకుండా పరుగెత్తి వచ్చారు. కానీ వాళ్ళవి నా దగ్గరలేని కండలున్నాయి. నల్గురూ కలిసి కట్టగా వచ్చిన నన్ను ఢీకొన్నప్పుడు కొండకి గుద్దుకొన్నట్టు ఉక్కిరిబిక్కిరై, "అబ్బ!" అని కష్టంగా నిట్టూర్చాను.

ఆ విసురుకు తూర్పు దిక్కుగా ఎగిరివెళ్ళి తలుపులకు కొట్టుకున్నాను. అవి భళ్ళున తెరుచుకోవడంతో గదిలో కెళ్ళిపడ్డాను మెత్తమెత్తగా...ఆ చీకట్లో గమనించలేదు, నేనో పాప సౌందర్య సంపదమీద అక్రమంగా వెళ్ళి పడ్డానని. ఆమె అన్యాయమైపోయినట్లు గోల చెయ్యడంతో లేపి బయటకు గిరవాటేశాను, బ్రాందీబుడ్డిలా.

వాళ్ళొచ్చేశారు, అవురావురామంటూ, అంతకుముందే నేను మంచంమీంచిమూలకి తలుపు ప్రక్కన దాక్కున్నాను. వాళ్ళొక్కొక్కరే అతి జాగ్రత్తగా, ఎంతో అనుభవజ్ఞుల్లా గదిలో అడుగుపెడుతోంటే వరుసగా గంట— గంటన్నర మధ్యలో వుండేట్లు చూస్తూ వడ్డించుకుంటూ

పోయాను—మూర్ఛ రసగుళికలు.

బయట బ్రాందీబుడ్డీ గోల ఎక్కువ చేసింది. పరుగున వెళ్ళి ఆమె బాబ్డు హెయిర్ దొరకబుచ్చుకొని, ఆ చెంపా ఈ చెంపా వాయించేసి, యాభై శాతం తగ్గింపుతో మూడొంపు గంట గుళిక ప్రకటించాను.

అప్పుడు హఠాత్తుగా నిశ్శబ్దమేర్పడింది. అతిథుల రాకలేదు. అయితే డిన్నర్ ముగిసిందనుకొని వేగంగా పైకి మెట్లెక్కాను. ఏ గదిలోనూ శ్యామల లేకపోవడం ఆందోళన కల్గించింది. పైన మూడు గదుల్లో కూడా లేదు. ఆందోళన ఇంకా ఎక్కువవుతోంటే మూసివున్న నాల్గో గది దగ్గరాగిపోయాను.

తలుపు లోపలినుంచి తాళంపెట్టి వుంది. కంతలు లేవు. లోపల అలికిడిలేదు. తలుపు క్రిందనుంచి వెలుతురు ప్రసరిస్తోంది....

నిశ్శబ్దంగా పక్క గదిలోకెళ్ళి బాల్కనీలోకి దూకి నాల్గో గది కిటికీని సమీపించాను. అద్దాల రెక్కలు. లోపల తెరలు వ్రేలాడుతున్నాయి. భళ్ళున అద్దం పగుల గొట్టేసి, చెయ్యి లోపలపెట్టి గడియ లాగి రెక్కలు తెరిచేశాను. కెవ్వున కేక వెలువడింది.

ఆమె బెడ్ మీదనుంచి దూకేసి తలుపు దగ్గరికి వురికింది.

అతను అలాగే పడుకుని కళ్ళు పెద్దవిచేసి చూశాడు నాకేసి.

"హూ ఆర్యూ?" గద్దించింది అతని స్వరం.

"యువర్ ఆనరబుల్ గెస్టు, సర్."

"ఆయాం ది బాస్ హియర్!"

"ఐ డోంట్ కేర్."

కిటికీ నూకి అతన్ని సమీపించాను. మొకాసిన్ గ్యాంగ్ లీడర్ గభాల్న లేచి కూర్చోబోయాడు. కానీ సాధ్యంకాలేదు. బోర్లాపడ్డాడు. సంకల్పమున్నా శరీరం పెద్ద అవరోధంగా పెరిగిపోయింది. పైగా మితిలేకుండా తాగేశాడని ప్రక్కనున్న సీసాలు చెప్తున్నాయి.

"ఓహో! నువ్వు రిపోర్టర్‌వి కదూ?" అప్పుడరిచాడు నన్ను గుర్తుపట్టి.

"అవును, నువ్వు నా సీతను చెరబట్టిన రావణాసురుడివి!" రివాల్వర్ ఎత్తి అతని బట్టతలమీద ప్రతిష్టించాను.

"నీ భార్య ఇక్కడ లేదు!" గొణిగాడతను తల రుద్దుకుంటూ.

మరోసారి కొట్టాను. "తర్వాత చెబుదువుగాని, పోలీసులకి! రెస్టు తీసుకో."

అతను దిండులో ముఖం దాచుకొని మూర్ఛలోకి చెక్కేశాడు.

ఆ యువతి మరోసారి అరిచి తలుపు తీయబోయింది—

"హాయ్, స్వీట్! నువ్వెక్కడికి? నీ లవర్‌తోపాటే నువ్వూ!"

ఎగిరివెళ్ళి ఆమె నెత్తిమీద కొట్టాను. అక్కడికక్కడే పడిపోయింది.

గబగబా అతని నైట్‌గౌన్ జేబులు వెతికి తాళాల గుత్తి తీసుకున్నాను. అందులో అష్టవంకరలు తిరిగిన తాళంచెవి ఒకటి వుంది-అదే వాక్కావల్సింది. వేగంగా తిరుగుతూ గదిలో ఫాల్స్ గోడల కోసం చూశాను. కనిపెట్టలేకపోయాను. అప్పుడు మీటలకోసం వెతికాను. అవి కన్పించాయి సులభంగానే. బెడ్ మీద, తలగడవైపు

పరుపుకింద అమర్చి వున్నాయి రెండూ. నొక్కేశాను. మొదటిదానికి అలారం మ్రోగింది. రెండోదానికి ఎదురుగా గోడకున్న రాక్ తొలగిపోయి ద్వారం ఏర్పడింది.

వేగంగా ఆ రహస్య ద్వారంలోకి వురికాను. అవతల చిన్నగదిలో ఎర్రదీపం వెలుగుతోంది గుడ్డిగా. లోపలికెళ్ళి సూటిగా సేఫ్‌ను సమీపించాను. తాళం చెవితో తెరిచేశాను.

లోపల గ్యాంగ్‌కు సంబంధించిన కార్యకలాపాల భోగట్టా అంతా వుంది—ఫైళ్ళు, పత్రాలరూపంలో. నాక్కావల్సిన పత్రాలు సులభంగానే లభించాయి. కాషిక్ డాసియర్. దానితోపాటు మొకాసిన్స్ సహాయాన్ని అర్థిస్తూ కాషిక్ వ్రాసిన ఉత్తరం!

నా గుండె వేగం హెచ్చి సంతోషంతో ఒక్క కేక వేశాను.

ఈల వేసుకుంటూ తిరిగివచ్చి ఫోన్ చేశాను పోలీసులకి.

"హలో, డిసీజ్ సోమసుందర్ స్పీకింగ్. రిపోర్టర్, బ్లేడ్ వీక్లీ, రిపీట్—"

"యస్, యస్, తెలుసు. ఏమిటి సంగతి సుందర్?"

"చూడండి, పత్రికల్లో నా పేరు ప్రముఖంగా రావాలి. ఈ క్రెడిట్ నాకే దక్కాలి. లేకపోతే మా బాస్ వూరుకోరు. నే నిప్పుడొక పర్సనల్ పనిమీద వెళ్తున్నాను, ఇక్కడంతా మీరే చూసుకోవాలి."

"ఆల్ రైట్, చెప్పండి."

మొకాసిన్ గ్యాంగ్ గురించి, బావిలో శవాల గురించి వివరంగా చెప్పాను.

"అదీ సంగతి!" వాళ్ళకు అడ్రసు చెప్పి లైను కట్

చేశాను.

తిరిగి ఆఫీసుకి ఫోన్ చేసిన వెంటనే శర్మ పలికాడు.

"సర్, ఇందాక మీరు నాకు ఫోన్ చేశారా?"

"రెండుసార్లు! గాడ్, సుందర్! ఎక్కడున్నావు? నేను మీ ఇంటికొచ్చాను—"

"ఎందుకు ఫోన్ చేశారు?"

"శ్యామల ఫోన్ చేసింది!"

"ఏమిటీ!"

"శ్యామల ఫోన్ చేసింది, ఆమె ఊర్నుంచి!" అరిచాడు శర్మ.

పరిగెత్తాను, ఫోన్ పెట్టేసి.

## 12

శర్మ అన్నాడు నవ్వుతూ. "బఫూన్స్ ది గ్రేట్, మనమంతా. మన సైకాలజీని ఆసరా చేసుకొని వాళ్ళొక ఆట ఆడారు. మనల్ని ఫూల్స్ చేశారు, కిడ్నాప్ని బుకాయించి. నీ సంగతి ఎలావున్నా నాకిప్పుడు చచ్చేంత అవమానంగా వుంది. ఎక్కడ ముఖం దాచుకోవాలో తెలియటంలేదు."

"శ్యామల ఏం చెప్పింది? ఎందుకింత రాత్రి ఫోన్ చేసింది?" అన్నాను తేలిగ్గా నిట్టూరుస్తూ.

"నిద్రపోతే పీడకలలొస్తున్నాయట, నీ క్షేమం తెలుసుకుందామని ఫోన్ చేసింది....నువ్వు విజయవంతంగా తిరిగొచ్చావని చెప్పాను. సంతోషించింది. కానీ, ఆమెను గురించి మనం ఎలా కంగారుపడ్డామో విని పగలబడి నవ్వింది. నెంబర్ ఇచ్చి, నిన్ను కాంటాక్టు చేసి తనని పిలవమంది. కాని ఇంటికి రెండుసార్లు ఫోన్ చేసినా నువ్వు లేవు. ఏదో శంకించి నీ ఇంటికొత్తే—"

"కాల్ బుక్ చేశారా?"

"చేశాను."

"బ్రతికించారు. నా ప్రాణం ఇప్పుడు కుదుటపడింది. నా మనసు ఇప్పుడు నెమ్మదిపడింది. హమ్మయ్య, రిలాక్స్ అవుతాను."

"కానీ మీ అవతారమేమిటి? ఏం జరిగింది?" రాబర్టు అన్నాడు.

జేబులోంచి కవరుతీసి అతనిముందు పడేశాను. అసిస్టెంట్ ఎడిటర్ మంచినీళ్ళందించాడు. తాగి మూతి తుడుచుకున్నాను.

"ఏమిటిది?" అడిగాడు రాబర్టు.

"స్టోలెన్ ప్రాపర్టీ కలెక్టడ్."

శర్మ చటుక్కున దాన్ని లాక్కుని విప్పి చూశాడు. "డాసియర్! ఇది.... ఇదెక్కడిది!" అర్చాడతను గబుక్కున లేచి.

"డాసియర్‌తోపాటు కౌషిక్ తనపై సగర్వంగా జారీచేసుకున్న అరెస్టు వారెంట్ కూడా వుంది, చూడండి" అన్నాను.

శర్మ చూసి సంతోషంతో ఒక్క కేక వేశాడు. ఆనందం పట్టలేక గంతులేయసాగాడు. నన్ను పట్టిలేపి గదిలో చుట్టూ తిప్పుతూ డాన్స్ చేయసాగాడు. విధిలేక నేనూ చేశాను. రాబర్టు, మోహన్‌లు పగలబడి నవ్వుతున్నారు మమ్మల్ని చూసి....

అప్పుడు హఠాత్తుగా ఫోను మ్రోగింది—

శర్మని విడిపించుకొని రిసీవరెత్తాను.

ఆపరేటర్ గొంతు ఫలానావారు ఫలానా వారితో ఇక మాట్లాడుకోవచ్చని చెప్పి తప్పుకుంది.

"హలో, శ్యాం! శ్యాం! శ్యాం! మై లవ్."

"ఓహ్, నేనే! ఏమిటి, ఏదో కంగారుపడిపోతున్నారట?"

"నిన్ను కిడ్నాప్ చేశారని—"

"నన్నెవరు కిడ్నాప్ చేస్తారు? దమ్ములుండాలి. నేనిక్కడ క్షేమంగానే చేరుకున్నాను. వాళ్ళెవరో మిమ్మల్ని ఆటపట్టించారు."

"అవును, మమ్మల్ని బుకాయించి పని వెళ్ళదీసుకోవాలనుకున్నారు."

"మీరెలా వున్నారింతకీ!"

"ఎలా వున్నానని కాదు, ఏం చేశానో రేపు పేపర్లో చూడు!"

"అబ్బో....హీరోయిజమా?"

"అంతే....హీరోయిజమ్."

అవతల నవ్వు. "వాళ్ళెవరో నిజంగానే నన్నెత్తుకుపోతే ఎంత బాగుండేది! మీకు బుద్ధొచ్చేది!"

"నాకు బుద్ధొచ్చింది శ్యాం, శర్మ చెప్పాడు."

"ఏం చెప్పాడు?"

"ఇక్కడ గొడవలు ముగిశాక ఫోన్ చేస్తాను, వెంటనే వచ్చేయ్. నీకు కొత్త జీవితాన్నిస్తాను."

"కొత్త జీవితమా?"

"అవును డియర్, నిన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తాను!"

"అంటే చక్కిలిగింతలు పెడతారా?"

"షటప్, యూనాటీ....నీ భావ జాగ్రత్త!" అరిచి ఫోన్ పెట్టేశాను.

వాళ్ళు ముగ్గురు ముసిముసిగా నవ్వుకుంటున్నారు.

—:అయిపోయింది:—

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చెరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- లు నగదు బహుమతి పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును. •

# రక్తం త్రాగే పిశాచం

వసుంధర



(గత సంచిక తరువాయి)

**7**

వకుళ ఒక్కత్తే నిద్రపోతోంది.

ఉన్నట్లుండి యెవరో వళ్లంతా తడుముతున్నట్లు అ
పించిందామెకు. ముందు శరీరానికి గిలిగింతలు పెట్టినట్లు

మత్తుగా ఊరుకుంది. కానీ తర్వాత ఏదోలా అనిపించి ఉలిక్కిపడి లేచింది.

"ఉష్- నేను కోదండాన్ని-"

"ముందు నువ్వు బయటకు వెళ్ళు!" అంది వకుళ.

"వెళ్లను...."

"అయితే గట్టిగా అరుస్తాను...."

చటుక్కున కోదండం ఆమె నోరు నొక్కేసి "ఎలా అరుస్తావో చూస్తాను" అన్నాడు.

వకుళ గిలగిలా తన్నుకుంటోంది. అతగాడామెకు బట్టలు విప్పేస్తున్నాడు.

వకుళ సర్వశక్తులూ క్రోడీకరించుకుని పెనగులాడు తోంది. కోదండం పశుబలంతో వ్యవహరిస్తున్నాడు.

వకుళ వివస్త్ర అయింది. తన సర్వశక్తులూ నాశన మైనట్లు భావిస్తోందామె.

అమావాస్య ఇంకా నాలుగురోజులుంది. ఇంతలో ఈ అవాంతరం.

కోదండం వకుళను వదిలిపెట్టి "ఇప్పుడరవ్వే చూస్తాను" అన్నాడు.

వకుళ అరవలేదు. అరిస్తే ఇంట్లో వాళ్ళెవరూ తనను రక్షించరు. ఆ అలుసు చూసుకునే కోదండం ఇటుగా వచ్చాడు. తను బయటివాళ్ళకోసం అరవాలి. ఈ రూపంతో తను బయటివాళ్ళ కళ్ళబడదల్చుకోలేదు. కోదండానికి బలంతోపాటు తెలివితేటలు కూడా ఉన్నాయి.

చీకట్లో వకుళ - కోదండం ఒకరికొకరు ఎదురుగా ఉన్నారు. అవమానంతో కోపంతో బుసలు కొడుతున్నది వకుళ. కామంతో బుసలు కొడుతున్నాడు కోదండం. అతనామెను బలంగా కౌగలించుకున్నాడు.

ఆ కౌగిలి వకుళకు జుగుప్సాకరంగా ఉన్నది—"కోదండం-నేను చెప్పింది .. మరిచిపోయేవా? కొద్ది రోజులు నన్ను వదల్లేవా?"

"నిన్ను వదల్లేను నేను. అలాగని నీకన్యాయమూ చేయను. నిన్ను నేను తప్పక పెళ్ళిచేసుకుంటాను...."

"పెళ్ళి చేసుకునేదాకా కాస్త దూరంగా ఉండలేవా?"

కోదండం నవ్వాడు "నీ ఎత్తులన్నీ నాకు తెలుసు. వీలుచూసుకుని ఆ మధుగాడితో లేచిపోదామనుకుంటున్నావ్. నిన్ను పెళ్ళి చేసుకోవాలంటే యిలా లొంగదీసుకోవడమొక్కటే మార్గమని శారదక్క చెప్పింది."

వకుళ చలించిపోయింది. ఛీఛీ అనుకుందామె. ఆఖరికి పిన్ని ఇంత నీచానికి దిగిందా? తను ఆడదై ఉండీ ఒక మగాణ్ని మరో ఆడదాన్ని చెరచమని పురమాయిస్తుందా?

"పిన్నీ-నీ పని అయిపోయింది. నిన్ను... నిన్ను ...." ఆవేశంతో ఆమెకు మాటలు రాలేదు.

కోదండం ఆమెను ఏమేమో చేయడానికి ప్రయత్నిస్తున్నాడు. అతడి చేష్టలామెకు ఎంతో జుగుప్సాకరంగా ఉన్నాయి. కానీ ఆమె అతణ్ని ప్రతిఘటించలేకపోతోంది. కోదండం ఆమెను మంచం వైపుగా నడిపిస్తున్నాడు.

ప్రతి అడుగూ భారంగా వేస్తోంది వకుళ.

ఒకటి.... రెండు.... మూడు.... నాలుగు....

అమావాస్యకు సరిగ్గా నాలుగురోజులు.

అప్పుడే కాలికి ఏదో తగిలి ఇద్దరూ కిందపడ్డారు.

కాలికి తగిలిందేమిటో వకుళ గుర్తుపట్టింది. ఆమెబుద్ధి చురుగ్గా పనిచేసింది. పడిపోగానే చేతుల్తో రోకలిబండను అందుకుంది. గోడకు మేకులు కొట్టాక అది ఇందాక తనే అక్కడ మర్చిపోయింది. ఇప్పుడది ఇంకోలా పనికొస్తోంది.

వకుళ ఆ బండను అందుకుని శరవేగంతో లేచి— కోదండం లేచేలోగా గురిచూసి అతడి తలమీద గట్టిగా బాదింది.

సరిగ్గా ఒక్కటే దెబ్బ—"అయ్యో!" అని తల పట్టుకుని పడిపోయాడు కోదండం.

చీకట్లో వకుళ కళ్ళు బాగానే కనబడుతున్నాయి.

ఆమె పరుగున వెళ్ళి బట్టలు కట్టుకుంటోంది.

కోదండం కేక గట్టిగానే పెట్టాడు. చుట్టుపక్కల వాళ్ళు కాకపోయినా ఇంట్లో వాళ్ళు లేచి వచ్చారు.

రక్తపుమడుగులో ఉన్న తమ్ముణ్ణి చూసి శారద— "తమ్ముడూ!" అని బిగ్గరగా అరచింది.

ఈలోగా అక్కడికి వకుళ వచ్చింది.

"ఏం జరిగిందే?" అంది శారద తీవ్రంగా.

"దొంగ కాబోలు—"అంది వకుళ చాలా నెమ్మదిగా.

జోగారావు అప్పటికప్పుడు డాక్టర్ని పిల్చుకుని వచ్చాడు—"దెబ్బ బలంగా తగిలింది. బ్రతకడం కష్టం- పోలీసు రిపోర్టిస్తారా?" అనడిగాడు డాక్టరు.

జోగారావుకు పోలీసులంటే భయం. పోలీసుల ప్రసక్తి లేకుండా వైద్యం చేయమని డాక్టర్ని కోరాడతను.

కోదండం చావు బ్రతుకుల్లో ఉండగా శారద వకుళని నిలదీసింది.

వకుళ నిర్భయంగా నేరం ఒప్పుకుంది—"నువ్వే వాణ్ణి నామీదకు ఉసిగొల్పావు. వేరే దారి లేక వాణ్ణి

కొట్టాను—"

"కొట్టడం కాదు—చంపేశావు. రేపొద్దున వాడు చచ్చిపోతే పోలీసులు నిన్ను హంతకురాలంటారు. ఉరి తీస్తారు. ఆ విషయం తెలుసా?"

వకుళ నవ్వి—"పిన్నీ! ఒక హత్య చేసినా రెండు హత్యలు చేసినా మూడు చేసినా నాలుగు చేసినా హంతకురాలి పేరు మారదు. హంతకురాలిగానే ఉండి పోతుంది. నేను ఉరికంబం ఎక్కితే ఒక హత్యకు ఎక్కాను...." అంది. ఆమె నవ్వు మామూలుగా లేదు.

శారద భయపడింది. అయినా బింకంగా—"నీ నేరానికి ఋజువులేదనుకోకు. కోదండానికి తెలివి వస్తే నీ గురించి చెప్పేస్తాడు. అప్పుడు నీ బ్రతుకు జైలుపాలవు తుంది—" అంది.

"ఇంటికన్నా జైలే నయం—" అని నవ్వింది వకుళ-"పిన్నీ! మనిషిని కొట్టిన నేరానికి జైల్లో వేసిన మనిషి జైలునుంచి తిరిగి రావడం కూడా ఉంటుంది. అలా వచ్చిన మనిషికి మళ్ళీ జైలుకెళ్ళాలంటే భయం కూడా ఉండదు—"

"బెదిరిస్తున్నావా?" అంది శారద.

"ప్రతి మనిషికీ మంచిరోజులుంటాయి. నాకూ మంచి రోజులు వస్తున్నాయి. అందుకే కోదండాన్ని నేను కొట్టగలిగాను—" అంది వకుళ. వకుళ అలాగనడానికి కారణముంది. కోదండం ఆ రాత్రి తన వంటిమీద చేయి వేయగానే—తన పని అయిపోయిందనుకుందామె. తన్ను తాను కాపాడుకొనగలనన్న ధైర్యం ఆమెలో ఏ కోశానా లేదు.

కోదండం చావలేదు. బ్రతికాడు. కానీ మంచంమీద

మూడు వారాలున్నాడు.

ఈలోగా వకుళ అఖురిజపం అయిపోయింది. ఆ రోజున ఆమె ఆనందం వర్ణనాతీతం.

ఒక్క రాత్రి హాల్లో లైటువేసుకుని పిచ్చిగా గెంతులు వేస్తూ నృత్యం చేయసాగిందామె. కాస్సేపయ్యాక పాటలు కూడా ప్రారంభించిందామె. మధ్యలో అదో రకంగా నవ్వులు.

ఆమె అలా నవ్వుకుంటూ నృత్యం చేస్తూంటే శారదకు మెలకువ వచ్చింది. ఆమె లేచి హాల్లోని దృశ్యంచూసి హడిలిపోయి—కెవ్వుమని కేక వేసింది.

వకుళ నృత్యం పిశాచ నృత్యంలా వుంది.

శారద కేకవిని వకుళ ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చి పిన్నిని చూసి తడబడి నృత్యం ఆపివేసింది.

శారద ఇంకా వణుకుతూనే ఉన్నది. ఈలోగా అక్కడికి జోగారావు వచ్చాడు—."ఏం జరిగింది?"

"వకుళ పిచ్చిపిచ్చిగా నవ్వుతూ, గెంతులు వేస్తూంటే చూశాను. ఆ దృశ్యం ఎంత భయంకరంగా ఉందో చూస్తేగానీ తెలియదు—" అంది శారద.

వకుళ మడత మంచం వాల్చుకుని మాట్లాడకుండా పడుకున్నది.

జోగారావు భార్యను తీసుకుని వెళ్ళిపోయాడు.

వకుళ ఇప్పుడు తన తొలి ప్రయోగం గురించి ఆలోచిస్తోంది. అందుకు ఎవర్నెన్నుకోవాలి? అది హితులపైనా సన్నిహితులపైనా ప్రయోగించాలని చెప్పాడు సాధువు. తనకలాంటి వారెవరున్నారు?

మధు....అతడే తన ఆశాకిరణం....

"సార్!" అన్నాడు లింగం.

మహాదేవుడు ఒకసారి వొర్లి అటుతిరిగి పడుకున్నాడు.

"సార్ — మిమ్మల్నే...." లింగం మహాదేవుణ్ణి కుదిపాడు.

"ఊఁ" అని మూలిగాడు మహాదేవుడు.

"ద్రావకం రంగు మారింది సార్!" అన్నాడు లింగం.

"ఏమిటీ?" ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడు మహాదేవుడు.

"ద్రావకం రంగు మారింది సార్!" మళ్ళీ అన్నాడు లింగం.

మహాదేవుడు మంచంమీంచి దిగి లేచి నిలబడి లాబరేటరీలోకి పరుగెత్తాడు. లింగం ఆయన్ననుసరించాడు.

మహాదేవుడు ఆత్రుతగా రంగుమారిన ద్రావకాన్నే చూస్తున్నాడు. ఆయన కళ్ళు మెరుస్తున్నాయి. ఈ ప్రపంచాన్ని జయించిన ఆనందం ఆయన కళ్ళలో కనబడుతోంది.

"ఇప్పుడు వివరాలు చెప్పు!" అన్నాడాయన. లింగం ఉత్సాహంగా చెప్పుకుపోతున్నాడు.

సంతోషమే మరి!

శవాల్లో చైతన్యం కలిగించడం కోసం పరిశోధనలు మొదలుపెట్టి ఎలుకలమీద కొన్ని పరీక్షలు జరిపాడు ప్రొఫెసర్. వాటి ఆధారంగా ఓ మందు ఫార్ములా తయారు చేశాడు. అందుకు ఎన్నో మిశ్రమాలు పరిశీలించాడు. అలాంటి అనేక మిశ్రమాలలో ఒకటి ఎలుకలపై తన ప్రభావాన్ని చూపించింది. (ఇంకా వుంది)

